



# [illegible]

తొలికూర్పు

ప్రభవ – ఫాల్గుణము.

మార్చి 1928

పంగనామముల రామచంద్రరావు
గ్రంథకర్త



గుంటూరు శ్రీ వేంకటేశ్వర ముద్రాక్షరశాలయందు ముద్రితము

---

# పాత్రలు



[అంకెలు దృశ్య సంఖ్యం దెలుపును]

నలగామరాజు — గురిజాలరాజు (శైవమతస్థుండు) (4, 9, 13, 17, 27, 28)

నరసింగరాజు — నలగామరాజు తమ్ముండు (శైవమతస్థుడు) (5, 8, 9, 13, 16)

నాయకురాలు — గురిజాల మంత్రిణి శైవమతస్థురాలు (3, 4, 5, 8, 9, 13, 16, 17, 20, 25, 28)

కోటకేతుడు — రాయబారి, ధరణికోట రాజయిన భీమదేవుని కొడుకు (17, 20, 21, 22, 28)

అలరాజు — నలగామరాజున కల్లుండు, పెదమల్లదేవుని భావమఱంది యగు కొమ్మరాజునకు కొడుకు. (శైవమతస్థుడు) (13, 14)

పెదమల్లదేవుండు — మాచెర్లప్రభువు, నలగామరాజు సవతితల్లి కొడుకు (వైష్ణవమతస్థుండు) (7, 10, 15, 22)

బ్రహ్మనాయుండు — మాచెర్లరాజ్యమంత్రి, నలగామమల్లదేవుల తండ్రి యయిన యలుగురాజు చనిపోయిన వెనుక రాజసోదరులను ప్రేమముతోం జూచుచు నీతి గఱపి యుండిన రాజ్యతంత్రజ్ఞుండు బలశాలి అంటరానితనమును బోంగొట్టుటకై జీవితమును ధారవోసిన మహాత్ముండు (వైష్ణవమతస్థుండు) (2, 7, 10, 11, 15, 22, 24, 25, 28)

బాలచంద్రుండు — బ్రహ్మనాయనికిని నైతమ్మకును జాలకాలమునకుం గలిగిన వీరాధివీరుడు (1, 7, 10, 12, 15, 19, 22, 25)

కన్నమదాసు — మొట్టమొదట బ్రహ్మనాయనికి సంతానము లేకపోవుట వలననతండు పెంచుకొనిన మాలపిల్లవాండు (1, 7, 10, 15, 22, 28)

కొమ్మరాజు — కళ్యాణపురాధీశ్వరుం డయిన వీరసోముని కొడుకు. కారణాంతరములచే రాజ్యము గోల్పోబడియుండుటచేం గొడుకగు నలరాజుతోంగూడం బెదమల్లదేవుని యొద్ద నుండిన వాండు. తన చెల్లెలిని బెదమల్లదేవుని కిచ్చి వివాహముం జేసిన వాండు (26)

రామశాస్త్రి — పెదమల్లదేవుని పురోహితుండు (23, 26)

అన్నమ్మ — వైశ్యతరుణి (19)

పోతరాజు — అలరాజు మరణవార్త వీరమేడపికిం దెచ్చిన బంధువు (15)

దోర్నీడు — బాలచంద్రుని స్నేహితుండు (6, 18, 19)

సేవకుండు — (4, 13, 15, 17, 16)

# పల్నాటి పౌరుషము

## మూలకథ

ఇప్పటి నాగపురము జబ్బల్పురము నను రెంటికి మధ్యనున్న దేశము పూర్వము చేదిదేశ మని పిలువబడుచుండెను. పండ్రెండవ శతాబ్దములో నా దేశమును బరిపాలించుచుండిన యనుగు రాజు మహమ్మదీయుల దండయాత్రల వలననో తదితరకారణముల వలననో రాజ్యభ్రష్టుండై సకుటుంబముగా స్వదేశమును వీడవలసివచ్చెను. తిరిగి తిరిగి గుంటూరు మండలములోని కృష్ణాతీరమందలి యమరావతికి వచ్చి స్వామిని సందర్శించి కడ కచ్చటనే యుండ నిశ్చయించుకొనెను. ఆయన యచ్చట గొన్ని దినములకుఁ జందవోలులో రాజ్యము సేయుచున్న ప్రభువు కూఁతును మైలాంబను అనుగు రాజు వివాహమాడెను. తండ్రి కూఁతునకు బల్నాడరణ మిచ్చెను. అందుచేత అనుగురాజు గురిజాల రాజధానిగాఁ జేసికొని పల్నాటికి రాజయ్యెను. మైలాంబ కాక యనుగురాజునకు వీరవిద్యాదేవి, భూరమాదేవి యను మఱి యిర్వురు రాణులు గలరు. మైలమ్మకు నలగామరాజు, భూరమాదేవికి నరసింగరాజు, కామరాజు, ఘట్టిరాజు, పెరుమాళ్లరాజు, వీరవిద్యాదేవికిఁ బెదమల్లదేవుఁడు, పినమల్లదేవుఁడు, బాలమల్లదేవుఁడు — నను కుమారులు గలిగిరి. అనుగురాజునకు దొడ్డనాయుఁడను వెలమ మంత్రిగా నుండెను. దొడ్డనాయునికి బాదరాజు, బ్రహ్మనాయుఁడు కుమారులు.

మొదట ననుగురాజునకు సంతానము లేకపోవుట వలన నతఁడు బాదరాజును దెచ్చుకొని వివాహము గూడఁ జేసెను. రాజమంత్రికుటుంబములు రెండును నీరక్షీరముల వలెఁ గలిసియుండెను.

కొంతకాలమునకు రాజమంత్రు లిర్వురును గతించిరి. నలగామరాజు సింహాసన మెక్కెను. నాగమ్మ యను నొక స్త్రీ (నాయకురాలు) యనుగురాజు పోయిన వెనుక శైవమతోద్ధరణము నిమిత్తము ప్రయత్నించుచు నలగామరాజు నొద్ద మంత్రిణియై వైష్ణవమతమును ద్వేషించుచు శైవమతము నుద్ధరింపఁ జొచ్చెను. బ్రహ్మనాయుఁడు, మల్లదేవులు మాత్రము వైష్ణవమతాభినివేశులు. మతదురభిమానమాధ్యంబు లేలేక నాయకురాలి దురాలోచనములే పల్నాటియుద్ధమునకుఁ గారణము. బ్రహ్మనాయుఁడు చిన్నవాండ్రైన నలగామరాజు మల్లదేవులు మొదలగు వారి యందఱ నధికప్రేమమున జూచుచు నీతిబోధ గావించి యుండెను. అయినను శైవమతో[illegible] టాళ్ళు పెట్టి వైష్ణవోద్రేకులయిన బ్రహ్మనాయునిపై మల్లదేవులపై నలగామరాజు ద్వేషవృత్తి ప్రసరించునట్లుగా నాయకురాలు పన్నుగడలఁ బన్నుచుండెను. తుదకుఁ బిల్లలగు మల్లదేవులకు విషము గూడఁ బెట్టింప నెంచెను.

అంతట బ్రహ్మనాయుఁడు మల్లదేవుల పక్షమున వాగ్వాదము సల్పి వారిని మాచెర్లకుం గొంపోయి పెదమల్లదేవుండింకను జిన్నవాఁడే యగుట వలన దానే పరిపాలింప నారంభించెను. నాయుని వైష్ణవమతాభిప్రాయములు గతానుగతికహిందూ సంప్రదాయవ్యతిరేకమును గుదుళ్ళతోఁ బెకలించునట్లు శైవులకుఁ బొడఁగట్టెను. అతఁడు మానవులందఱు సమానులనియు పంచములనస్పృశ్యులుగా భావించుట పాడిగాదనియు నుపన్యాసము లిచ్చుచుండెడి వాఁడు ఇదియే నాగమ్మకు నతనికి గలిగిన గొప్ప యభిప్రాయభేదము.

కొన్నినాళ్లకుఁ బెదమల్లదేవునికిఁ గళ్యాణపురాధీశ్వరుఁడైన వీరసోమేంద్రుని కూఁతును బెండ్లి

చేసి బ్రహ్మనాయఁడు మాచెర్లసింహాసన మిచ్చి తాను మంత్రిగా నుండి వ్యవహారమంతయు జరపుచుఁడెను.

నాగమ్మ యంతటితో విడువక నరసింగరాజుతోఁడి దురాలోచనములు చేసి కోడిపోరొకటి పెట్టి యందులో బ్రహ్మనాదుల నోడించి వారి రాజ్యమూడఁబెఱికికొని వెడలఁగొట్టెను. వారు మండాది యడవులలో నుండునప్పుడు నాయకురాలు చెంచులచేఁ బశువులదోఁచించి లంకన్నయను పశువుల కాపరి నిజంపించెను. తరువాత వారు దూరభూములకుఁ బోయి మేడపిలో నివాస మేర్పఱచుకొనిరి. ఏడేండ్లు గడచెను. వీరసోముని యనంతరము రాజ్యము గోల్పోయిన కొమ్మరాజు నతని కుమారుఁడలరాజును పెదమల్లదేవుని యాశ్రయముననే యుండిరి. గడువేడేండ్లు దాఁటఁగానే బ్రహ్మనాయఁడు — తన కుమారుఁడు బాలచంద్రుఁడు మొదలగు వారు వలదనినను — అలరాజును రాయబారిగా గురిజాలకుఁ బంపెను. నాయకురాలు మాచెర్ల రాజ్య మివ్వ ననెను. అలరాజు నలగామరాజునకుఁ బిల్ల నిచ్చి కొన్న యల్లుఁడైనను — నాయకురాలు నరసింగరాజుతో దురాలోచనముఁ జేసి చెర్లగుడిపాటి యరణ్యములలో రాయబారికి విషాహారంబు పెట్టించి చంపించెను.

ఈ కబురు మేడపిలోఁ దెలిసెను. వీరులు కోపోద్రిక్తులయిరి. యుద్ధము కారంపూడిలో జరగెను. ధరణికోట యువరాజయిన కోటకేతువు నాగమ్మను బ్రోత్సహించి కొన్ని మతనియమములతో మాచెర్లరాజ్య మిచ్చివేయున ట్లొడంబఱచి పెదమల్లదేవుని సభకు యుద్ధము మొదలు పెట్టిన రెండుమూఁడు దినములకు సంధి సేయింపఁ గోరి వెడలెను. అలరాజును, జంపించిన కారణముచే రాజ్య మిచ్చుచున్నను బాలచంద్రుఁడు మొదలగు వారు సంధి కొప్పుకొనలేదు. యుద్ధము మఱల సాగించిరి. పెదమల్లదేవుఁడు బాలచంద్రుఁడు నరసింగరాజు మున్నగు యుద్ధవీరులు దెగిరి. బ్రహ్మనాయఁడు నలగామరాజు నాయకురాలు మిగిలిరి. కడకు నలగామరాజు పల్నాటిరాజ్యమున కంతటికిఁ బ్రభు వగునట్లును బ్రహ్మనాయఁడు మంత్రిగానుండునట్లును, గన్నమదాసను బ్రహ్మనాయఁడు పెంచుకొన్న మాలకొడుకు వైష్ణవమతప్రచారమును, నాయకురాలు శైవమతమును నుద్ధరించునట్లును నియమము లేర్పఱుపఁబడెను. నలగామరాజు పల్నాటికిఁ బ్రభువయ్యెను.





శ్రీతిరుపతివేంకటేశ్వరార్పితము.

# పల్నాటి పౌరుషము

దృశ్యము 1

కన్నమదాసు - బాలచంద్రుఁడు ప్రవేశము.

గురిజాల పట్టణము.

—◆ బాలచంద్రుఁడు ◆—

అన్నయ్యా! భగవల్లీలలు చిత్రములు మాత్రమే కాక హాస్యాస్పదములు గూడఁగదా.

జిట్టగామాలపాటి కంచెల నెవండో
అవైచిన పిల్ల— పెంపకమొ... రెడ్డి
ప్రేమిడు గురిజాలరాజ్యమంత్రిత్వ మూను
నహహా! నాయకురాలి భాగ్యాతిశయము.

—◆ కన్నమదాసు ◆—

తమ్ముఁడా! బాలచంద్రా! వర్ణాశ్రమధర్మములు నిలుపుచు శైవమతోద్ధరణము గావించు నాశచే నాగమ్మకు నలగామరాజు మంత్రిపదం బిచ్చినాఁడే కాని యామె మతోన్మాదముచేఁగలుగు విపరీతప్రజ్ఞాప్రదర్శనము రాజ్యంబు నచిరకాలములో నొక కొలికికిఁ దీసికొనివచ్చునని తెలియఁగఁడు.

—◆ బాలచంద్రుఁడు ◆—

వర్ణాశ్రమధర్మోద్ధరణము మనకుఁగూడఁ గావలసినదియే. భేదాభిప్రాయము నిమ్నజాత్యభ్యుదయవిషయమున మాత్ర మున్నది. ఏది యెట్లున్నను తండ్రిగారికి నేటితో గురిజాలనీటిబుణము తీఱిపోయినదిగదా.

—◆ కన్నమదాసు ◆—

ఆమె యిటిపోషణము విషాహారదాన ప్రయత్నములలోనికిఁ గూడ దిగినదని తెలిసి తండ్రిగారు నోరుజేసికొని మల్లదేవులకొఱకు మాచెర్ల రాజ్య మూడఁబెఱికికొనెఁ గాని మన మంతగాఁ జింతింప నవసరము లేదు.

—◆ బాలచంద్రుఁడు ◆—

మనతండ్రిగారేయింక మాచెర్ల ప్రభువులు

—◆ కన్నమదాసు ◆—

అవును. కొన్నిదినములు మాత్రము. ఈ సంవత్సరము గడవఁగానే పెదమల్లదేవునికిఁ బరిపాలననిర్వహణసమర్థమైన వయస్సు వచ్చును గాన నాతనికి రాజ్యాభిషేకం బొనర్చి వారు మంత్రిపీఠం బలంకరింతురు.

—◆ బాలచంద్రుఁడు ◆—

(దూరమునజూచి) అన్నయ్యా! కన్నమదాసూ!

చిరము పెరిగిన గురిజాలపురమునందు
నాన్నగారిచ్చు తుదియుపన్యాసమునకుఁ
దరలెడి జనంబు తండోపతండములుగ
వారివాక్యామృతముఁ గ్రోలివచ్చుకొఱకు.

—◆ కన్నమదాసు ◆—

మనముగూడఁ బోవుదము రమ్ము.

(తెరపడును)

దృశ్యము 2

గురిజాలదేవాలయావరణము.

బ్రహ్మనాయని యుపన్యాసము.

— బ్రహ్మనాయఁడు —

శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగం
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వన్దే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథం

(అనుధ్యానశ్లోకమును జదివి) శ్రీమతే రామానుజాయ నమః

మహాశయులారా! గురిజాలమండలప్రజలారా!

అధికారధూర్వహుండను గాకపోయినను, మీరు విశ్వమానవసౌభ్రాత్రము మనసునందుంచుకొని యీ సోదరుం డంపిన యాహ్వానమును బుర

స్మరించుకొని మీ మీ పనులు మాని యోపికతో వినవచ్చినందులకు వందనసహస్రంబు లర్పించు చున్నాను.

పల్నాటిరాజ్యము పూర్వ మనుగురాజు కాలంబునుండియుఁ దన యవిచ్ఛిన్నకీర్తినర్తకీలాస్యంబున నెట్లితరరాజ్యంబుల దిగ్భ్రాంతి నొందించు చున్నదో మీలోని పోలిరెడ్డిగారు, పంచమకులజులగు పిచ్చయ్యగారు, పుల్లానధానిగారు, మొదలగు వయోవృద్ధులకుఁ దెలియనిది కాదు. మా రేచర్ల వంశము వెలమవంశ మైనను క్షత్త్రియకులుండ నని చెప్పికొను కీర్తిశేషుఁ డయిన యలుగురాజు తొలుదొల్త సంతానము లేమిచే నా సోదరుండగు బాదరాజును బెంచుకొని వివాహంబు గూడఁ జేసి నమాట మీ రెఱుంగనిది కాదు. అట్టి రాజబంధుత్వముగూడఁ గల్గి నీరక్షీరము లవలెఁ గలిసిమెలసి యుండి రాజ్యప్రతిష్ఠలు గాపాడవలసిన భారము నా మీఁదఁగూడ నున్నను నీ నాఁడు పల్నాటి రాజ్యములో నుండి మాచెర్ల భాగమును విభజింపఁ జేసి పెదమల్లదేవుని, చినమల్లదేవుని, బాలమల్లదేవుని దీసికొని గురిజాల విడిచి పోవుచున్నందులకు నన్ను మీరు నిందింపఁగల్గినను దురవగాహములగు లీలలు గల కాలపురుషునిగూడ మీ నిందలకు గురిచేయవలసియుండును. మావంశము క్షత్త్రియ వంశము తోడి కలయిక — యను మకిలనీటికడ వలోఁ బరస్పరానురాగస్నిగ్ధత్వ మనెడి చిల్లగింజ నఱగఁదీయుట వలన తేఱినట్టి దృఢమైన యైకమత్యం బను తేటనీరు మధ్యవచ్చిన నాగమ్మగారి [illegible]భావమువలన నేమి - మా దురదృష్టంబు వలన నేమి - మలినఁ గళంకితము చేయఁబడి నది.

చిరకాలము నా తండ్రిగారగు దొడ్డనాయఁ డలుగురాజుక్రింద మంత్రిపీఠంబు [illegible] యపారమైన ఖ్యాతి గడించియుండుట సర్వజనవిదిత[illegible]యముల అట్టి వానికిఁ బుత్త్రుఁడై పుట్టిన నన్ను మీ రె[illegible]డు. అంతి[illegible] యో మా ఱులు సభలలో "పులిపిల్ల" యని [illegible]గలాలసు "తండ్రిని మించిన కొడుకు" కనియు, "ద్రోణా[illegible]ను నాకు తె[illegible] ర్యుని మించిన యర్జునుఁ" డనియు "వాల్మీ[illegible]నేల యని [illegible] రామాయణమనోహరశ్లోకంబుల మించిన నిగ[illegible]ము గాదు. [illegible] ధార్థసార" మనియు నిట్లెన్నెన్నియో — [illegible] మహా [illegible] కోలుపలుకు లాడితిరి గాని యా పలుకులలో [illegible]రగయు నై [illegible] యాథార్థ్యమును జూపించుటకు భగవంతుఁ డుగు పెట్టినది [illegible] కాశ మిచ్చినవాఁడు గాఁడు. నిశ్చయముగా నిం మాట [illegible] కీర్తిమంతమైన పల్నాటిరాజ్యవుఁ బ్రతిష్ఠఁ గొ[illegible]గామరాజ ఘటకు నన్నసమర్థునిగా నెంచియే నాగమ్మ [illegible]కుచుండుట మంత్రిపీఠంబునకు వచ్చునట్లు చేసెనేమో యొవ[illegible]ర్ధనము చెప్పఁగలరు! కానిందు నెవరికెన్నాళ్లీనీటి [illegible]ంచినా[illegible] తెలియదు గదా. కాని శారీరక బలమును బట్టి కాదు గాని మెదటియొక్క పటుత్వమును బట్టి కాని తదిత[illegible] విషయములఁ బట్టి కాని సాధారణముగా [illegible]నబట్టికొని గు[illegible] యని సార్థకనామముఁ బొందిన యాఁతుది రాజు[illegible]న్నాను. [illegible]నైన నుండవచ్చును గాని మంత్రిపదంబున ను[illegible]గామరా[illegible] రాదేమో యని నాకు శంక వొడముచున్నది. అ[illegible]దఱు [illegible] జ్ఞుఁడను. నా యూహ సరికాకపోవచ్చును. అ[illegible]మకారము మాత్రముచేత మంత్రిణిని దొలఁగింపుఁడని మీవ[illegible]పిస్థితిఁ గ[illegible] లఁ బురికొల్పుటలేదు. అమాత్యపదము లేక[illegible]దలిపోవుచ [illegible]యెను గదా యను చింత నా కేకోశము నందు[illegible] [illegible]లేదని దృఢముగా నమ్ముఁడు. కాని నా కది [illegible]న్న చూపు లసివచ్చియుండిన యెడల మాత్రము ప్రజాభిప్రా[illegible] యమునకు దోసి లొగ్గి ప్రజలకు రాజును మంత్రి[illegible]న్నాను. [illegible]యును సేవకులుగా నున్నా[illegible]ను కీర్తిని సంపాదిం[illegible] ఇఁక[illegible] యుండెడి వాఁడ నని చెప్పికొనుటకు గర్వపడను పరి[illegible] చున్నాను. ఇది యాత్మస్తుతి యని నన్ను మీరు ప్రజాభిప్రా[illegible] గర్హించినను బరిపాలకుల బాధ్యతపైఁ గల గాఢ

ప్రియములు నన్నట్లు పలికించుచున్నవి. క్షమిం
ను. అంతియే కాని, మంత్రిపదవిఁ బూని నైహి
కలాలసుఁడనై యుండవలెనని యెంతమాత్రి
ను నాకు లేదు. అట్లయినచో గురిజాల విడిచి
నేల యని శంకింతురేమో! కారణ మాత్మలా
ము గాదు.

మహా ప్రతిభాశాలినియు రాజ్యతంత్రజ్ఞాన
గయు నైన నాగమ్మగారు పల్నాటి కొలువున
ంగు పెట్టినది మొదలు కృష్ణపక్షచంద్రికలవలె —
మాట యేల? — పిల్లలగు మల్లదేవులపై
గామరాజుగారికి గౌరవానురాగము లడుగు
నచుండుటయే కాక వారి ముఖమై ఖరియు వాచా
ర్ధనము బొత్తిగాఁ బరివర్తనముఁ జెందినట్లు
హించినాను. ఇంక నొక మహావిషయము
ము గాని యితరులకుఁ జెప్పఁ జనదు. అది
చగుట్టు. ఆ గుట్టువలననే మాచెర్లఁ బంపిం
కొని గురిజాల నీడి మల్లదేవులఁ దీసికొని పోవు
న్నాను. అలుగురాజు బ్రతికియున్నప్పుడు
గామరాజుగారు మల్లదేవుల మొదలగు పిల్లల
దఱు (విచారముతో) ముద్దులాడి పెంచిన
మకారము గలవాఁడ నగుటచేత మల్లదేవుల
విస్థితిఁ గూర్చి విచారించి గత్యంతరము లేక
డలిపోవుచున్నాను. గురిజాల నీనాఁ డేదో
దుష్టగ్రహ మావేశించి యుండుటచే మనుష్యుల నిట్లు
న్నచూపుఁ జూచుచున్నది గాని ముఱల దశ
రాజినప్పు డాదరింపకమాన దని విశ్వసించు
న్నాను.

ఇంకఁ బరిపాలనవిషయము. ప్రజానురా
ము పరిపాలనసౌధమునకు దృఢమైన పునాది.
జాభిప్రాయమును బురస్కరించుకొనక రాజ్యపరి
పాలనము సేయుట యిసుకలో గోడఁ గట్టుటవంటిది
బోధనకళాజ్ఞానము లేని యుపాధ్యాయుఁ డన్నిపట్లఁ
దన వేత్రదండముచే చిన్న బాలురను దండించి
తన యసమర్థతను జాటుకొనునట్లే ప్రజాభిప్రాయ
ముఁ ద్రుణీకరించి సదా శస్త్రిచేత రాజ్యము సేయు
నెడల నది శక్తిహీనతనే సూచించును గాని వేఱొ
కటి గాదు. రాజ్యమునం దంతటఁ బ్రజాసంస్థలు
నెలకొల్పి పరిపాలకులకు మంచికిఁ దోడ్పడుచు నవ
సరమగునప్పుడు సత్కార్యాందోళనము సల్పుచు మీ
రిచ్చు పన్ను మీ కన్నివిధముల సౌఖ్యకారిగా
నుండునట్లు చేసికొనవలెనని మనవిఁ జేయుచున్నాను
మఱియొకటి. నేను జిన్ననాఁడు పెంచి పెద్దవా
నిని జేసిన నా ప్రేమాస్పదుఁడయిన మీ నల
గామరాజుగారిని గౌరవించుచుఁ బ్రజాభిప్రాయ
బలంబుచేఁ జెడుమంత్రులపాలం బోవనీక వారి కన్నివిధ
ముల సాయపడవలెనని మీ యంతరాత్మ నుద్బో
ధించుచున్నాను. ఈ తెల్లవారుజాముననే మీ
యాజ్ఞఁ బొంది మాచెర్లకుఁ బోవుచున్నాము.
(విచారముతో) చిరకాలోపార్జితమైన పల్నాటి
కీర్తిని బోఁగొట్టవలదని మఱియొక మాఱు మిమ్ముఁ
బ్రార్థించుచుఁ గడసారి వందన మొనర్చుచు నింత
టితో విరమించుచున్నాను. (తెరపడును)

## దృశ్యము 3

నాయకురాలు - ప్రవేశము.

మతాధిదేవత యుత్తేజమునకు రాజసన్మా
నము మూలకందము. మతధర్మము లెంత పవి
త్రము లైన నేమి రాజసన్మానము గగనకుసుమ
మైనయెడల — ప్రజాదరణము లేని రసవత్కవి
త్వము వలె — క్రమక్రమముగా నధఃపతనము

జెందును. పాపము నలగామరాజుగారికి నంత
కంటె నెక్కుడుగా నరసింగరాజుగారికి ననింద్యమైన
శైవమతాభిమాన ముండుటచేత వారు బ్రహ్మ
నాయని వలలోఁ దగుల్కొనక నాచే వర్ణాశ్రమ
ధర్మసహితమైన హిందూమతోద్ధరణము గావింప
నుండుట శ్లాఘనీయము. కాని యిరువురిలోఁ గొంత
తారతమ్యమున్నది. ఒకరు సాధ్యమగునంతవఱకు
మతోద్ధరణదేవతకు భూతదయాళుతను నెచ్చెలిగా
నొనరింపఁజూచు వారు. మఱొకరు దాసిగాఁ బరి
గణించువారు. కనుకనే యీ రెండవ వారు నా
తత్త్వమునకు సరిపోయినారు. (కొంచెముండి)
అస్పృశ్యతానిరోధం బొనర్చు హిందూమతవిరోధి
నా మాచెర్లలో నైనను నిద్రవోనిచ్చుట తగదు.
మునుపు విషాహారప్రయత్నము విఫలమైనను దానికి
బదులుగా బ్రహ్మనాయని గురిజాలనిర్గమనము
కొంతవఱకు నాకు మనశ్శాంతి గలిగించినది. కాని
నరసింగరాజుగారు, నేను, బన్నియున్న యీ రెండవ
యుపాయము నెట్లాచరణములోనికిఁ దేవలయునో
తెలియకున్నది. ఆ మహాదేవుఁడే తగిన మార్గముఁ
దోఁపింపక మానఁడు. శైవమతోద్ధరణముపట్ల
రాజుగారు తమసమర్థతలఁ గేంద్రీకరింపఁజేసి విరోధి
మతస్థులపైఁ గఱకుదనము వహించునట్లు చేయుట
నాకుఁ బరమవిధియై యున్నది. ఈ మాట పన్ను
గడ దైవకృపవలన ఫలించెనా సుమారే డెనిమిది
సంవత్సరంబుల కాలము స్ఫుటముగా శైవదీప్తులే
పలుగడల వ్యాపించుననుటకు సందియము లేదు.
ఆ పైమాటఁ జూచుకొందము. వారు నా పరాక్ర
మోజ్జృంభణపరివాహము పఠింపవలెఁగదా. కాని
మ్మ్. కాలగర్భ మే విచిత్రవిశేషముల వెలికిఁ
దెచ్చునో. (నిష్క్రమించును.)

## దృశ్యము 4

నలగామరాజు గృహము.

నలగామరాజు - నాయకురాలు మాట్లాడుచుండుట

— నలగామరాజు —

నాగమ్మగారూ! రాష్ట్రములోని గ్రామప
కారులలోఁ గొందఱు దమ లెక్కల నింకను
కొని రాలేదని చెప్పినారుగదా. మఱల జ్ఞాపక
లంపరాదా?

— నాయకురాలు —

ఇంకను జ్ఞాపకలేఖలా? ఒకటి రెండు
ములు చూచి రాని సోమరు లందఱిపైఁ
చర్యఁ దీసికొనవలె ననుకొనుచున్నాను.

— నలగామరాజు —

ఇంత తొందర చనదు.

— నాయకురాలు —

కబురంపినదినమునకు రాని యులసుల
పాతురిలఁ జేయనియెడల మఱొక్కమాఱు
జ్ఞ శిరసావహింపఁ బడునా?

— నలగామరాజు —

నాగమ్మగారూ! ప్రజ్ఞావతులగు తమ
జెప్పఁగలవాఁడను గాను. రాజన్యునికిఁ బ్ర
బిడ్డలవంటివారు. సాధ్యమగునంతవఱకు బిడ్డల
చ్ఛాప్రవృత్తి నరికట్టక గాఢానురాగంబుచూ
దాను నిష్కల్మషపరివర్తనుఁడై యుండునెడలఁ
పుమాత్రముచేతనే భయభక్తులుగలిగి బిడ్డలు
డ్రిని గౌరవించుచు విధేయులై యుందురు. పా
పాలితుల పరస్పర సంబంధంబుగూడ నట్టిదే
మఱియు రాజు ప్రజలను వీలగునంతదనుక సౌ
మున మందలించుచు మార్గాంతరము లేనిచో
విచారముతోఁ దీవ్రచర్యకుఁ గడంగుచుఁ

రాగంబు వదలవలెనని బ్రహ్మన చిన్నతనంబున
బిల్లలకు నూకు బోధించుచుండెడివాఁడు.

—◆ నాయకురాలు ◆—

అది సిద్ధాంతభాగము. ఆచరణసాధ్యము
గాదని నా దృఢవిశ్వాసము. సౌమ్యగుణ మెల్ల
ప్పుడు నుపయోగకారిగాదు. యుక్తాయుక్తజ్ఞాన
రహితముగాఁ బశుబల ముపయోగించుట పాడిగా
దని నేను గ్రహింతును గాని యవి సాధింపఁజాలని
కార్యములు లేవని పరిపాలనభారము వహించు
వారందఱకు ననుభవైక వేద్యము. వేరు బాగుగ
లేదు గాని పశుబలము రామబాణము వలె నమో
ఘమయినది..

—◆ నలగామరాజు ◆—

(చిఱునవ్వుతో) నాగమ్మగారు బ్రహ్మ
నాయునికి శిష్యత్వంబుచేయుచున్నారా యేమి
[illegible] డగు రాముని దలంచు
చున్నారు!

—◆ నాయకురాలు ◆—

(నవ్వును).

—◆ నలగామరాజు ◆—

(కొంచెమునుండి) కాదు గాని, నాయుని మత
విషయకోపన్యాసములు మాత్రము గణ్యింపఁదగి
నవిగా నున్నవి.

—◆ నాయకురాలు ◆—

ఇప్పటికిఁ దెలియుచున్నది మీకు. ఒక్క
మతోపన్యాసములేనా? ఆ నాఁడు గురిజాలనుండి
పాఁటిపోవు నపుడు ప్రజాసమావేశంబు గావించి
మిత్రజల కవసరమని తోఁచినవు డాందోళనము సల్ప
సెలెననియుఁ బ్రజాసంస్థలు దేశము దెల్లయెడల
పోషింపుఁడనియు వారికి హెచ్చరించియుండుట విన
లేదా! పరిపాలనభారముఁ బూను వారెవరైన విని
మూరకుండఁగలరా? మీ రుదాసీనభావము వహిం
చుట వలన మిన్నకుంటిని గాని లేకున్న దో నో
మాత్రయాజ్ఞ నప్పుడే కావింపకుందునా? అంతి
యు గాక. పాపము, వర్తకపుఁగార్యంబుల ని
త్తము గురిజాలమండలములోని వర్తకశిఖామణు
లెవ్వరో నూఁచెల్లకుం బోవఁగా నాఁడు రాచదేవి
డీలో దొంగతనము గావించి నా రను మిష వెట్టి—
పాలవంటి వెలమకులములోఁ బుట్టిన బ్రహ్మ
నాయునికి నూలకొడుకైన కన్నమదాసు —
వారిని బాధించి మోఁది వారి వీపులపై నిసుక
గోనెల నెత్తి తీసికొనివచ్చి దాని కంతయు నే పాప
పుణ్యము తెలుఁగని నేనే కారణమని సిగ్గులేక
మీకు నివేదించి దాసు వాక్ప్రహారంబులఁ దిని
వెడలిపోయెఁ గదా. ఇప్పుడు వారికి విరోధులు
మీరు గారు. నేనే. తను వైష్ణవమతవ్యాపనము
దావాగ్ని లోకమును దహింపకుండ సాయుజ్యం
బుఁచేతఁ జూపించునట్టి యీ మహోత్కృష్ట శైవ
మతంబను కుంభవర్షంబును నేను వర్షింపించి యడ్డు
పడుచుండుటచేత విరోధిని నయితిని. పోనీ, యెవరి
మతము వారు బోధించుకొందు రని తూష్ణీంభా
వము వహింపఁదలఁచినను — అయ్యయ్యో!
రాష్ట్రమంతయు నూలకూడు చేయుచున్నాఁడే!
విశ్వములోని మానవు లందఱు సమానులఁట. అం
టరాని తన మొకటిఁ గల్పించి యితరవర్ణముల
వారు పంచములఁ గ్రూరముగాఁ జూచుచున్నారఁట
ఛీ! ఛీ! హిందూమత మంతయు మంటఁ గలుపు
చున్నాఁడు.

—◆ నలగామరాజు ◆—

అవును. అతఁడు మిగుల నైచ్యమునకుఁ
బాల్పడుచు హిందూమతాశయంబులఁ గోతఁ
ద్రోయుచున్నాఁడు.

నాయకురాలు.

ఒకొక్కప్పు డట్లందురు గాని మీరు మీరు నొకటే. ఆతనిపై నీఁగ వ్రాలనీయరు.

—◆ నలగామరాజు ◆—

అదే మట్లనెదరు? ఈ శైవమతోద్ధరణమునకై - అనగా - దేశోద్ధరణమునకై ప్రాణబంధువులఁగూడ విసర్జించి మిమ్ము వంటివారిని జేపట్టిన నన్ను గూర్చి యేమో సందేహించి మాట్లాడుచున్నారు! బ్రహ్మనాయుఁ డొనర్చునట్టి యీ యకార్యంబులు రూపుమాప సాధనములఁ గూర్చి యహోరహము మా త్రిపురసంహారిని వేవిధంబుల వేఁడుకొనుచుందును.

—* నాయకురాలు *—

రాజాజ్ఞ యయినచో నదెంతపని!

—* సేవకుడు *—

(ప్రవేశించి) బాబూ! దండాలు. మాచర్ల నుంచి యెవరో శైవులొచ్చారు దర్శనానికి.

—* నలగామరాజు *—

మాచెర్ల నుండియా?

—* నాయకురాలు *—

మధ్యాహ్నము రచ్చచావడి లోనికి రమ్మనుము.

—* సేవకుడు *—

చిత్తము.

—* నలగామరాజు *—

నాగమ్మగారూ! వీ రెందులకై వచ్చియుందురో!

—* నాయకురాలు *—

నాయుఁడు పెట్టు నలజడికిఁ బడలేక నే వచ్చియుందు రేమో?

—* నలగామరాజు *—

ఏమో!

—* నాయకురాలు *—

మంచిది. మధ్యాహ్నము విచారింతము. మఱలఁ గలిసికొందుము.

—◆ నలగామరాజు ◆—

చిత్తము

—* నాయకురాలు *—

నమస్కారము

(తెరపడును).

దృశ్యము 5

నాయకురాలు - నరసింగరాజు మాట్లాడుచుందురు.

—* నాయకురాలు *—

(చిఱునవ్వుతో)

నరసింగరాజుగారూ! బ్రహ్మనాయునిపై మీ యన్నగారైన నలగామరాజుగారి కుండునంత యభిమానము తమకు లేకపోవుట విచారకరమే.

—* నరసింగరాజు *—

నాయఁ డంత ద్రోహి మఱి యొకఁడు లేఁడు. అనవద్యయశోవిరాజమానమైన యీ హిందూమతము నొక్కమాఱుగాఁ బూడ్చి పెట్టుచున్నాఁడు. ఛీ! వాని మొగముఁ జూచిన పాతకము (జ్ఞప్తి నభినయించి) మఱచినాను. మాచెర్ల రాజ్యములోని కొందఱు శైవులకు లంచములిచ్చి వారిని గురిజాలకు వచ్చి బ్రహ్మనాయునిపై నొక్కి చెప్పుడని మాట్లాడివచ్చితిని గదా. వా రింకను రాలేదేమి?

—◆ నాయకురాలు ◆—

జ్ఞప్తి యున్నదే!

—* నరసింగరాజు *—

జ్ఞప్తి లేకయేమి! నాగమ్మగారూ! ఏవిధముగానైన బ్రహ్మనాయని దేశము నుండి వెడల నడచిన మేలని తోఁచుచున్నది.

—◆ నరసింగరాజు ◆—

ఇప్పు డదియే కదా ప్రయత్నము

— నాయకురాలు —

అదెట్లు?

—* నాయకురాలు *—

మొన్నటి యుదయము మాట - మాట - వచ్చి బ్రహ్మనాయనిపై మీయన్నగారి కించుక ద్వేషభావము గలిగించినాను. ఇంతలో నా సమయముననే మహాదేవుని కరుణాకటాక్షమువలన మాచెర్లలోని శైవులు - మీరు మాట్లాడివచ్చిన వారు - వచ్చి శైవమతోద్ధరణమునకై రాజుగారు సర్వవిధములఁ బ్రయత్నింప వలెననియు బ్రహ్మన గావించు నిమ్నజాత్యుద్ధరణోపన్యాసములు బాధాకరములుగా నున్నవనియు, హిందూమతానుకూలముగా నస్పృశ్యతానిరోధప్రచార మొనర్చు నిట్టి ప్రబలవిరోధిని దేశాంతరమునకు వెడలఁగొట్టుట సమంజసమ్మనియు మొఱవెట్టుకొనిపోయిరి. అంతటఁ గోపారుణితనేత్రుఁడయిన రాజేంద్రునితో నిది సందుఁజేసికొని నాయని నెట్లయినను దేశమునుండి వెడలనడచు మార్గమాలోచింపఁదగు నని చెప్పగాఁ వారును నంగీకరించిరి.

—* నరసింగరాజు *—

ఎట్లు వెడలఁ గొట్టెదరు?

—* నాయకురాలు *—

దాని కొక యుపాయముఁ బన్ని యొప్పించినాను.

—◆ నరసింగరాజు ◆—

(సంతో) ఏమది?

—* నాయకురాలు *—

మన మిరువుర మీవఱ కాలోచించినదియే రేపు రానున్న సంక్రాంతి పండుగకు మామూలు కోడిపందెములు జరగుననియు దాని కందఱువచ్చి వినోదములు చూచి పాల్గొనిపోవలెననియు నొక విన్నప మంపినాము.

—◆ నరసింగరాజు ◆—

అప్పుడే నాయనికి లేఖలు గూడ నంపితిరా! నేను గ్రామాంతరమున కేగి వచ్చు నంతలోపలఁ జాలమారము పోయినారే!

—◆ నాయకురాలు ◆—

ఆ. లేఖ యీపాటికిఁ జేరియుండును.

—◆ నరసింగరాజు ◆—

ఇది మన యిరువురి యాలోచనమే కాని మన మనుకొనునంత జరగునో లేదో చూడవలెను.

నాయకురాలు

సందర్భముల ననుసరించి రాజ్యములే యొక్క వచ్చుననికదా మన యెత్తుగడ. చూతము. పైన నీశ్వరుఁడున్నాఁడు

* నరసింగరాజు *

ఆ లేఖ యేమని వ్రాసినారు?

...◆ నాయకురాలు ◆...

ఇదిగో చిత్తుగూడ నాదగ్గఱనే యున్నది. (లోపలికిఁబోయి తెచ్చి చదువును)

" శ్రీ శ్రీ శ్రీ సకలకళావిశారదులును భీమపౌరుష సమన్వితులును మానవంతులును రేచెరల వంశపాథోధిచంద్రులును నగు బ్రహ్మనాయని పాదపద్మముల సన్నిధికి.

విధేయుఁడయిన నలగామరాజు హృదయపూర్వకనమస్కారంబులు గావించి యొనర్చు విజ్ఞాపనములు.

మహాశయా! మనము పరస్పరసమాగమ సంభాషణంబులు గావించి చాల దినము లతిక్రమించినవి. మా తండ్రిగారి కాలంబున మన రెండు వంశములకు నెట్టి సఖ్యము గలదో జ్ఞప్తి వచ్చి — కారణము లెవ్వియైనను నీ నాఁటి స్థితి యెట్లున్నదో చూచినప్పుడు నా కెంతయు విచారము గలుగు

చున్నది. మా చిన్నతనంబున మీ రెంత కృపాపూరితహృదయముతో మమ్ములఁ బెంచితిరో నే నెన్నఁటికిని మఱవఁజాలను. మీయం దపారమైన యనురాగంబును నా హృదయంబు వెలువరించుటచే నిన్నినాళ్లకు మఱల నొక్కపరి మిమ్ముంగూడి సంతోషసౌఖ్యంబులఁ గొన్నిదినంబు లోలలాడవలె నని యుద్దేశించినాను.

ఇంకఁ గొలఁదిదినంబులలోపలఁ బ్రజాసంతోషదాయకం బయిన సంక్రాంతిపండుగ రానున్నదిగదా. కాన నాఁడు మహావైభవసమేతంబుగ నొక కుక్కుటసమరంబు దలపెట్ట నిశ్చయించి దానిం దిలకించి పాల్గొనుటకై మలిదేవభూపతిని మిమ్ములను నాహ్వానించుచున్నాను. ఇంతకాలంబయినవెనుక ననురాగంబున జూపఁబడిన నా యభీప్సితంబును నెఱవేర్ప సంకోచింప రని విశ్వసించుచున్నాను.

గురిజాల, మార్గశిర శు ౨ గురువారము.

ఇట్లు విధేయుఁడు,
నలగామరాజు.

—* నాయకురాలు *—

ఇట్లే పెదమల్లదేవునికిని నొకలేఖఁ బంపితిని.

—* నరసింగరాజు *—

(సంతోషించుచు) చక్కఁగా నున్నది. కాని వారు 'వత్తురా!' అని

—* నాయకురాలు *—

నిస్సంశయము. రానియెడల వేఱొకపన్నాగముఁ బన్నుదము.

—* నరసింగరాజు *—

సరే. కానిండు.

—* నాయకురాలు *—

మీ రొక్క కార్యంబు నిర్వహింపవలసి యున్నది. గంగవరములోఁ గోడిపందెము లాటలో ననన్యసామాన్యప్రజ్ఞాధురీణులగు కట్టుబోతులున్నారఁట. ఎదిరిపక్షము వా రెట్టి నిపుణులయినను వంచించి నిమేషములో నోడింతురని వినినాను. కావున నామాటఁగా నా యూరికరణముతోఁ జెప్పి సమర్థుఁడయిన వానిని వెతకి కోడితోఁ గూడ నా కట్టుబోతును గొని తేవలెను. ఇది చాల రహస్యముగా నుంచుమని కూడ నాజ్ఞాపింపుఁడు. అంతియ కాక, "యింతకు మున్ను మీ రేవ్వో, పరిపాలన రహస్యంబులు బయలుపెట్టినారఁట యనియు వానికి సమాధానముఁ జెప్పికొనుటకుఁ బందుగ్గు కర్త వఁగానే రావలసిన దని రాజాజ్ఞ యాయిన" దనియుఁ గరణము లింగరాజుతోఁ జెప్పి ముందుగా భెదురు వెట్టి రండు.

—* నరసింగరాజు *—

నాగమ్మగారు రాజ్యతంత్రజ్ఞ తయుంయుఁ బెట్టినపేరు. సరే. వేకువనే లేచి పోయెదను. అభ్యంతర మేమున్నది.

—* నాయకురాలు *—

మంచిది.

(తెరపడును.)

దృశ్యము 6

దోర్నీఁడు ప్రవేశము.

—§ దోర్నీఁడు §—

ఔరా! కాలమహిమ! ఏదీ వచ్చేది తెలి యదు గదా! అనుగో పసుపు — ఇదుగో ముసుగు — అన్న ట్లయిందే! చిత్రము! భగ వంతు డేమో న్యాయపక్షమే వుంటా డంటారే! ఏమయింది యిప్పుడు! తలుచుకుంటే భర్త పో యిన భార్య వలె వేసటపడుతూ ఘూర్ణిల్లుతున్న దే మనస్సు! ఇక ముందుగతేమిటి! ఈ మాచెర్ల మ్మను వదలి వేసి వెళ్ళడము ఎట్లా! ఒక పిల్ల మేకయేనా? గొడ్డా గోదా ఎంతవుంది! ఇఖన మా మాచెర్లమ్మను ఆ మాయలమారికుంక వేధిచి బలాత్కారంగా వికారరూపం చేస్తుంది గా

వూరుకోదు. ఎంత దొంగ వేషాలు లేందే మొదటంతా గెలుస్తూ వచ్చిన బ్రహ్మనాయుడుగారి కోడి చివరపందెంలో కాళ్లు తేలవేస్తుంది! పాపము అనుభవించకపోదులే నాగమ్మ. (చూచి) అదుగో నా చెలికాడు బాలచంద్రుడు బిక్కమొగముతో బోతున్నాడు. మొత్తానికి పోనద్దంటాడు. ఇష్టపడుడు. అయినా చూతాం పోయి.

(నిష్క్రమించును.)

## దృశ్యము 7

మాచెర్లలోని మల్లదేవుని సభ.

బ్రహ్మనాయఁడు, కన్నమదాసు, బాలచంద్రుఁడు, పెదమల్లదేవుఁడు మాట్లాడుకొనుచుందురు.

—* బ్రహ్మనాయఁడు *—

నలగామరాజు మాచెర్ల శైవులకుఁ గొందఱకు రహస్యముగా లంచము లిచ్చి గురిజాలకుఁ బిలిపించుకొని మనపై నలగామరాజునకుఁ జెప్పించుటయు నా పిచ్చిధర్మరాజు నమ్మి కోపగించుటయు నది సందుఁజేసికొని మనల దేశమునుండి వెడలఁగొట్టు నుపాయమునకు నాగమ్మగారు రాజు నొప్పించుటయు నీ కోడిపోరు దానిఫలితమే యగుటయు విశ్వసనీయములే కావచ్చును కాని వారెంత యీ కోడిపోరునందు న్యాయపథంబు వీడి యసన్మార్గప్రవర్తకులై కడకు మన కనిర్వచనీయ కష్టపరంపరలఁ గూర్చుచున్నను మనము మాత్రము వంతునకు గంతువైచి కుక్కకాటునకుఁ జెప్పుదెబ్బవలె వారి నెదిరించి యనినమాట నుండి తొలఁగుట నాచిత్తంబునకు న్యాయముగాఁ దోఁపలేదు. నిశ్చయమే మీరు చెప్పునది. తనకు మారుగా నాయకురాలు కట్టుబోతు రొకని జొప్పించి మనలఁ గన్నొఱంగి వానిచేఁ జెఱకోళ్లవలఁ గోడిని వదలుటయు మనకప్పుడవి యేమియుఁ దెలియనీక పెద్దమ్మ మోసించుటయు — నన్నియు వాస్తవములే.

—* మల్లదేవుఁడు *—

మన మొప్పుకొని యాడినదే కదా!

—* బ్రహ్మనాయఁడు *—

కాదా మఱి!

—* కన్నమదాసు *—

మన మప్పు డొప్పుకొనకుండవలసినది.

—* మల్లదేవుఁడు *—

పరు నాడించుట కూడదని కొంత చెప్పితిమి. కాని పయోముఖవిషకుంభ మగున నాయకురాలి తేనెపలుకులు దెలిసియు మోసపోయి యంగీకరించితిమి. ఇదంతయు నా జగన్నాటక సూత్రధారి శ్రీమన్నారాయణమూర్తి సంఘటనము. కోడిపోరులో నోడితిమి కావున రాజ్యము వారికిచ్చి వెడలిపోవలసినదే. ఒడంబడిక యనుల్లంఘ్యము.

—* బాలచంద్రుఁడు *—

అట్లనుకొన్నచో ననుల్లంఘ్యమే. లేనియెడల నవశ్య ముల్లంఘనీయము.

—* కన్నమదాసు *—

ఎట్లు?

—* బాలచంద్రుఁడు *—

ఎట్లుగాదు?

—* మల్లదేవుఁడు *—

ఇట్టి కోడిపందెపుటాటలలో సాజముగాఁ జీటికి మాటికి రాఁగల చిన్నికలతలను — ముందే యట్లు చేయ నిశ్చయించుకొని వచ్చుటచేఁ గాఁబోలు — నాయకురాలు వాని నమోఘంబుగాఁ బెంపొందఁ జేసి మనకుఁగూడఁ బందెపుటునుకుఁ

గల్పించి యీ వేడిలో రాజ్యంబులొడ్డుటకు మనలనొప్పించి కట్టుబోతుసాయంబున గెలుపొందినది అందుకు నోడినవా రేడేండ్లు దేశాంతరగతులు గావలయునని యామె పెట్టిన యొడంబడిక నొప్పుకొన్నవార మగుటచే నాటయం దెన్ని యన్యాయములో వారుచేసినారనియు నొడంబడిక ప్రకారము నడచుకొన నవసరములేదనియు నిప్పుడు వాదించిన లాభమేమి? అనినమాటఁ జెల్లించి తీఱవలసినదే. ఇది నాల్కా? మఱొక్కటియా?

—* బాలచంద్రుఁడు *—

అట్లు చేయుట మహాఘోరము గాని వేఱుగాదు. దుర్మదోపేతయైన యీ నాగమ్మ యల్లిన సూత్రములనా మన మాచరణము లోనికిం దెచ్చుట! అంతెగాఁ గాదుకూడదని పోఁదలఁచిన యెడలఁ బెద్దలండఱును బోరాదా? నేనును నా యనుపమానభుజాబలసమన్వితు లయిన దోర్నీఁడు మొదలగు స్నేహితబృందములును మాచెర్ల యందే యుండి పగతురపురుగును రానీక రాజ్యంబును గనిపెట్టుచుండఁ గలము. అంతియే కాని యీ బాలగోపాలము కడలిపోయి కడగండ్లఁ గుడుచుట కేమి కర్మము!

—♦ బ్రహ్మనాయుఁడు ♦—

కుమారా! ఒడుదుడుకుఁబనులు చేయకుము. సూత్రము లోకవిధముగా నాచరణము వేఱొకవిధముగా నుంచుట తగదు. ఒడంబడిక లోని భావమును బట్టి కోడిపందెములో నోడితిమి కావున మాచెర్ల రాజ్యము మనది కాదనుకొని పరివారముతో నొక్కరయిన మిగులకుండ రాజ్యత్యాగముఁ జేయవలెఁ గాని వేఱొకటిగాదు. హరిశ్చంద్రాదులు వట్టి మూఢులై సత్యవ్రతమునకై యట్టి శ్రమలు పడిరా? సకలసద్గుణోపేత యయిన మన భరతమాతవంటి దేశమాతయు సత్యవ్రతమువంటి వ్రతమును లేవు. రేపు సాయంత్రము మించి మన మిచ్చట నుండరాదు. కదలిపోవలసినదే. మన మింక విచారింపఁదగదు.

—♦ బాలచంద్రుఁడు ♦—

ఆహా! విధిప్రేరితము! నిరతిశయపరాక్రమతేజోవిరాజితులమై యుండియు నీ రాజకుటుంబముఁ దత్పరివారము నెన్ని యిడుములఁ గుడువవలసివచ్చినది! మా తండ్రిగారు శాంతశమదమాది సద్గుణకలితులు గావున నాయకురాలి దుండగములకు నూరకొనవలసి వచ్చినది. (నిట్టూర్పువుచ్చి) పోనీ పల్నాటిరాజ్యము నుండి విభజించుకొని వచ్చినను గళ్యాణపురాధీశ్వరుం డగు వీరసోమేంద్రుని తనయతోడి మల్లభూపతి వివాహంబును వారి మాచెర్లరాజ్యపట్టాభిషేకమును జరగినందులకు మహాప్రమోదంబున నుండ నింతలో నిర్ఘాతపాతంబు వంటి యీ దుర్వార్త పైఁబడి యందఱను వికలచిత్తులఁ గావించుచున్నది.

—♦ కన్నమదాసు ♦—

తమ్ముఁడా! ఊఱడిల్లుము. ఈ రాజ్యమింక మనది కాదు.

—♦ బ్రహ్మనాయుఁడు ♦—

(విచారముతో) అవును. మనదశ తప్పినది. మన కిక్కడ హక్కు లేదు. అమ్మా! సర్వాంగసుందరమాచెర్లరాజ్యలక్ష్మీ! నాగమ్మగారి కుతంత్రంబులను వాగురలం జిక్కి తప్పించుకొనలేక నిన్ను విడనాడిపోవుచున్నాము. ఇంక నీ పొలిమేరలలోపల నుండుటకైనను మాకు స్వాతంత్ర్యము లేదు. నీ ఫలభరితవృక్షచ్ఛాయలందు నిలుచుండుటకుఁ గాని ప్రజోపయోగార్థమై యచ్చటచ్చట నిర్మించిన నీ కుసుమితోద్యానంబులందలి కప్పురపుటనంటుల చేరువఁ జలువఱాతి తిన్నెలపై నధివసించుటకుఁగాని బిడ్డలవలెఁ జూచు

కొను నీ ప్రజలకందఱకు నీవు పంచిపెట్టు పరిపూర్ణ స్వాతంత్ర్యవాయువును బీల్చుటకుఁ గాని యింక నోచుకొనక మున్ను హరిశ్చంద్రుని వలె నేఁడీ మల్లదేవుఁడు సకుటుంబామాత్యపరివారుఁడై కాటి డవుల పాలయి పోవుచున్నాఁడు నీ కటాక్షమున్న నో మఱల నేడే ప్లకు నీ దర్శనమొనర్తుము. ఈ చంద్రవంశానదీజలంబుల ఋణము నేటితోఁ దీఱి పోవుచున్నది. మే మిదివఱకుఁ గావించిన ప్రజో పయోగకార్యంబులలో నింకను నేనైన లోపము లున్నయెడల క్షమింపుము. పరరాజ్యంబులందుఁ గనిపెట్టియుండుటకు మాకీ చెన్నకేశవుఁడే దిక్కు ఏ నాఁడు మఱల మధ్యవచ్చిన యీ నాగమ్మ నధికారంబు నుండి తొలఁగించి స్వరాజ్యలక్ష్మీకర గ్రహణ మొనర్తుమో యానాఁడు పుణ్యదినము పల్నాటిరాజ్య మీ వీరుల జన్మస్వత్వము. ఈ శని దశ తొలఁగు సంతవఱకు వేచియుండి యానల స్వరాజ్యసిద్ధిని బడయుటకు మా యిలువేల్పగు చెన్నకేశవుని పాదపద్మముల నేమఱక ధ్యానించు చుందుము. మఱియు

అనుమానింపక బ్రాహ్మణాదుల నెటో
యట్లే యథాశక్తిగన్
గనులన్ ఱెప్పలువోలెఁ జూచి బ్రతుకుం
గష్టంబు లేకుండఁ బెం
చిన మాబిడ్డలు మాలమాదిగల కే
చేడ్పాటు వాటిల్లునో
జననీ! నీపయి భారముంచితిమి
మాచర్లా! కృపంజూడవే.

(మల్ల-తో) రాజేంద్రా! మన మింక నాలసింపఁదగదు. ప్రయాణసన్నాహములు సేయ వలెను.

—♦ మల్లదేవుఁడు ♦—

పోవుదము.

(తెరపడును)

దృశ్యము 8

నాయకురాలు గృహము.

నాయకురాలు – నరసింగరాజు సంభాషించుచుందురు.

—* నాయకురాలు *—

నరసింగరాజుగారూ! మన యిర్వురియాలో చనములు శైవమతాభివృద్ధికి-నందుచే దేశాభివృ ద్ధికిఁ దగిన దోహద మొసఁగుచున్నవిగదా. వైష్ణ వమతపిశాచము వెడలిపోఁగానే శైవమతారోగ్య దేవతాప్రభావంబునమూచెల్ల చాలవఱకు రేకట్టు చున్నది.

—* నరసింగరాజు * —

మన యిద్దరి స్నేహము వైష్ణవుల కంద ఱకుఁ బీడాకరంబుగా నున్నను మొత్తముమీఁద మనము దేశమునకుఁ గొంత శ్రేయస్సుఁ జేకూర్చి తిమి కాని యూరకుండలేదు. నాగమ్మగారూ! ఇప్పుడు వారే వైపుల నున్నట్లు?

—* నాయకురాలు *—

మండాది యడవుల కావల నున్నారఁట నాయుఁడు దేశాంతరగతుఁడైనను మన కంత ప్రబలవిరోధిగా నున్న వానిని నామండాది యడ వుల లోనైనను సుఖముగా నిద్రవోనీయఁ గూడ దనియే నా యభిప్రాయము.

—♦ నరసింగరాజు ♦—

నాకుఁ గూడ నట్లే తోఁచుచున్నది.

హిందూమతమునకు వ్యతిరేకముగాఁ బ్రవ ర్తించుచు రాజ్య మంతయు మాలకూడు చేసి పోయిన వాని నెన్ని తిప్పలు పెట్టినను బాపము లేదు.

—* నాయకురాలు *—

నేను మీతో నింకను బ్రస్తావింపలేదుగాని యీవఱకే యొక యుపాయముఁ బన్నియున్నాను.

—* నరసింగరాజు *—

ఏమి?

—◆ నాయకురాలు ◆—

మండాది యడవులలో ననేకులు చెంచులు నివసించుచున్నారుగదా. ఏదే నొక తగవుఁ బెట్టుకొని నాయఁడుజనములనకుఁ జెంచులు గొంత వేఁడి గల్గించునట్లు చేయవచ్చును.

—◆ నరసింగరాజు ◆—

మంచి యూహ. కాని మనము పోయి యా చెంచులనాయకునితో మాట్లాడవలసి యుండును.

—* నాయకురాలు *—

అవును. మీ రీ సాయంత్రము సయనమై పోయి రహస్యముగా నతనితో మాట్లాడిముందుగా గొన్ని రూకలు లంచమిచ్చి రండు. మీ రాచఠీవి, లంచము భిల్లులను లోఁబఱచి తీఱును. నాయనికి వారు తప్పక కొంత వెట్ట పుట్టింతురు.

—* నరసింగరాజు *—

వాని నిచ్చటికిఁ దీసికొనివచ్చి బ్రహ్మనాయనిపై నేరములు రాజుగారి యెదుటనే నివేదింపఁ జేయఁదగు నేమో?

—* నాయకురాలు *—

వలదు. వలదు. భిల్లనాయకుఁడు మంచి చెడ్డ లెఱుఁగని మొఱకు.

—* నరసింగరాజు *—

అవును. నిజమే.

—* నాయకురాలు *—

పొరపాటున రాజుగారి సమక్షమున మన గుట్టు గూడ బయలు వెట్టునేమో. మీరే పోయి రండు. మీరు వచ్చిన వెనుక సభలో నొక దినము చెంచులు వచ్చి తమ మొఱ్ఱలఁ జెప్పికొనిపోయి రని చెప్పవచ్చును.

—◆ నరసింగరాజు ◆—

సరే. పోయి వచ్చెదను.

—* నాయకురాలు *—

చిత్తము.

—◆ నరసింగరాజు ◆—

నాగమ్మగారూ! పోనీ, రాజుగారి క్రీవిషయము తెలియనీయకుండిన మాత్రము నష్టమేమి!

—◆ నాయకురాలు ◆—

ఆఁ. ఆఁ. అట్లుకాదు. బ్రహ్మనాయని దుండగము లన్నియు రాజుగారి కెంత చెవి వేసిన నంత మంచిది.

—* నరసింగరాజు *—

అవును లెండు. రేపు గడువు దాఁటిన వెంటనే మా చెర్ల రాజ్య మివ్వవలయునని వా రడుగుదురు గదా. అందుకొఱకు ముందటికొఱకు బందమిది.

—§ నాయకురాలు §—

నిశ్చయము.

—§ నరసింగరాజు §—

సరే. ఈ దినమే ప్రయాణమయ్యెదను.

—§ నాయకురాలు §—

మంచిది.

(తెరపడును.)

## దృశ్యము 9
### నలగామని సభ

**నలగామరాజు - నాయకురాలు - నరసింగు సంభాషణము**

—§ నలగామరాజు §—

నాగమ్మగారూ! ఒక్కొక్కప్పుడు నా తమ్ములగు మల్లదేవులు స్మృతికి వచ్చినప్పుడు రాజసౌఖ్యంబు లనుభవించిన సుకుమారశరీరు లెట్లో రెండు సంవత్సరంబులనుండి మండాది యడవుల పరిసరంబులఁ గష్టంబు లనుభవించుండిరో యని హృదయము పరితపించుచుండును. కాని యేమి

చేయుదును? మల్లదేవులు ముప్వురును బ్రహ్మనా
యనిచేతc జిక్కిన పక్షులైనారు.

—§ నాయకురాలు §—

వారిని బ్రహ్మనాయcడను శనిగ్రహము పట్టి పల్లార్చుచున్నది. వారితో మీకు రక్తస్పర్శన బాంధవ్యమున్నను నాయcడు పిశాచము వారిని ద్వేషింప నంతవఱకును, వారు వైష్ణవమతమును విడనాడనంతవఱకును మల్లదేవుల మాట మీరు తలపెట్టరాదు. ఇనుమును బట్టి యగ్నికిని సమ్మెట పెట్టున్నట్లు నాయనితోcబాటు మీసోదరులును నిముమలcగుచుచుందురు. దుష్టసంసర్గముc గలిగి యున్నంతవఱకు శైవమతాభిరక్షణపవిత్రకార్యార్థము సోదరవాత్సల్యము మాని వారినిగూడ శత్రుభావముననే చూడవలసియుండును.

—* నరసింగరాజు *—

నిశ్చయమే. (కొంచెము నుండి) వారు దేశత్యాగమొనర్చి రెండేండ్లు కావచ్చినది కాcబోలు.

-‡ నాయకురాలు ‡-

దాcటినవి గూడ.

-§ నలగామరాజు §-

ఇంతకాలము నుండియు మనము పరిపాలించు మాచెర్లరాజ్యంబున వైష్ణవమతప్రాబల్యతమస్సు చాలవఱకు విచ్చిపోయి శైవమతోద్ధరణమను భాస్కరుని తేజఃపుంజంబులు నలుదెసల వ్యాపించినవి గాని ప్రజాసముదాయంబులలో నచ్చటచ్చటc గుప్పుమంటలు గలిగినవి.

-‡ నాయకురాలు ‡-

అట్టివి ప్రీతిపరిపాలనములో నుండునవియే ప్రజల నందఱను మెప్పింప నా ధూర్జటికిc గూడ శక్యము గాదు.

-§ నరసింగరాజు §-

అయినను వైష్ణవమతస్థులకే కద కంటు అట్టి కుటుంబముల నెన్నిcటినో మాచెర్లను వీడనప్పుడు నాయcడే లేవcదీసికొని పోయినాcడు. మిగిలినవి కొన్ని మాత్రమే.

§ నాయకురాలు §

అది స్మృతికి వచ్చినప్పుడు నా హృదయము మండిపోవుచుండును. పోవువాcడు తాను మాత్రమే పోక యూరిలోని వారి నందఱను లేవcదీసి మాచెర్ల నగము పాడుపెట్టి పోయిన దుర్మార్గుని నేమి చేసినను పాపము లేదు. ఎంత మాయావి! కపటపు పలువ! తేనెపూసిన కత్తి! అట్టివాcడెట్టి కాఠిన్యమునకైనను పాత్రుcడే

-‡ నరసింగరాజు ‡-

నాగమ్మగారూ! నిన్నటి సాయంకాలము వచ్చిన భిల్లనాయకుని విషయముc జెప్పినారా?

-* నాయకురాలు *-

జ్ఞప్తికిc దెచ్చితిరి. మఱచినాను.

-◆ నలగామరాజు ◆-

భిల్లనాయకుc డెవరు?

-§ నరసింగరాజు §-

మన బ్రహ్మనాయని దౌష్ట్యమెచ్చటికిc బోయినను నానాcటికి వృద్ధియే కాని తగ్గుదల లేదుగా!

* నాయకురాలు *

మండాది యడవులలోc జిరకాలము నుండి కాపుర మొనర్చుచుc దమ పశువుల నా యరణ్యములలో మేపుకొనుచుండు భిల్లులను నాయcడు జనము కడు వేధించుచున్నదcట. రాజకుటుంబములోనివి రాజామాత్యబాంధవకుటుంబములలోనివి పశువులు మనవారికి వేనవే లున్నవి గదా. వానినన్నిcటిని గాచుచుండుటకు బ్రహ్మనాయcడు లంకన్నను నియమించినాcడcట. లంకన్న పొగరుబోతుదనమున భిల్లుల పశువులc దోలి వైచుచుc దమ పశువుల మేపుకొనుచుc గొందఱు భిల్లులకుc

బ్రహారంబులఁ గూడ నొసంగె నఁట. అంతటఁ గోపించి వారి నాయకుఁడు వచ్చి యిఁక ముందు మిన్నకుండ మనియు నెదిరింతు మనియుఁ జెప్పి యీవిషయము ముందుగా వారికి బంధువుల మగు టచేత మనకుఁ జెవినైచి యుంచుట మేలనుకొని వచ్చెను. ఎదిరించి పశుహరణముఁ జేసికొనుఁడని సలహా నిచ్చి పంపివేసితిని.

—§ నలగామరాజు §—

మంచిపనిఁ జేసితిరి. బ్రహ్మనాయనికీ విషయము తెలియకుండునా? పోనీ, తక్కుంగలవా రెవ రైనను నిది యుక్తము గాదని మందలింపరు గాఁబోలు.

—♦ నాయకురాలు ♦—

నలువురికిని జెప్పవలసిన నాయఁడే జ్ఞానహీనుఁ డయినప్పుడు పరుల ననుట భావ్యము గాదు. పెండ్లికూఁతునకే పేలపిండిజావ యైనప్పుడు పేరంటాండ్ర మాట యేల? అయినను బెద్ద లెవరున్నారు? కొమ్మరాజుగారా?

—§ నరసింగరాజు §—

అన్నయ్యా! కళ్యాణపట్టణాధీశుండయిన వీరసోమేంద్రుని కూఁతును మల్లదేవుఁడు వివాహమైనందువలన వీరసోముని తనయుఁడు కొమ్మరాజుగారు చెల్లెలి పక్షము వహించి మల్లదేవునికిఁ దోడునీడయై యుండుట సమంజసమే కాని కొమ్మరాజుపుత్రుఁ డయిన యలరాజు మనకు బిడ్డనిచ్చి కొన్న యల్లుఁడు. అట్టివాఁడు మామగా రగు నీ పక్షముండవలెఁగదా? మన యింటికి వచ్చి "నా కెవరితో విరోధము లేదు. అందఱు సమానులే" యని బొల్లిపలుకులుపలుకుచు నేపదిదినములో యుండును గాని మిగిలిన కాల మంతయు బ్రహ్మనాయని తోడనే యుండుట మిగుల గర్హ్యముగా నున్నది.

—§ నలగామరాజు §—

అప్పటికిని నే నొకటి రెండుసారు లంటిని. "మీ తాతగా రైన వీరసోముని తోడనే కళ్యాణరాజ్యాధిపత్యము పోయి యప్పటినుండి యీ నెపుల నే నివసించుచున్న తండ్రికొడుకులు మీ రిద్దరును నిక్కడనే స్థిరముగా నుండరాదా" యని హెచ్చరించియే యున్నాను. అలరాజునకు నా మాటలు నచ్చలేదు. పిల్ల నిచ్చికొన్నవాఁడ నయినను నాక తనిపై ననురాగము తగ్గుచున్నది. నాకంటె మల్లదేవుఁడు కావలసినవాఁడు గాఁబోలు.

—♦ నాయకురాలు ♦—

అతఁడు. గూడ మనకు శత్రుకోటిలోనివాఁడే.

—§ నలగామరాజు §—

అవును.

(తెరపడును)

### దృశ్యము 10

**మండాదిలో మల్లదేవుని సభ.**

బ్రహ్మనాయఁడు, మల్లదేవుఁడు, బాలచంద్రుఁడు, మాట్లాడుకొనుచుందురు.

—† మల్లదేవుఁడు †—

నాయుఁడు గారూ! మన మాచెర్లరాజ్యలక్ష్మి యాఁడు దాని పెత్తనంబున నెట్లు వర్ధిల్లుచున్నదో!

—* బాలచంద్రుఁడు *—

ఎట్లు వర్ధిల్లునో చెప్పనేల? మూఁడుపూ లాఱు కాయలు "మగవానిచేతి బిడ్డ - ఆఁడు దాని చేతి యర్థము" నని పెద్దలనాలోచనముగఁ జెప్పిరా?

—♦ బ్రహ్మనాయఁడు ♦—

ఏమో యెట్లనగలము? మన మెంత రావలదని బ్రతిమాలినను వినక మనల విడనాడ నొల్లక మనతోఁ వచ్చిన యీ వైష్ణవకుటుంబములు గాక, "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ"

యను వాక్యము ప్రకారము జన్మభూమి యగు
మాచెర్ల నెడబాయ నొల్లని యా మిగిలిన కొలఁది
వైష్ణవకుటుంబములు మాత్రము ముత్కటంబు లయి
నకష్టంబులం బడి క్రుళ్ళుకొను చుండును.

—* బాలచంద్రుఁడు *—

అనుమానింపఁ బనిలేదు. నిన్నటి యుద
యను మాచెర్లమండలములోని నిష్పక్షపాతబుద్ధు
లును ధర్మశాస్త్రానుసారులును నగు శైవబ్రాహ్మ
ణులిరువురు మన యూరి మీఁదుగా శ్రీశైలము
నకుఁ బోవుచుండఁగా నాపి వారితో నేను మూల్లాడి
విషయంబులు రాఁబట్టితిని.

—♦ మల్లదేవుఁడు ♦—

ఏమనిరి?

—§ బాలచంద్రుఁడు §—

చెప్పనేల? శైవమత పిశాచము... ..

—♦ బ్రహ్మనాయుఁడు ♦—

కుమారా! మహాత్ముల విషయమై నీచోప
మంబులు రానిచ్చుట పాపంబుల మతేము
తగదు.

—♦ బాలచంద్రుఁడు ♦—

విరోధిమతభూతనాథుండు...

—* బ్రహ్మనాయుఁడు *—

ఎంత విరోధుల మతమైనను నర్థగంభీర
మయ్యు నిందాపోషకమైన స్తుతికిఁ బ్రాజ్ఞు లొప్పరు.
అన్యమతద్వేషము మన బోంట్లకుఁ ద్యాజ్యము
వైష్ణవమత సూత్రము లెట్టివో శైవమతసూత్ర
ములు నట్టివే. రెండును సంభావ్యములే. "లోకో
భిన్నరుచిః" యను న్యాయము ననుసరించి మనకు
వైష్ణవమతము నచ్చినది. వారికి శైవమతాభిలాష
"మొంట" జీర్ణించినది. ఇవి దివ్యతేజోభాసమా
నుండైన యా విరాట్పురుషుని బొందుట కేర్పడి
చిన మార్గాంతరములు గాని వేఱుగావు.

—§ మల్లదేవుఁడు §—

బాలచంద్రా! నాగమ్మగారి పాలన మెట్లు
న్న దఁట?

*— బాలచంద్రుఁడు *—

సదాశివుండు రాష్ట్రంబున నెచ్చటఁ జూచి
నను వికటాట్టహాసం బొనర్చుచు వైష్ణవసంప్రదా
యప్రదేశంబుల నర్తనపాటవంబు గల తన పాదం
బుల నణఁగఁద్రొక్కుచుఁ బరిఢవిల్లుచున్నాఁడఁట
మన మందందు నిర్మించిన వైష్ణవాళ్వార్ల మంది
రంబు లన్నియుఁ బ్రమథగణమందిరంబులై నవఁట
నాయకురాలు శైవసంఘసంస్థలు దేశమం దెల్ల
డల నింపి వాని కార్యనిర్వహణంబునకుఁ దన
యెఱుకగలిగి లోఁబడిన వారిని నియమించి తన
పలుకుబడిని క్రమంబుగ నుచ్ఛస్థితికిఁ దేఁ దలంచి
నను నిప్పటికిని మిగిలియున్న వైష్ణవమతాదర్శుల
కష్టపరంపరలం జూచి జాలినొంది కొన్ని శైవసం
ఘములే యెదురు దిరిగి తండ్రిగారిని బ్రశంసించు
చుందు రఁట.

—§ మల్లదేవుఁడు §—

కారణము?

—§ బాలచంద్రుఁడు §—

తండ్రిగారు సర్వమతసహనము గలవారు
నాయకురా లన్యమతదూషణానందవిలాసిని.

—♦ బ్రహ్మనాయుఁడు ♦—

విరోధిమతము లోని వారి కష్టంబులు
చూచి జాలినొందు సమబుద్ధులు శైవులైనను
వైష్ణవులైనను బ్రశంసాపాత్రులే అట్టి వారుం
డుట మనకు శుభసూచకము.

—‡ బాలచంద్రుఁడు ‡—

ఎట్లు?

—♦ బ్రహ్మనాయుఁడు ♦—

గడువు గడవఁగానే యావశ్యకమని తోఁచు

నెడల వారియొక్క పలుకుబడిని గూడఁ బొంద
వచ్చును.

—* బాలచంద్రుఁడు *—

నాయకురాలితో యుద్ధముఁ బ్రకటింప
వలసివచ్చునా యేమి?

—♦ బ్రహ్మనాయఁడు ♦—

గడు వతిక్రమించినను మన రాజ్యము
మఱల నివ్వనిచోఁ జేయునది యేమి?

—* బాలచంద్రుఁడు *—

ఆమె యిచ్చుటేల? ఆమెతోఁ జెప్పకయే
మన రాజ్యము మనము గ్రహింపవచ్చును. కా
దనినచో మన చేతులతీట మాన్పుకోవచ్చును.

—* బ్రహ్మనాయఁడు *—

అది లెస్సగాదు. ఈ యవధి ముగియఁ
గానే మా రాజ్యమును మా కిమ్మని తగినవానిచే
రాయబార మంపుట సమంజసము. అనంతరము
నిరాకరించిన యెడల ...... అయినను నంత
దూరము వచ్చునని నమ్మకము లేదు.

—* మల్లదేవుఁడు *—

ఏల నమ్మకము లేదు! మా చెల్లి విడిచివచ్చి
నను మన కప్పుడప్పుడు పరోక్షముగా నేదియో
కీడు గావించుచున్న నాయకురాలి నెట్లు నమ్మ
వచ్చును!

—♦ బాలచంద్రుఁడు ♦—

(దూరమున జూచి) నాన్నగారూ! ఏమది
అన్నయ్య కన్నమదాసు వెంట జనముతో నుదు
రులు గ్రక్కుచుఁ బరిఘంబు చేఁగొని హాటా
హుటి యిటు వచ్చుచున్నాఁడు.

—* కన్నమదాసు *—

(ప్రవేశించి) పెద్దలకు నమస్కారములు.

—* బ్రహ్మనాయఁడు *—

ఏమిటి విషయము?

—* కన్నమదాసు *—

నాన్నగారూ! ఏమని చెప్పుదును నాయకు
రాలి దుండగములు!

—♦ మల్లదేవుఁడు ♦—

మఱల నేమి సంభవించినది?

—♦ కన్నమదాసు ♦—

ఈ రాత్రి మండాది యరణ్యంబులం దుండు
చెంచులు సుమారు వందమంది యీటెలును సూరి
యలును గొని యూరిబయట నున్న కొట్టమునకుం
బోయి యావుల బంధంబుల విడిపించుచుండిరి.

—* బ్రహ్మనాయఁడు *—

పశుయజమానుం డగు లంకన్న లేఁడా?

—* కన్నమదాసు *—

ఒడలు మఱనక కోడినిద్దురవోవు చున్న
లంకన్న చివాలున లేచి పరిఘంబు చేఁగొని
గోవుల మధ్య దుముకు బెబ్బులి విధంబున భిల్ల
వ్రజంబులోనికిం గుప్పించి యెగసి వారి నందఱ
వీతిహోత్రభయకంపితులం జేసి హస్తాలంకృతం
బైన పరిఘంబు పోటుల కొక్క యఱగడియ లోన
నిరువది మందిని బలిదీసి విజృంభించుచుండెను.

—♦ బాలచంద్రుఁడు ♦—

సెబాస్ లంకన్నా!

—* కన్నమదాసు *—

తమలోఁ బడిపోయిన వారిం జూచి భిల్లు
లుఁ దీవ్రమాత్సర్యులై లంకన్నను దాఁకిరి.

—* బ్రహ్మనాయఁడు * —

మిగిలిన వీరందఱేమి చేయుచుంటిరి?

—* కన్నమదాసు *—

కొట్టములో నొక ప్రక్క నిద్రాపరవశుండ
నైన నన్ను లేపక శత్రుధ్వంసన మను నీపండుగు
భోజనంబు దానొక్కఁడే భుజింపం దలంచి నిస్స
హాయుండై వారిం దాఁకి విక్రమోజ్జృంభితసంహా

రోన్మాదంబు నెత్తికెక్కఁ జేఁగత్తి నురవడిం ద్రి
ప్పుచుఁ దనపైకి నించుకంతయు విరోధిశౌర్యర
సంబు చిందకక గడియలోన నేఁబదిమంది భిల్లుల
శోణితంబులఁ గ్రక్కించి కొంతసేపటికి మనయోధా
గ్రేసరుండగు లంకన్న బడలిపోయెను.

-◆ మల్లదేవుఁడు ◆-

ఇదంతయు నెవరు చూచుచుండిరి?

-§ కన్నమదాసు §-

దొడ్డిలో నొకమూలఁ బండుకొని యున్న మన పరిచారిక యొకతె చూచి భయపడి మొదలనుండి తరువాత నాతోఁ జెప్పినది.

-† బ్రహ్మనాయఁడు †-

దాసూ! అనంతర మేమయినది?

—§ కన్నమదాసు §—

(విచారముతో) ఏమయినది! మనవాఁడు బడలుట చూచి హతావశిష్టులగు వారందఱుఁ జుట్టుముట్టి మన బిరుదుజెట్టిని నేల కొఱగించిరి క్రిందఁ బడి "కన్నమా! చచ్చితి" నని పెద్దపెట్టున బొబ్బవెట్టి స్వర్గస్థుండయ్యెను.

అందఱు

నారాయణ! నారాయణ!

-§ బ్రహ్మనాయఁడు §-

(దుఃఖ) ఆహా! ఎంతపనిజరిగినది! లంకన్నా! నీ సంసారంబును సంతసు మించిన ప్రేమాస్పదులమైన మమ్ములను విడనాడి పోయితివా!

నగుచుం గేరుచు నేడ్చుచున్ వికలియై
　　నారాయణుం గొల్చు స
ద్భగవద్భక్తుని మాద్రి మా పసులమందన్
　　దువ్వి ముద్దాడుచున్
బగలున్ రాతిరి వానిసేవయె మహా
　　భాగ్యంబుగా నెంచి నీ
పగు ప్రాణంబును గూడ నిచ్చితి వహో!
　　ధన్యాత్మ! వీరాగ్రణీ!

-† మల్లదేవుఁడు †-

మన దినములు మంచివి గావు. విధిచేయి దంబులఁ దప్పింప నేరితరము? ఔరా! ఎంతటి వాల్మ గంబు పడిపోయెను!

—* బాలచంద్రుఁడు *—

లంకన్నా! తోడెవ్వరిం గొనిపోక శత్రుసంహారంబను మందాకినీజలక్రీడల నీవొక్కండవే యనుభవించి కడను మమ్ము విడిచిపోయితివా! నీవు చనిపోయినను బల్నాటి వీరపౌరుషంబునకుఁ గళంకంబు రానీయలేదు.

సతతముం గంటను వత్తి గొంచుఁ బశురక్షాదీక్షఁ బాటించు నీ
చతురత్వంబు ప్రశంసనీయ మనుచున్ స్వామ్యర్థమర్పించి పో
యితి; స్వర్గంబునఁగూడఁ జాటదగునోయీ! నీవు లంకన్న! యు
ద్ధతిఁ బల్నాటి తెనుంగు వీరుల సమిద్ధైర్యప్రతాపంబులన్.

-* కన్నమదాసు *-

నే నంతట లేచి పోయి బిరాన హతావశిష్టుల నందఱను నాపరిఘుంబున నిర్వీర్యులం జేసి విషయం బంతయు వారినుండి రాఁబట్టఁగా వారు నాయకురాలిచేఁ బ్రేరేపింపబడి మన పసువులఁ దోలుకొని పో వచ్చినట్లు తేలినది.

-§ బాలచంద్రుఁడు §-

ఔరా! నాగమ్మా! ఎంత మాయావినివి! ఆఁడుదాని పిఱికిచేష్టలఁ బో నిచ్చితివి గావు. పౌరుషం బున్నయెడలఁ జెప్పి తలపడి భంగంబు నొందింపవలెఁ గాని యిట్టి గూఢక్రూరాలోచనములచేఁ బగఱ సాధింపఁజూచుట పల్నాటి గడ్డలోఁ బుట్టిన వీరులగు వారందఱకుఁ దలవంపులుగా నున్నవి. పేనునకుఁ బెత్తనము వలె మంత్రిత్వంబు వహించి యహరహము దుష్కార్యాచరణాందోళనంబున మునిఁగి తేలు నీకుఁ ద్వరలో బుద్ధిఁ జెప్పింపవలెఁ గాని మిన్నకుండుట పాడిగాదు.

—◆ మల్లదేవుఁడు ◆—

నాయఁడుగారూ! మన మెంత తన జోలికి రాకున్నను శనివలె వేధించుచున్నదే. దుష్టులకు నింకను దూరంబుగ నుండుట మే లనుకొందును.

—* బ్రహ్మనాయఁడు *—

అవును. ఈగడు వతిక్రమించు వఱకు మన మెట్లో తల దాఁచు కొనవలెను. శ్రీశైలప్రాంతములకుఁ బోయి యీ నాల్గుదినములు గడపుకొనుట మంచిదని తోఁచుచున్నది. కానింకను నాయకురాలి పాపము లింకను బండవలెను.

—◆ మల్లదేవుఁడు ◆—

నా దృష్టి గూడ శ్రీశైలము వైపునకే పోవుచున్నది.

—◆ బ్రహ్మనాయఁడు ◆—

సరే. విచారింతము

(తెరపడును)

దృశ్యము 11

ఒక గ్రామములో సభలో బ్రహ్మనాయఁ డుపన్యసించుట.

—* బ్రహ్మనాయఁడు *—

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం
ఆజానుబాహు మరవిందదళాయతాక్షం
రామం నిశాచరవినాశకరం నమామి.

నీయందే ప్రభవించు నెల్లజగముల్ నీయందె నిల్వంబడున్
నీయందే లయమొందుఁ దుట్టతుదకున్ నిత్యంబు నీవొక్కఁడే
మాయామేయజగన్నిరీక్షణ! తలంపన్ సాక్షిమాత్రుండవౌ
నీయాకారము విశ్వతోముఖము తండ్రీ! దీనచింతామణీ!

(అని ధ్యానమొనర్చి)

శ్రీమతే రామానుజాయనమః

మహాశయులారా! బ్రాహ్మణాది మహాజనులారా! నారాయణస్వరూపులైన యీ మహాసభకు నమస్కారములు. అమాత్యపీఠంబున నుండి పల్నాటిరాజ్యం బంతయు గుప్పిటఁ బెట్టుకొని నిడుపటూన రాజ్యతంత్రనిర్వహణకళా నైపుణ్యంబున సంకల్పమాత్రసఫలీకృతసర్వకార్య యయి విజృంభించు నాగమ్మగారి చేతిక్రిందఁ బడలేక పశుహారణప్రయత్నానంతరము మండాది నుండి యీ కుటుంబము లన్నియు లేవఁదీసికొని వచ్చి యీ ప్రాంతంబుల నీరమేడపి యందు నివాస మేర్పఱచుకొని సంవత్సరంబు దాఁటిపోవు నను నిమ్నజాత్యుద్ధరణ ప్రచారము గావించుటలో నితర గ్రామములకు వలె మీ యూరికిఁ జాఁ సారులు వచ్చి బోధించుట తటస్థపడలేదు. కుమింతురుగాక. భార్యాపుత్రాదులతో సంసారం బొనర్చు మన బోంట్లకు కందఱకు విషయలోలత్వ మనివార్యము గాఁ గప్పడి నను దినమున కొక్క గంటయైనను భగవత్సేవాపరాయణులమగుట యావశ్యక మని నొక్కి వక్కాణించుచున్నాను. భగవత్సేవ రెండు విధములు కొందఱు మానవులు ప్రపంచరీతికి విలక్షణులై విరాజిల్లు నట్టి యా పరమాత్మని మానసికంబుగాఁ గాని పూజావిధానాదులచేఁ గాని సేవించుచున్నారు. మఱికొందఱు పరమాత్మస్వరూపం బంతటను నిండియున్న యీ ప్రపంచమే యాం దివ్యమంగళ విగ్రహముగాఁ దలఁచి వివిధంబుల సేవ లొనర్చుచున్నారు. ప్రజాసేవయును భగవత్సేవయే. ప్రజాసేవకు లగు వారందఱకు నిమ్నజాత్యుద్ధరణము పరమధర్మము. ఈ పంచమోద్ధరణము వర్ణాశ్రమ ధర్మావలంబనమునకు వినాశకర మను తలంచుట కేవల మజ్ఞానజనిత మని యిచ్చోని ప్రాజ్ఞులగు వారికిఁ దెలియనిది కాదు. బాహ్యస్వరూపము కంటెగాఁ బ్రాహ్మణ్య విరాయుక - వర్ణాశ్రమధర్మంబుల సూత్రించిన విఖ్యాతులగు నా మహానుభావుల హృదయ మేమో గ్రహించి మనము ప్రవర్తించుటన్యాయము. బ్రాహ్మణకుటుంబములో

జన్మించిన మాతృముననే మానవుని కగ్రతాంబూ
లమిచ్చుటయు మనమందఱముఁ గలిసి కల్పించిన
నైచ్యంబునం బడి కొట్టుకొనుచుండు మాలమాది
గల కుటుంబములలోఁ బుట్టు వానికి నికృష్టతారో
పణంబు గావించుటయు మన బుద్ధి మాంద్యంబు
నకు నిదర్శనము లని తమకు నివేదించు కొను
చున్నాను. పరమపవిత్రు లందఱిలోను గలరు.
మోక్షమార్గంబునం బోవు నాధ్యాత్మికదృష్టి గల
జ్ఞానికి • సర్వమానవసమానతాసహోదరత్వము
లు పాదద్వయంబుగా గ్రహింపవలె నని మనవి
సేయుచున్నాను. అంత మాత్రముచేత సిబాహ్య
వర్ణభేదములు మాపుమాపవలె నని నా యాశ
యము కాదు. అట్టి కట్టుబాట్లు ప్రపంచ పరిస్థితుల
కావశ్యకములని నే నొప్పుకొనుచున్నాను. మన
వర్ణాశ్రమధర్మావలంబనము పరుల కెంతమాత్రము
కష్టకారి కాఁగూడదనియే నా ప్రార్థనము. విశ్వ
విశ్వంభరాదేవికి శిరోభాగంబై విమలకీర్తి ప్రతాపు
లగు హరిశ్చంద్ర దశరథ శ్రీరామచంద్రాది మహా
రాజపుంగవులయు బుద్ధ మహాత్ములయు సేవా
భాగ్యంబులం గాని నిఖిలైశ్వర్యపరంపరలకు మాతృ
పీఠంబై యలరారిన మన భరతఖండంబున దేశ
జననీహృదయశల్యాయమానమై యున్న యీ
యంటరాని తనమును నిర్మూలం బొనర్చి మానవ
సమానతా ధర్మంబు దేశమం దంతటను బ్రతిష్ఠిం
పవలె నని మిమ్ముల వేఁడుచున్నాను. ఆనాఁ డే
కారణంబుచేఁ బంచముల నస్పృశ్యులుగాఁ బెద్దలు
పరిగణించినను — ఆ సూత్రబంధంబుల నేఁడు
త్రెంపి సర్వమానవసమానతాసౌభ్రాత్రంబులు
ప్రకటింప వలసిన తరుణము వచ్చినది. మనమెట్లు
పుట్టితిమో వారును నట్లేజన్మించినారు మనలఁ గనిన
ప్పుడు మన తల్లులెట్టి గర్భవేదనలం బడిరో యట్లే వారి
తల్లులునుఁ బ్రసవబాధ లనుభవించి వారిం గనిరి.
వారి నేమి చెట్టున గోసికొని రాలేదు. మన శరీ
రంబున నెట్టి చీము రక్తములు గలవో పంచముల
శరీరంబులఁ గూడ నట్టివే కలవు. మనకు వలెనే
రోషాభిమానాదిగుణంబులు వారికిని గలవు. మన
మందఱము జగజ్జేగీయమాన యగు నీ భరతమాత
గన్న బిడ్డలము. సోదరవాత్సల్యంబు పూని పర
స్పరము ప్రేమించుకొనుచు దేశమాత యొసంగిన
నిఖిలవస్తుభోగంబుల పట్ల హైందవజాతి కంతటికి
సమానమైన హక్కులుంచుకొని లోకకల్యాణము
నకుఁ దోడ్పడవలెఁ గాని దేశశరీరంబునందలి య
వయవంబులలో నొక యవయవమైన పంచమకు
లంబు లోని వారిని గ్రామబాహ్యులుగా నొనర్చి
దూరస్థులంజేయు నైచ్యంబునకుం బాల్పడుట పాడి
గాదు. ఒక్క తల్లికడుపున బుట్టిన సోదరుల న
స్పృశ్యులుగా భావించి యూరిబైట దురవస్థలం
దుంచుట చూచి యీ హృదయం బేల కరగకు
న్నది.? భూతసృష్టిలో మానవు లుత్తమజాతి
గాఁ బరిగణింపఁబడుచుండఁ బంచములగు నీ
సోదరులను బశుపక్ష్యాదుల కంటె నీచతరంబుగఁ
జూచుట యెంత యవమానకరమో యించుక
యోచించిన బోధపడును. తోడి మానవుల
యార్థికాదిదుస్థితుల నిర్మూలించుటకై చేదోడు వా
దోడుగా నుండుటకు మాఱుగా సోదరుల నంటి
నను మడిగట్టుకొన్నప్పుడు వారిని జూచినను మహా
దోషముగా నెంచిన యీ బ్రాహ్మణపండితజాతి
వారు దేశమాతృహృదయోద్వేగకరు లని చెప్పిన
చో నది సత్యమున కెంతమాత్రము దూరముగాదు.
వినయాదిసద్గుణసముపేతులగు బ్రాహ్మణశ్రేష్ఠులే
నోట వచింపరాని యిట్టి పరపీడనముఁ గావించు
చుండఁ దదితరుల మాటఁ జెప్పనేల? యథార్థ

మాలోచించిన యెడల బ్రాహ్మణుల కంటె నితర జాతులే పంచములయెడఁ గొంతవఱకుఁ గృపాస్వభావులై యున్నారని చెప్ప టతిశయోక్తి గాదు. హైందవసంఘశరీరము నాశించిన నంజురోగమసందగు నీ యస్పృశ్యతకుఁ గారణము పంచమకులజులొనర్చు పశుహింస, యపరిశుభ్రత మొదలగు నవియే కాని వేఱొక్కటి కాదని చెప్పుదురు. నేనిప్పు డన రాదు గాని మును పు కొంతకాలము క్రిందటి వఱకు సత్యము, శౌచము మొదలగు సద్గుణంబులు గలిగిన బ్రాహ్మణపుంగవులే యనుదినము మాంసభోజనముఁ గావించుచుండి రని మన పురాణములు ఘోషించుచున్నవి. దీనిని బట్టి మాంసభోజనము మంచి దని నేను సమర్థించుట లేదు. కాని బ్రాహ్మణులు లోనగు వారు పంచములతోఁ గలిసి మెలసి యుండి నీతిబోధఁ గావించి యా దురాచారముల నెట్టులైన మాన్పింప వలెఁ గాని వారి నస్పృశ్యులుగా భావించు మహాపాతకంబున కొడిగట్టుట పాడి గాదు. ఆర్థికవిషయంబులచే నేమి యితరవిషయంబులచే నేమి యీ పంచమజాతివా రందఱును పై జాతులపై నాధారపడియున్నారు. స్వాతంత్ర్యవిరహితులై యిట్టి నీచతమ పారతంత్ర్యం బనుభవించు సోదరులయెడ నణుమాత్రం బైన కరుణాహృదయంబు చూపని యీ భారతీయులు పాపము పండఁగానే కొన్ని వందలసంవత్సరంబుల కైనను స్వాతంత్ర్యదూరులై యవాచ్యం బైన పారతంత్ర్యమును బానిసతనమును ననుభవింపకపోరు. సర్వదయామయుం డైన భగవంతుం డిది చూడక పోఁడు. మఱియుఁ బంచములతో నిచ్చిపుచ్చుకొను బాంధవ్యంబును గలిగించుకొనుఁ డని కాని పఙ్క్తిభోజనంబులఁ గావింపుఁ డని కాని నేను మిమ్ముల నుద్బోధించుట లేదు. మీరు పశుపక్ష్యాదుల నెట్లు చూచెదరో యీ దీనుల నంతమాత్రమైన జూడుఁడు. వా రల్పసంతుష్టులు. అంతమాత్రము చేతనే వా రందఱు మెచ్చుదురు. ఓ మహాజనులారా! ఇకనైనను ధర్మపక్షాభిమానులై ఱాతిగుండెల నైనను గరగింపఁగల మాలమాదిగల యార్థికాదిదురవస్థలం జూచి కంటఁ దడిపెట్టి -- ఆ దీనులను - ఆ దిక్కులేని పక్షులను - దయాహృదయంబునం జూచి యస్పృశ్యతాధానమహాపాతకంబునం బడక సవిరాస్థులం జేసికొని విద్యాబోధ గావించి మీ యంత వారినిగాఁ జేసి యాఁకటిమంటలతో నెరియుచున్న యీ కృశించు కడుపులకింత యన్నము నచ్చు మార్గంబులఁ బరిశోధించి దయాసత్యాదిసద్గుణసంపుటీకరణ మైన మీ బ్రాహ్మణత్వమును సార్థకపఱచుకొనవలె నని ప్రార్థించుచు విరమించుచున్నాను.

(తెరపడును)

దృశ్యము 12

బాలచంద్రుఁడు ప్రవేశము.

—§ బాలచంద్రుఁడు §—

గడువేడేండ్లు ముగించినన్ మఱల నా
　　గాంబాజ్ఞయా రాజ్యమం
దడుగుం బెట్టు నిమిత్తమై? దురవగా
　　హం బిద్ది నాబోంట్ల కా
పడుచుం జోదును రాయబారమునకై
　　పంపించిరే కాని యీ
పాడిమాటల్ ఫలియించునా యలుక ని
　　ప్పుల్ గాక గుర్జాలలోన్.

రాయబారి యెన్నిక చక్కగా నున్నది. కాని వారు రాజ్యమిచ్చుట మాత్రము సంశయాస్పదము. ఈ సంశయమే స్థిరపడునెడలఁ దండ్రిగారి ప్రాంతములఁ గావించు పంచ మోద్ధరణోపన్యా

సములు రాజకీయోపన్యాసములు నూరకపోవునవి కావు. ఈ విషయంబులలోఁ గన్నమదాసు సేకరించిన సాక్ష్యపుఁగాగితములు తండ్రిగారికి వేవితంబుల సాయం బొనరించిన వని చెప్పవచ్చును. నాయకురాలు మా పట్లఁ గాని యితరుల పట్లఁగాని మాత మము. పేరుతోఁ గాని యెన్ని దౌష్ట్యంబు లొనరించినదో యత్యంత రహస్యముగా విచారణ గావించి వారు వారు చెప్పిన విశ్వాసపాత్రము లగు విషయములు కాగితములపైఁ జేవ్రాళ్ళతోఁ గూడఁ దీసికొని యీ సాక్ష్యపత్రసంపుటం బొనరించిన కన్నమదాసు ప్రశంసాపాత్రుండు. అలరాజీ సాక్ష్యపుఁ గాగితములఁ గూడఁ దీసికొని పోవుట మొదటఁ గొందఱకు నచ్చలేదు. అతండు ముందు శాంతముగాఁ బ్రసంగించి చూచి రాజ్యప్రదానంబునకు వారొప్పుకొన్నయెడల నా పత్రంబుల బయటికిఁ దీయండు. మాచెర్ల రాజ్య మెంతమాత్రము నీయమని స్పష్టముగా వారు చెప్పినదో నా మహాసభలోనే పెద్ద లందఱు వినుచుండ నాయకురాలి దుండగము లన్నియు బయలువెట్టి యట్టి కుటిలచిత్తను మంత్రిణిగాఁ జేసికొనుట సంభావ్యము గాదని నలగామరాజునకు మనస్సున కెక్కించి యామె మాటలు విని రాజ్యం బొసంగకుండుట సమంజసము గాదని నచ్చఁ జెప్పును. అప్పటికిని రాజు విననియెడల గురిజాల మొదలగు ప్రదేశంబుల నుపన్యాసపరంపరలఁ గావించి నాయకురాలిపై నసూయఁ గల్గించి ప్రజలు మనకనుముఖులుగా నుండునట్లు చేయును. అందుఁ దప్పేమున్నది! (ఆలోచించి) మొత్తము మీఁద నాకుఁ జూడ భవిష్యత్కాలగగనము ఘోర విషమాంధకారమయంబు గానే యున్నది. చెన్న కేశవుం డేమి చేయునో తెలియదు.

(నిష్క్రమించును.)

దృశ్యము 13

నలగామరాజు సభ.

నాయకురాలు — నరసింగరాజు — నలగామరాజు మాట్లాడుచుందురు.

—* నలగామరాజు *—

నాగమ్మగారూ! మీరు వినలేదు కాఁబోలు నింతకు ముందే వీరమేడపి నుండి రాయబారము వచ్చినది.

—* నాయకురాలు *—

వచ్చిన దెవరు?

—♦ నరసింగరాజు ♦—

అల్లుఁడగు నలరాజు మామగారితో సంప్రతించుటకు వచ్చినాఁడు. నాలుగైదు సంవత్సరముల నుండి యీ చాయలకు రాకున్నను — మంచికిఁ జెడ్డకు బ్రహ్మనాయని మల్లదేవుని వెనుక వేసికొని వాదించు నట్టి జామాత యేదియో మనసులో మాట గట్టుకొని శ్వశురగృహమునకు నేఁడు వేంచేసి యున్నాఁడు.

—* నాయకురాలు *—

ఏమి విశేషములు?

—♦ నలగామరాజు ♦—

ఇప్పుడు సభకు వచ్చి తెలియఁబఱచు నని తోఁచుచున్నది.

*— నాయకురాలు *—

విషయ మేమో గ్రహింపలేదా — నరసింగరాజుగారూ?

—§ నరసింగరాజు §—

మాట — మాట — వచ్చి వారి గడువేడేండ్లు నీ పుష్య శుద్ధ దశమితోనే చెల్లిపోయిన దని చెప్పినాఁడు.

♦— నాయకురాలు ♦—

వాస్తవమే.

—§ నలగామరాజు §—

దీనినిబట్టి సర్వము తేటతెల్లముగదా.

—♦ నాయకురాలు ♦—

అవును. మఱల మాచర్ల రాజ్యము తమ కిమ్మనుటకే యీ రాయబారము.

—§ నరసింగరాజు §—

మఱి మీ యుద్దేశ్యమేమి?

—§ నాయకురాలు §—

ఒకరి యుద్దేశ్యములతోఁ బనిలేదు. శైవ మతోద్ధరణము — ననఁగా — దేశోద్ధరణము గావింప బద్ధకంకణులమై యీ యేడేండ్లనుండి ప్రజాబోధము గావించి యహరహము సలిపిన కృషి యంతయు బూడిదలోఁ బోసిన పన్నీరుగాఁ జేయఁదలఁచిన యెడల వారి మాచర్ల రాజ్యము వారికి మఱల నీయవచ్చును. కాని యిప్పు డాలోచింపవలసిన మహావిషయమిది. ఎన్ని కడగండ్లఁ బడినను సర్వస్వము దేశోద్ధరణము నిమిత్తము త్యాగ మొనర్చియైనను నీ శైవమతోద్యమమును సర్వవిధములఁ గొనసాగించుట కీర్తికాములగు రాజన్యుల కవసంబనీయ మగునా? కాదా? చెప్పుఁడు. అయినను మే మీ విషయ మీనాఁటికే చర్చించితిమి. మీ యన్నగారు తుద కైనను నా యూహతో నేకీభవించినందులకు సంతోషము.

—* నరసింగరాజు *—

లెస్సగా నాలోచించితిరి.

సేవకుడు

(ప్రవేశించి) అయ్యా! దండాలు అలరాజుగా రొస్తున్నారు.

—♦ నలగామరాజు ♦—

మంచిది.

(నరసింగరాజు నాయకురాలు నెదురు వోవుదురు.)

—♦ నాయకురాలు ♦—

అలరాజుగారికి నా యభివాదనములు.

—♦ అలరాజు ♦—

పెద్దలకు నమస్కారములు.

(రాజున కెదురుగాఁ బోయి)

గురిజాల సింహాసనాధ్యక్షులకు వందనములు.

—* నలగామరాజు *—

(చిఱునవ్వుతో) కూర్చుండుము.

—‡ నాయకురాలు ‡—

రండు. ఈపీఠం బధిష్ఠింపుఁడు.

—‡ అలరాజు ‡—

(కూర్చుండును)

—§ నాయకురాలు §—

(కొంచెమాఁగి) సకుటుంబపరివారులగు మల్లదేవులకు క్షేమమా?

—* అలరాజు *—

చిత్తము. క్షేమముగా నున్నారు.

—* నాయకురాలు *—

బ్రహ్మనాయనికిని నాతనికుటుంబమునకును సౌఖ్యమే? మీ తండ్రిగారు సుఖులే?

—‡ అలరాజు ‡—

అందఱు దైవానుగ్రహంబున సుఖులై యున్నారు. నాయఁడుగారు, మల్లదేవులు మొదలగు వారందఱును బేరు పేరు వరుసల మిమ్ముల నడిగినట్లు చెప్పు మనినారు.

—‡ నలగామరాజు ‡—

అలరాజా! అక్కడి విశేషంబులు చెప్పుము.

—§ అలరాజు §—

విశేషంబు లేమున్నవి! ఎవ్వ రెన్ని కష్టపరంపరలం గూర్చుచు నలజడి పెట్టుచున్నను నఱచేత నెట్లో ప్రాణంబులు దాఁచుకొనుచుఁ దొలుకాఱు మబ్బు చినుకులకై వేచు చాతకంబుల రీతి మీ సోదరులు స్వరాజ్య సిద్ధికై యువ్విళ్లూ

రుచున్నారు.

నలగామరాజు

జగద్రక్షకుండగు నా మహేశ్వరుఁడే యెవ్వరి కే కష్టములం గూర్చినను. అయినను వా రెట్టి యిక్కుములం బడిరో గురిజాల కేమియుఁ దెలియదు. • •

అలరాజు

• సింహాసనాధ్యక్షు లెన్నఁడో కాని ప్రజా సంఘంబుల లోనికి రా వీలుపడదు. నిరంతరము గద్దెపై నుండి పరోక్షజ్ఞానంబున బరిపాలనంబు సేయవలసి వచ్చు ప్రభువుల కివి చెవింబడుట కంతగా నవకాశముండదు గదా.

నరసింగరాజు

వా రక్కడ స్థిరనివాస మేర్పఱచు కొన్నట్టు లేనా, •అలరాజూ?

నాయకురాలు

ఔఁ అంతియే.

అలరాజు

మామగార్లకు నమస్కారము లొనర్చి నా యీ చెప్పుమాట లాలకింపవలెనని వేఁడు చున్నాను. ఆ నాఁడు మీరు కోడిపందెం బొకటి పెట్టి నిష్కల్మష హృదయు లగు బ్రిహ్మనాదుల నోడించిన వెనుక వారు నిత్యసత్యవ్రితానుష్ఠాను లగుటచే నాడిన మాట దప్పక సత్యమును బరి పాలించుటకై యడవుల పాలయి పోయి యించు కేనియు సమయభంగంబు గావింపక యో ర్పనెడి నావపై నెక్కి కష్టసముద్రంబు దాఁటుచు నీ పుష్యశుద్ధ దశమితో నేడేండ్ల గడువుఁ బూర్తి గావించినారు. అకుటిల ప్రవర్తనులును మాననీయు లు నగు మల్లదేవుఁడును, బ్రహ్మ నాయఁడును గడువు దాఁటిపోయినను గురిజాల లోని తమ యొక్కయు ముఖ్యముగా నాగమ్మగారి యొక్కయు నాజ్ఞ లేనిది మాచెర్లం బ్రివేశించుట పాడి గాదని తలంచి మీయనుజ్ఞఁ గైకొని రమ్మని రాయబారిగా నన్నంపినారు. రెండు పక్షంబుల కును గావలసిన వాఁడ నగుటచే నా మాటలకుఁ గొంత విలువ గలదనియు నవి స్వీకరింపఁబడ వనియు విశ్వసించుచున్నాను. ఇట్టికారు వీరులం దఱు గడువుఁ బూర్తి గావించిన వెంటనే మాచెర్లం బ్రవేశించుటయే పాడి యని యెంత నొక్కి వక్కా ణించినను దమ సోదరుఁడు పెదమల్లదేవుఁడును సద్గుణమూర్తి యయిన సత్త్వస్వరూపుం డగు బ్రిహ్మనాయఁడును వారిని మందలించి తమ కరుణకుఁ బాత్రులై పరస్పరస్నే హం బలవఱచుకొని యుభయపక్షామోదకరంబు గా నుండు నట్లు రాజ్యంబులో నడుగువెట్టఁ దలఁచి నారు అట్లు సిద్ధాంతీకరించుటకుఁ గారణము బ లహీనత గాదని యెల్లరకుఁ దెలియును. ఇంతకు ము న్నెన్ని యుద్ధంబులలో బ్రహ్మనాయఁడు ధను రాద్యాయుధంబులు గొని నిరవధికపరాక్రమం బున జిచ్చఱపిడుగై శత్రుసంహారంబొనర్చి వీరాధి వీరుం డని విఖ్యాతి వడసి నానారాష్ట్రయోధవరు లందఱకుఁ బ్రక్కలో బల్లెమై యెట్లు దిగంతరంబుల యశశ్చంద్రికల వెదఁజల్లి యుండెనో తమ రెఱుం గనిది గాదు. అట్టి మహాసత్త్వసంపన్నుఁ డగు బ్రహ్మనాయఁడు తన సద్గుణంబుల కన్నిటికి వన్నె దెచ్చునట్టి యమితవినయంబున స్నేహహస్తంబు చాఁపుచు మంచిమీఁదఁ గార్యానుకూల్యంబునకై యెదురు చూచుచున్నాఁడు. విధివశంబున బా హిరంబుగాఁ బల్నాటి రాజ్యంబు రెండు చీలిక లైనను నాంతరంగికంబుగ రెండు రాజ్యంబులు నొక్కటియే యని శత్రువులు దలంచునంతటి యై కమత్యంబునకు దోహదంబులు గావింపవలసినదని

తమతో మనవిఁ జేయు మని నన్నంపినారు. నా రంపిన యీ సందేశంబులోని యుత్కృష్టతఁగూర్చి యుక్తాయుక్తజ్ఞు లగు తమ రనుమానింప రని నా మనస్సాక్షి నాకభయ మిచ్చుచున్నను రెండు దెగల వారికిని బాంధవుండను గాన నా సందేశంబు రిత్తపఱచవల దని శ్రేలతనంబున మఱొక్కమాఱు ప్రార్థించుచున్నాను. (కూర్చుండును)

—* నలగామరాజు *—

(నాయకురాలి వంకఁ జూచును.)

—* నాయకురాలు *—

(లేచి) సందేశహరు లగు నలరాజుగారికి గురిజాల ప్రభువుల పక్షంబున బ్రత్యుత్తర మిచ్చుచున్నాను. అశేషపరాక్రమోపేతుం డగు నలుగురాజు దాఁటు వఱకు నీ పల్నాటిరాజ్యం బొక్కటిగ నుండి శత్రుకోటిని గన్నెత్తనీయకుండెను. బ్రహ్మనాయఁడు మ యోపాయంబుల వలన శైవమతాభిమాని యయిన మల్లదేవునికి వైష్ణవమత బోధ గావించి యాతని కని మాచెర్లభాగంబు బలాత్కారంబున నూడఁబెఱికికొని వెడలినప్పటి నుండియు మాకును మా ప్రజాసంఘంబులకును మితి లేని విచారంబు గలిగియుండుటవలన నెట్లయినను మఱల రాజ్యంబు నొక్కటిగానే యుంచి పాలించిన యెడలఁ బూర్వపుఁ గీర్తి నిలువఁ బెట్ట వచ్చునని తలంచితిమి. ఇట్టిస్థిరాభిప్రాయమునకు వచ్చుటకు శైవమతోద్ధరణము నందలి యభిమానము గూడ నొక కారణమని గ్రహింపవచ్చును. మాచెర్లరాజ్యంబు వా రేలుచుండు నంతకాలము వైష్ణవాదర్శంబుల యలజడికి మన శైవమతం బెంతటి చిక్కులు పడెనో శైవమతాభిమాను లగు తమకును దెలియనిది కాదు. ఇప్పుడు మఱల మాచెర్లరాజ్య మిప్పించుటకై శైవమతస్థు లగు మీ రే వేంచేయుట చూడ నిజముగా నేత్రకఠోరముగా నున్నది. ఈ గురిజాల సింహాసనాధిపతులు శైవమతప్రాబల్యమను దేశోద్ధరణము కొఱకు దీక్షాకంకణబద్ధులై యిది వఱకుఁ గలిగిన రాజ్యవిభాగమునకు వగచుచు నిఁక ముందొక సూదిమోపు నేల నైనను నా మతభ్రష్టుల కీయఁ దలంప లేదని వాక్రువక్కాణించుచున్నాను. మా యనుజ్ఞ లేకుండ మాచెర్లం బ్రవేశించుటఁ సంభావ్యము గాదని వారెంచుట మిగులఁ బ్రశంసార్హ మని యభినందించుచు నిట్టి ప్రతికూల ప్రత్యుత్తర మివ్వవలసి వచ్చినందులకు మిక్కిలి విచారించుచున్నాను.

—* అలరాజు *—

గురిజాల రాజన్యులను మ ఱొక్కమాఱు వినయపూర్వకముగఁ బ్రార్థించుచున్నాను. సమగ్ర యుద్ధకౌశలంబున నందెవేసిన చేతులనందగు నట్టి యా నైపు వీరులందఱు వినమ్రులై మీ కరుణాకటాక్షములకై యట్లు వేచియుండ నా మహామనుల నిట్లు చిన్నచూపుఁ జూచుట తమకు న్యాయము కాదేమో యని సందేహించుచున్నాను. సమానబలశౌర్యంబులు గల వీరు లిట్లు మీ స్నేహసుగంధంబు నాఘ్రాణించి యభీష్టసిద్ధిఁ గోరుచుండ — సిరి రా మోకా లొడ్డుట ప్రాజ్ఞుల యెత్తుగాదు. వారైనను దమకు న్యాయముగా నీవఱకుఁ బాలించుచుండు రాజ్యంబె మఱల నిమ్మనుచున్నారు గాని వేఱు గాదు. వారి మతప్రచారమును గూర్చి మన మేవగించుట తగనిపని. నేనెంత శైవమతాభిమాని నైనను న్యాయ మెద్దియో యది నిరూపింపవలయుఁ గాని తదితరంబునకు నా హృదయం బంగీకరించుట లేదు. మాచెర్లలో వారుండునంత కాలము శైవ

మతంబు చిక్కులు వడిన దని నాగమ్మగారు సెల విచ్చుచున్నారు. కాని యీ యేడేండ్ల నుండియు వైష్ణవుల యవస్థ యెట్లుండెనా యని వారును దిగులొందుచున్నారు. ఇట్టి యావేగ మధికార వ్యత్యయముచే ఖరస్పరముగా నుండును. బుద్ధి మతులగు నాగమ్మగారికి నే జెప్పఁగలవాఁడను గాను.

—§ నాయకురాలు §—

ఈ యేడేండ్లనుండియు వైష్ణవులయెడ నతికఠినముగాఁ బ్రవర్తించినామని వారితోఁ జెప్ప వచ్చును. అట్లు ప్రవర్తింప వలసినదే. కుటిలబుద్ధులకు మతాభిమాన ముండదు గాని మా బోంట్లకది యుగ్గుఁబాలతోఁ బెట్టినది.

—♦ అలరాజు ♦—

మతాభిమానమునకును మతమౌఢ్యమునకును గలతారతమ్యమును నాగమ్మగారు గ్రహింపవలెను. మతమౌఢ్యము లేని వారికిఁ బరమత సహన ముండును. పరమతసహనమే స్వమతమునకును నభివృద్ధికారణము.

—§ నరసింగరాజు §—

ఎంత కాదనినను నెవరికున్న మత మౌఢ్యము వారికున్నది గాని లేకపోలేదు.

—♦ నాయకురాలు ♦—

ఉండిన నేమి లేకున్న నేమి? ఈ విషయము తఱచు లెందులకు? వారికి రాజ్యంబులోఁ బాలొసంగమని మాతెగువు నొక్కి చెప్పవచ్చును.

-‡ అలరాజు ‡-

మాచర్ల రాజ్యంబు మఱల నా మహామహులకుఁ బ్రసాదించుటకు మీరేల సందేహింపఁ గలరో నాకు గోచరించుట లేదు. నాగమ్మగారు దూరదృష్టితో నాలోచింపవలె నని కోరుచున్నాను.

-‡ నాయకురాలు ‡-

కడుదూర మాలోచించియే రాజ్యభాగము లేదని చెప్పుచున్నాను.

-‡ అలరాజు ‡-

నిశ్చయమేనా?

—* నరసింగరాజు *—

సందేహించు టేలకో?

-§ నాయకురాలు §-

అలరాజుగారు రత్నపుత్రస్థులను మహామహులని సద్గుణసంపన్నులని వేనోళ్ల బొగడుటలేఁ బొగడుట నింద్యము.

-* అలరాజు *-

గిల్లి జగడమునకు రావలదు. చిన్న పెద్దలను తారతమ్యంబు గ్రహించుట పాడి యగును. ఓర్పునకు మితిగలదు. నేనెంత సహనము వహించుచున్నను నిట్లు నిరాదరణపూర్వకముగఁ బలుకుట నాగమ్మగారికిఁ దగదు.

-* నాయకురాలు *-

సహనముఁ జూపింపక మూగందఱుఁ జేయునది యేమో తెలియదు.

-§ అలరాజు §-

ఓహో! మా సహనము నాగమ్మగారి కపహాస్యమయినది కాఁబోలు. జలధిలో నిమిడియున్న బడబాగ్నివలె మా శాంతంబున బరాక్రమోద్రేకము సమ్మిళితమై యున్నదని నాయకురాలికి శీఘ్రంబున బరిస్ఫుటమగుఁ గాక.

మాచెర్ల రాజ్యం బవలీల గ్రహింప సమర్థులయ్యును నటుపోక ముందుగా మీ యనుజ్ఞఁ గోరునట్టి వారి సుగుణసంపద యెంత శ్లాఘాపాత్రమో మీరు గోచరింపక పోవుట విచారకరము. రాజుగారు గూడ నిట్టి వక్రపద్ధతికి ననుకూలించుచుండుట చూడ వింతగా నున్నది. ఎవరి నండ

చూచికొని గురిజాల యీ బింకంబులు చూపుచు
న్నదో గోచరింపదు. బ్రహ్మనాయని కుమారుం
డగు బాలచంద్రుండు మొదలగు వీరులు కఱకు
గుండియలతో యుద్ధభూమిం దుమికి హస్తోల్లసిత
కరవాలంబుల ఝుళిపించి మీ సేనల నన్నింటిని
నుగ్గునూచం బొనర్చు నప్పుడు గాని నా మాటలు
రుచింపవు. ఆ నాడు శ్రీకృష్ణుం డెంత సంధిని
గూర్చి నొక్కి వక్కాణించినను వినక చెడిపోయిన
దుర్యోధనుని దురహంకారఫలమును నాగమ్మగారు
జ్ఞప్తికిం దెచ్చుకొనవలసి యున్నది. (రాజుంజూచి)
నే నంటి నని కోపంబు రానీక చివరకు బాలచం
ద్రుని చెలికాండ్రలో నొక్కనితోనైనను యుద్ధ
భూమిం బోరుసట్టి వీరాగ్రేసరుని మీ పక్షంబున
జూపింపుండు. నాయకులు రాలందురా? అది వట్టి
కల్ల. ఆడు దానిని జంపుట పాడిగా దని వారు సం
దేహింపని యెడల మహావాయువు ముందు దూది
తుంపురుల వలె బాలచంద్రాదుల యెదుట నీమె
శౌర్యధైర్యపరాక్రమంబులు నిమేషంబున బంచ
బంగాళమై పోవును గాని నేటికోండుగలదా? ఆమె
మెదడు కృత్రిమోపాయంబులకుం బుట్టినిల్లు. మంచి
యాలోచన లామె కొంటవు. ఇట్టి నిరుపమానవ
క్రోపాయధురీణను మంత్రిణిగాం జేసి తమ బోటి
వారు న్యాయపథంబును విడనాడుట సమంజసమా
యని సందేహించుచున్నాను. ఎట్టి కుటిలోపా
యంబులు వహించి బ్రహ్మనాదుల యెడ నెప్పుడే
విధంబుగా నీబిడ ప్రవర్తించెనో లిఖితరూపకమైన
సాక్ష్యంబుం జూపంగలను. మొట్టమొదట మాచెర్ల
కుందు వా రుండునప్పుడే గురిజాల వర్తకు లని
రు వెట్టి రాజభవనంబున జేయించిన దోపిడిం
గూర్చియు మొన్న మొన్న భిల్లులం బంపి వారి
పశువుల దోపించు ప్రయత్నంబులం గూర్చియు
నీమెపైం దగినంత నేరము మోపంగల బలమైన
సాక్ష్యము లున్నవి. అవన్నియుం దమరు చిత్తగింప
వలెనని కోరుచున్నాను. ఇట్టి దుర్మార్గశీల యయిన
నాగమ్మ మాటల విని స్వచ్ఛకీర్తులగు మీరు నిం
దలపాలు గావలదని మనవిం జేయుచు నీ సాక్ష్య
పుం గాగితములం జదివి యామె దుర్మార్గంబుల
ధ్రువపఱుచుచున్నాను. (తీసి చదువం బోవును.)

—* నలగామరాజు *—

ఈ దిన మింతటితోం గొలువు చాలించు
చున్నాను. మఱల రేపటి దిన మాలోచింప
వచ్చును. (అందఱు లేచుదురు. తెరపడును)

—* అలరాజు *—

(ముందునకు వచ్చి) మామగా రెంత మూ
యావి! (ఆలోచించి) సరి కానిమ్ము. రేపు చూచు
కొందము.

(నిష్క్ర)

దృశ్యము 14

అలరాజు బస - గురిజాల.

శమము దమంబు నార్జవము శాంతియు బ్రాహ్మణజాతి కైన వి
చ్చము నిడంజాలు నుత్తముండు శత్రువిలాసవతీసుమంగళీ
త్వము లడచేతం గొన్న బలవంతుండు వీరుండు బ్రహ్మనాయండే
సమమతిం జెల్మింగోరి చెయింజాచ గ్రహింపరుగామదోద్ధతుల్

అంత మహామహుం డణంగి న్యాయపథపరివిచింత్య రాజ్యసం
క్రాంతిని గోర దానిని నిరాకరణంబొనరించు దుర్మతి
స్వాంతులు కాలు సేయి దగినప్పుడు గాని గ్రహింపరక్కటా
యెంతటి నష్టజాతకమొ యీ గురిజాల్పురరాజ్యలక్ష్మికిన్.

మఱియు,

రెండు పక్షంబులకు బాంధవుండ ననుచు
ద్రవ్వి తలకెత్తుదు నటంచుం దలంచినారు
చవిటి నేలను నాటు బీజములు వోలె
సర్వయత్నంబు లిందు నిష్ఫలములయ్యె.

నిన్నటి దినమే కవిగాయకనర్తకవందిమాగధాదిగౌరవసభ్యులతో బలసియున్న నింకుబోలువున దురాచరణశీలయైన నాయకురాలిపై నిందారోపకమైన లిఖితరూపక మయిన శ్రోతృహృదయవిదారకం బయిన పత్రసంపుటంబు వెలికిం దీయునప్పుడే యీ ధూర్తాంగనాముఖంబును — సంతకంటె వేయిరెట్లుగా — దానిని జేరం దీసి సర్పంబునకుం బాలోసి పెంచు నట్లు తగువిధంబుల నాదరించు మూర్ఖాత్ముండగు నలగామరాజేంద్రుని మొగంబును మటమట మాడి పోయినవి. అది నే జూచియు విషయము వినువక చదువం బోవుచుండ నలగామునం డది మఱునటి దినంబు చూచుకొనవచ్చు నని యాదేశించి సభ నంతటితో నాపి వైచెను. నిందారోపకమైన యీ గ్రంథం బంతయు సభాస్తారు లందఱునిని పోవుదుగని శంకించిన మామగారి హృదయంబు నేను నవలెనో తెలియకున్నది. ఉన్న నిజము కొంత యిదివఱకే యీతనికిం దెలిసి యుండినవా యని సందియము గలుగుచున్నది. లేకున్నయెడల రాజయిన వాఁడు సత్యపరిశీలనార్థము రాచకర్జంబు లెంత చక్కఁగా సిరండ తగులఁబెట్టుచున్నదో పోనీ చెవిని వేసికొని యనంతరము నా వాదమును ఖండింపరాదా? ఇంట నున్న విధవా పుత్రికచేఁ గామోద్రేకనిరోధకధర్మంబు లాచరింపింపక దుష్కాల స్థానశూన్యలై యామెకు వివాహంబు సేయనేరక పతిత్వ్యకుఁ బెనఁగులాడి దుష్ప్రవర్తనంబున లంకించుకొన్న యామె గర్భోత్పత్తిని దాఁచు శాస్త్రజ్ఞు లయిన తల్లిదండ్రుల వలె నలగామునం డీ మాయలాడి దుశ్చరితంబులోని సత్యము మునుము న్నెఱింగియే పరువు పోవునని దాఁచ నెంచెనేమో! అట్టి సందర్భంబుల యందు సత్యాన్వేషి యయిన వాఁ డెవ్వఁడైన సభ నాపునా? తమ పరిపాలనములోని లోపంబులఁ గాని రాజోద్యోగుల దుష్ప్రకారంబులఁ గాని కల్లబొల్లి మాటలతో నెట్లో శ్రమపడి మఱుఁగుపుచ్చుట నిరంకుశప్రభువులకు సహజగుణము.

మఱల నీ యుదయంబున నేను గొలువుం జేరకమునుపే నేను సభకు రాఁగూడదనియుఁ దర్రలో గురిజాల వీడి పోవలెననియు నట్టి రాజకీయప్రసంగంబులను నీ మండలంబున నెచ్చటను గావింపరా దనియు నొక నోరుమూఁతయాజ్ఞ నట్టి రాజముద్రాశిఖాంచితమై దూరాలోచనాభావ కపటోపాయంబులకు బిరుదుటందెలు వేసికొని శునకము వలె నయూత్యపీఠం బధిష్ఠించి యున్న నాగమ్మ యొక్క చేవ్రాలును గలిగిన యొక్క యాజ్ఞాపత్రంబు నాకంపినారు.

రాజ్యభాగమునకు ననేమిరా యనుచున్నారు సరిగదా యీ దుర్మార్గప్రవర్తిని దుండగంబులనైన బ్రజాసభలలో వెలిబుచ్చి పోవుట నాకు ముఖ్యకర్తవ్యము. కాని నోరు మూయింపఁగల రాజాజ్ఞ నె ట్లుల్లంఘింపఁగలను? (యోచించి) అయినను మన బంధువర్గము చెన్నగుడిపాములో నుండెఁ గదా. వారితోఁ గూడఁ గలిసి ప్రస్తావించి యనంతరము కర్తవ్య మాలోచించెదఁ గాక. నేఁడే తెలివితక్కువ నోరుమూఁత కాగితము వీరమేడపి లోని మల్లదేవ భూపతికి ముందుగాఁ బంపుచు నింతపఱకు జరగిన

కథ యంతయు విపులముగా నివేదించెదను. రేపటి దినంబు గూడ నీపట్టణంబుననే యుండి యెట్లుండునో పగఱల స్థితిగతులఁ జూచి యా తెల్లవాఱుజాముననే ప్రయాణమై పరిజనులతోఁ జెర్లగుడిపాడునకుం బోయెదను.

(నిష్క్రి)

దృశ్యము 15

వీరమేడపి — పెదమల్లదేవుని సభ

మల్లదేవుఁడు — బ్రహ్మనాయుఁడు, బాలచంద్రుఁడు కన్నమదాసు ప్రసంగించుచుందురు.

-§ మల్లదేవుఁడు §-

అమాత్యశేఖరా? గురిజాల నుండి యలరాజు వ్రాసిన లేఖను బురస్కరించుకొని యుద్ధసన్నాహంబులలో మన మింక నప్రమత్తులమై యుండవలసినదే కదా.

—* బ్రహ్మనాయఁడు * —

నిస్సందేహముగా. వారు మన మాట వినుట కలలోని మాట. ఎవరొప్పికొనినను నాయకురాలు పడనిచ్చునా? ఔరా! ఆమె యసారధాణదుష్ప్రతిభాప్రవాహసరణి కట్టు లేకున్నది గదా!

సీ॥ అనుభవింపఁగఁ జేసె నఖిలరాష్ట్రప్రజా
పీడాకరం బాఁడుపెత్తనంబు
ప్రకటయశస్స్ఫూర్తి పల్నాటిరాజ్యంబు
కుదురు దప్పించి గగ్గోలుపఱచె
మలిదేవరాజ్యసంపత్సౌఖ్యలక్ష్మిని
గోడిపం దపుమాతఁ గూలఁ ద్రోఁచె
నటవీనివాససంకటములో నానాఁడు
భిల్లులం బంపి దోఁపించెఁ బనుల

బహుళవైష్ణవతతి కుటుంబములఁ ద్రోలి
అగ్రజాతుల మాన్యంబు లపహరించె
దురవగాహమాయాయుత ధూర్తవనిత
అహహా! నాయకురాలి సాహసచరిత్ర!

—* కన్నమదాసు *—

ఇప్పుడు యుద్ధమే నిశ్చయ మందురా?

—* బ్రహ్మనాయఁడు *—

సందేహింపనేల?

వ: హితమా చెర్లమేదినీమండలమున
సూది మోపెడు నేలయుఁ లేదటంచు
నిండుసభలోన గురిజాలగండె మగువ
స్పష్టముగఁ బల్కె రమ్మనె సమరమునకు

నాయకురాలి దోషంబు లెక్కడ వెలిబుచ్చునో యని తహతహపడి నాగాంబాస్నేహ సంవర్ధిత దురభిప్రాయంబులలోఁ బడిపోయిన నలగామరాజేంద్రుండు మన్ను మిన్ను గానక నోరుమూఁతయాజ్ఞఁ బ్రయోగించి యలరాజును గురిజాలనుండి తఱిమివేయుట చూడ నసహ్యముగ నుండుటయే కాక చిన్నప్పుడు వారిని దిద్దిన నాఁడ నగుటచేత నాకెంతయు నవమానకరముగాఁ గూడ నున్నది.

—♦ బాలచంద్రుఁడు ♦—

మా కుట్రకారువీరు లందఱకు నలగాజుపైఁ బ్రయోగింపఁబడిన నోరుమూఁతయాజ్ఞ పరమానందంబు చేకూర్చినది.

—* మల్లదేవుఁడు *—

మాకందఱకు హృదయంబును జలింపఁజేయుచుండ మీకు మాత్ర మానందకారణం బెట్లు?

—* బాలచంద్రుఁడు *—

నోరుమూఁతకాగితముఁ బ్రయోగించి యలరాజును దఱిమి వేసి కఱకుదనముఁ జూపుటచేఁ గద పెద్దలకు వెట్టపుట్టి యుద్ధంబునకుఁ గొంచెము సుముఖులుగా నున్నట్లగపడుచున్నారు. విరోధిపక్షంబున నెంత కాఠిన్యము నిర్బంధములు నుండిన స్వరాజ్యవాదుల కంత శ్రేయస్కరము.

అప్పుడుగాని మన పరస్పరభేదాభిప్రాయములు పో
యి కార్యోన్ముఖులమగుట కైకమత్య మేర్పడదు.

— * సేవకుఁడు * —

(ప్రవేశించి) అయ్యా! దండాలు. చెన్న
గుడిపాటి నుంచి పోతరాజుగారు వచ్చారు.

— * బ్రహ్మనాయఁడు * —

త్వరగాఁ బ్రవేశపెట్టుము.

— * సేవకుఁడు * —

చిత్తము.

— * మల్లదేవుఁడు * —

అలరాజు కూడ వచ్చుచున్నాఁడేమో!

— * సేవకుఁడు * —

(పోతరాజును లోనికిఁ దెచ్చి నిష్క్రమించును.)

— ◆ పోతరాజు ◆ —

పెద్దలందఱకు నమస్కారములు.

— ◆ బ్రహ్మనాయఁడు ◆ —

రామార్పణము. చెన్నగుడిపాటిలోని మన
బంధుగులందఱు క్షేమముగా నున్నారా?

— ◆ పోతరాజు ◆ —

(మొగము వాంచి యూరకుండును.)

— * మల్లదేవుఁడు * —

రాజునాయకా! పలుక రేమి?

— ◆ పోతరాజు ◆ —

మల్లదేవభూపతీ! హృదయమును బాధించు
చున్న యీ దుర్వార్తఁ దమ కెట్లు వినిపింతునా
యని సంకోచించుచున్నాను.

— ◆ మల్లదేవుఁడు ◆ —

అదేమి! దుర్వార్త యేమి! అలరాజు తమ
తోఁ గూడ వచ్చినాఁడా?

— * పోతరాజు * —

అయ్యా! ఏమని చెప్పుదును! మహాప్రభో
[illegible] నాయకురాలు రాయ
బారిగ [illegible] జంపింప

మొన్న మధ్యాహ్న కాలమున మననుండి ——

— ◆ మల్లదేవుఁడు ◆ —

ఆఁ. ఆఁ. అలరాజునకా!

— ‡ అందఱు ‡ —

హరి! హరి! హరి!

— ◆ బ్రహ్మనాయఁడు ◆ —

(చెవులు మూసికొని) ఔరా! పాతకమూర్తి!

— * మల్లదేవుఁడు * —

నాయకురాలెంత ఘోరకృత్యము గావిం
చినది. ఒడలు జల్లుమనుచున్నది. ఈ వార్త
గ్రామాంతరమునకుఁ బోయిన కొమ్మరాజుగారు
రాఁగానే చెవి నెట్లు వేయఁగలము?

— * బ్రహ్మనాయఁడు * —

కట్టా! ఆ కాలమృత్యువు నోటఁ బడిన యల
రాజు వార్త నా హృదయంబును సంచలింపఁజే
యుచున్నది. కల్యాణపట్టణాధీశ్వరత్వంబు బొంది
కొంత కాలము రాజ్యసుఖంబు లనుభవించి కాల
క్రమాంతరములచే సర్వరాజ్యంబును గోల్పోయి బిడ్డ
కు నీడలేక చెడి చెల్లెలి యింటికి [illegible] వచ్చి
హీనతయందు దుస్సుగుచున్న కొమ్మరాజుగారి
కీ వార్త గోరుచుట్టుపై రోఁకటిపోటు గదా! మన
మెంత సాంత్వనవచనంబులఁ జెప్పినను దండ్రి
దుఃఖము చల్లారునా? అటు నలగామరాజు పిల్ల
నిచ్చిన మామ. ఇటు మల్లదేవుఁడు మేనత్త పెని
మిటి. రెండు పక్షంబులకును సమానబాంధవ్యం
బుండుటచే రాయబారంబునకు మిక్కిలి యర్హుఁడని
పంపినందులకు దైవ మెంత తలఁచెను! మనుష్యుఁ
డూరక ప్రయత్నింపఁగలవాఁడే.

కార్యయత్నంపుఁజిమ్మచీఁకటిప్రవాహ
మడ్డపడి యీఁద నొక్కొకఁ డడ్డుగుడుచు
సర్వకార్యనియంత యీశ్వరుని ముందు
మహితగుణుఁ డయ్యు నను మనుష్యమాత్రుఁ డెంత.

—* మల్లదేవుఁడు *—

ఎంత ధూర్తాంగన లైనను నాయకురా లింత సాహసింప నోడిగట్టునని స్వప్నంబున నైన ను దలంపమైతిమి గదా. రెండు పక్షంబులకును నతనికిఁ గల చుట్టరికమే కాకుండఁ బుష్పము నాశ్రయించిన సువాసన వలె నాతని నాశ్రయించిన బంధుమర్యాద, యత్నీకృతకార్యదీక్ష, మతసహనము, వచో మార్దవము, సత్యధర్మోద్ధరణకౌశలము మొదలగు సద్గుణంబులును గలిగియుండుట చే నలరాజు మన దృష్టి నాకర్షించినాఁడు. అందుచేఁ గార్యానుకూల్యంబునకై పంప సాహసించితిమి. చివర కెంత పని జరగినది! ఆ నాఁడు మేడపినుండి బయలుదేఱుచు సమస్తబాంధవపరిచారకబృందంబులు వినుచుండఁ బాండవపక్షంబుఁ బురస్కరించుకొని చనిన శ్రీకృష్ణుని రాయబారంబు గూడ నిందాగర్భవచనంబుల నీసడించుచు — మనుష్యప్రయత్నంబున గొఱంత యావంతయు లేకుండఁ గార్యనిర్వాహణయజ్ఞదీక్షాకంకణబంధంబున బ్రయత్నింతు నని ధర్మదేవతారాధకుండయిన యలరాజు వాగ్దానం బొనర్చినప్పుడు పలికిన ప్రజాసేవావాక్యంబులు తలఁపునకు వచ్చి నా యెడద లిప్పు డుత్సాహసమ్మిళిత మయిన విచారంబునఁ గంపించుచున్నది. ఆ నిష్కామసేవయే యాతని పవిత్రశీలమునకుఁ దార్కాణము.

—* బ్రహ్మనాయుఁడు *—

రాజచంద్రా! అలరాజు వంటి ధర్మపక్షాభిమాని వీరపురుషుండు మఱొకఁడు లేఁడు.

శౌర్యస్థైర్యము పల్లవింపఁగఁ బ్రజా
సేవైకనిష్ఠామతిన్
ప్రీతిం బోరెడు కర్మయోగి మన యా
వీరుం డసంకీర్ణయో
గాశంద్రత్వము వట్టిపోవదు; ధ్వజ
మ్మృజిన్న మోక్షంబిదున్
గీతాశాస్త్రము తోఁచ దెప్పు డిదె శ్రీ
కృష్ణుం డమోఘంబుగన్.

మతసంఘర్షణ దుర్దినంబు లివి; ధ
ర్మంబే విచారించి యా
క్షత ధైర్యంబున మాకు వైష్ణవులకున్
శైవుండు సాయంబు సే
యఁ దలంతౌర! ప్రశంసనీయము సుసా
ధ్యుం డైన ధీశాలికిన్
మతవిద్వేషము లుండునే? మతము
ధర్మస్థాయి మమ్మాటికిన్.

ఆకసంబున నుత్తరదిక్కున స్థిరముగా నుండి చలింపక విభాసించు ధ్రువనక్షత్రము మాడ్కిఁ బ్రాజ్ఞుని మనస్సు ధర్మనిరూపణంబున నిశ్చలమై ప్రకాశించు నని యలరాజుచరిత్రము సాక్షీపట్టుచు చున్నది.

—♦ కన్నమదాసు ♦—

తండ్రీ! ఈ ధర్మప్రసంగము లింతటితో జాలించిన మే లని మనవిఁ జేయుచున్నాను. అలరాజు మరణము వినిన మా యన్నదమ్ము లిద్దరి హృదయంబు లనెడి యగ్నిపర్వతములు స్తిమితముఖంబులుగాఁ గన్పడినను నంతర్భాగంబున బ్రజ్వలించుచుఁ దపించుచున్నవి. అజీర్ణరోగి కన్నంబు పై విరక్తివలె నీ యకాలధర్మప్రసంగంబులు కోపదందహ్యమాను లగు మాకు రుచించుటలేదు.

-* బాలచంద్రుఁడు *-

అన్నయ్యా! ధర్మప్రసంగమునకును శాంతంబునకును నిది మంచి సమయము. నీ వేల వా

రించెదవు? (కొంచెమాగి) ఆహా! ఇంతటి ఘోర హత్యఁ గూర్చి వినియు శత్రుపక్షంబు గూర్చి యొక్కమాటయనక సహించియుండుట పల్నాటి వీర్యంబున కెంత కళంక మావహిల్లినది! అశేష బాహాబలసంపన్నుఁ డయిన యలరాజు చావు నా హృదయంబున గొఱ్ఱు గ్రుచ్చి పరిపీడనం బొనర్చుచున్నది. గండరగండఁడును మన పక్షంబున గల వీరు లందఱిలోఁ దలమిన్నయై తన యుదంచద్విక్రమప్రాభవంబునకు వన్నె నెట్టు క్షాంతిశాంతసత్యాదిసకలసద్గుణవాటీలతికల కాలవాలంబు నయిన యలరాజును నిష్కారణంబుగా నిండుకొలువులో మొట్టమొదట నీసడించుటయే కాక తుదకు విషాహారంబు పెట్టించుటకును బాల్పడిన యా జగజంత యగు నాయకురా లింకను జీవించియుండు నట్లు చూచుట యవంధ్యంబైన మీ పౌరుషంబునకు గొడ్డువోతుదనము కల్పించుట తప్ప వేఱుగాదు. మలిదేవపక్షంబు నెడల నాబిడ గావించు దుష్ట ప్రాయపరంపరకుఁ దలమానికం బనం దగిన యలరాజవిషాహారప్రయత్నంబు గూడ నెఱవేర్చి యిప్పటికిని వీడని మన నిస్సహాయత్వంబున మిడిసిపడుచు నింకను జీవించుచు — ఆ నాగి — మన వీరుల మగతనంబును బ్రశ్నించుచున్నది. ఇంక నేను సహింపలేను.

(కోపముతో)

అలరాజంతటి మేటివీరుని విషా
 హారంబునం గొన్న ని
ష్ఠురమాయావిను లైన ఘాతుకుల గొం
 తుల్గోసి రూపార్పకే
ట్టుల జీవింపఁగ వచ్చుఁ గోపదహనా
 టోపంబు శాంతించునే
గళదున్మత్తవిరోధికంఠగలర
 క్తస్రావమే లేనిచోఁ

భవనిధిఁ జొచ్చికొంచుఁ బ్రమ
 థంబున నుండెడి లోభిమాద్రి బం
ధన మగు శాంతముం గని మ
 నంబున బొంగుచు నుండుఁ డింక నే
జని గురిజాలరాజ్యబల
 శాలిసమాజము ఖడ్గధారలన్
వినత మొనర్చి రాజ్యమును
 వేఱు బునాదులతోఁ బెకల్చెదన్.

— కన్నమదాసు —

(కోపముతో లేచి) తమ్ముఁడా ఇదిగో నీతోఁ గూడ నేనును వచ్చుచున్నాను. యుద్ధ మాడి మాచెర్లరాజ్య మూడఁబెఱుకుదుమో లేదో దేవుఁ డెఱుఁగును. ఎలప్రాయమున నుండి నిష్కామధర్మసేవాశుద్ధిచేఁ గీర్తికాంతాస్వయంగ్రహాశ్లేష భాగ్యంబు ననుభవింపఁ బోవు రాయబారియగు నలరాజును జంపించిన మాయానిపుణ యైన నాయకురాలిని — బట్టి త్రాళ్లతో బంధించి యవమానపఱచిన గాని నా మన స్సూరకొనదు. బాలచంద్రా! లెమ్ము. పోవుదము.

— మల్లదేవుడు —

దాసూ! తొందరపడకుఁడు. విషాహారం బెట్లు పెట్టించి యలరాజును బొలివుచ్చెనో విషయం బామూలాగ్రముగఁ బోతరాజు గారిని జెప్పనిండు. (పోతరాజుతో) రాజుగారూ! విషాహారదాన సంవిధానంబు సవిస్తరంబుగా విన దలఁచితిమి.

— పోతరాజు —

చిత్తము. నోరుమూఁతకాగితవు నాఁటి వేకువజామున బయలుదేఱి యలరాజు దండల మొక్కి సేవకులతోఁ గూడ వచ్చుచుండెను చెర్లగుడిపాటి మార్గంబున నున్న చిట్టడవిలో మొగమున విభూతి రేఖలును జెవుల యందును నందిటను గంఠంబునను దలచుట్టును రుద్రాక్షలదండలును గలిగిన శైవు

లిద్దరు చెట్టునీడ వంటఁ జేసికొని భోజనముఁ జేయ సిద్ధముగా నుండినట్లు గన్పడిరి. అలరాజును జూచి మర్యాదఁ జేసి, "దిగి శివపూజఁ జేసికొని సిద్ధాన్నం బారగించిపో" మ్మని ప్రార్థించిరి అలరా జొప్పుకొనెను. సేవకులు చేరువకొలనిలో స్నానంబు సేయఁ బోయిరి. అలరాజు భోజనముఁ జేసిన వెంటనే వాంతులు ప్రారంభమై సేవకులు దిరిగి వచ్చునంతలో బ్రాణంబులు విడిచెను. చెట్టుదరికి వచ్చుచున్న సేవకులు దూరముగా నడవిలో గుఱ్ఱముపైఁ బోవుచున్న నరసింగరాజును జూచి సందేహించిరఁట తఱువాత వచ్చి యలరాజుం జూచి మిక్కిలిగా నేడ్చి చెర్లగుడిపాటిలోని బంధుగు లందఱకు వచ్చి తెలిపిరి. అంతట మే మందఱము పోయి శవంబు నింటికిం దెచ్చి తుదిపను లన్నియుఁ గావించితిమి పైన-.

—* బ్రహ్మనాయుఁడు *—

రాజుగారూ! మీరు చెప్పినసంగతులఁ బట్టి చూడనా సమయంబున దూరంబుగాఁ జనుచున్న నరసింగరాజుపై నైనను నేరము మోపఁదగు నేమో కాని కొంచెమైనను సాక్ష్యము లేనిదే యీపాతకము నాయకురాలిపై నెట్లు వేయఁగలము?

-§ బాలచంద్రుఁడు §-

(కన్నమదాసుతో) చూడు.

-‡ పోతరాజు ‡-

చిత్తమది యే చెప్పుచున్నాను. ఆ బాటగారు లిద్దరు నలరాజు సేవకులు వచ్చుచున్నా రని గాఁబోలడావడిలో విడిచిపోయిన యొక చిన్న మూటలో నొక యుత్తరము గన్పడినది. చేవ్రాలు మాత్రము లేదు గాని యది చూడఁగా నాయకురాలి వ్రాఁతగా స్పష్టముగాఁ దెలియుచున్నది. శైవమతోద్ధారకు లగు నే జంగాలగురువునకో యది వ్రాయఁబడినది. ఇదిగో, యుత్తరముఁ గూడఁ దెచ్చితిని జూడుఁడు.

-§ బ్రహ్మనాయుఁడు §-

కన్నమా! ఆ లేఖఁ జదువుము.

-* కన్నమదాసు *-

(చదువును.)

శైవమతోద్ధారకులగు...... ..గారికి:-

శైవరహస్యాలోచనసంఘనిబంధనలలోని యేనిమిదవ నిబంధన ననుసరించి — వైష్ణవ మతస్థులపై నాదరణము చూపుచు లెస్సగా వారి యభివృద్ధికై తోడ్పడు వారియెడఁ దమరు కఠినముగాఁ బ్రవర్తించి మతపీఠంబుల మెప్పును జూఱగొనుట లోకవిదితము. ఇప్పుడు మఱల నొక్కపరి యట్లే మాహేశ్వరసేవఁ గావించు నదృష్టము గల్గనున్నది. ఇందులకుఁ దా మభ్యంతరము సెప్ప రని నా విశ్వాసము. విషయం బంతయు సవిస్తరంబుగా నివేదించుటయే కాక తుద్ధవఱకును రాజుగారు మీ కండగా నుందురు. వారము దినముల లోపలఁ దమరు గురిజాలకు వచ్చి మత పరిచారనిధి నుండి ప్రతిఫలముఁ బొందవచ్చును.

గురిజాల, ) ఇట్లు,<br>
పుష్య బ ౧౮ }

-♦ బ్రహ్మనాయుఁడు ♦-

ఔరా! శైవమతవ్యాప్తికొఱకు నెట్టి ధర్మహాని కైనను నొప్పుకొనుచున్నారే! పాపము పండినది. పోతరాజుగారూ! నిశ్చయముగా వారే యిందు దోషు లని నిర్ధారింపవచ్చును. కా— ని — లేఖలోఁ జేవ్రాలున్నయెడ నింకను స్పష్టతర మయ్యెడిది.

-* పోతరాజు *-

విపరీతసంశయంబులు ధర్మదేవతను గ్రుడ్డి

దానినిగాఁ జేయుటకుఁ బాల్పడును. నే నిట్లంటి నని తమ రాగ్రహింపరాదు. మీ రెట్లు దోఁచి నను నాయకురాలి ప్రోత్సాహంబున నరసింగరాజే విషాహారంబు వెట్టించినాఁడు. నిస్సంశయము.

-§ బాలచంద్రుఁడు §-

అవును. నిశ్చయమే.

సుకవిసుదరికవిత్వకన్య కరుస్ర
  క్రూరాత్మచారిత్రమై
హీకదుస్సంగము మాయతోఁ గలిసి స్నే
  హించుచు విశేషంబు రో
గకఠోరత్వము దిండిపోతుదన మే
  కంబై వినోదించు నా
యకురాలుక్ — నరసింగు — స్నేహితులు దు
  ర్వ్యాపారపారంగతుల్॥

స్వమిపంబున నుండు కల్లు దుకాణంబు ప్రభావంబుచే మద్యపానదుర్వ్యసనంబునం బడి చెడిపోవు సామాన్యజనంబువలెనంతతము దుష్టకార్యాలోచనపరంపరలం దేలుచుండు నాయకురాలితో స్నేహించి నరసింగు వీధిపోకిరిగాఁ బ్రవర్తించుచున్నాఁడు. ఓరీ! నరసింగూ! ఎంత మాయావివుండవైనావు! నాయకురా లెంత చెప్పిన నంత చేయు నీ దుండగంబు లెంత మొండిచెడను.

అల నలగామరాజునకు
  నల్లుఁడు నీకును నల్లుఁడే గదా
తెలిసియు రాయబారి నుప
  దేష్టను నయ్యలరాజుఁ జంపఁ జే
తు లెటులా వచ్చెనోరి! పశు
  తుల్యుఁడ! త్వాదృశులవాశి వార్థమై
కలిగిన లోకచుక్క పతి
  గర్వసమేతుఁడ వీవు గుంటరీ॥

అలరాజాక్ సుకుమారసుందరు నవ
  వ్యవ[illegible]మ్ఫురద్వ్యః[illegible]మో
జ్వలు నల్లుక్ బొరిగొన్న నీ మదము నీ
  శత్రు[illegible]దు శ్చేష్టితం
బులు సైరింపఁడు బాలచంద్రుఁడు ప్రజా
  మోదంబుగాఁ బోరిలోఁ
దల ఛేదింపనె వచ్చె నేను రిపుగ
  ర్తస్వీన్నఖడ్గంబునక్.

నీ దుర్మార్గము లింక నెంత నజకో
  నీచాత్మ! సైరింతు? మా
హా! దారిద్ర్యము లోన నుంటి మని యూ?
  — ఆఁకొన్నసింహంబు ల
ట్లీ దుర్వారబలాఢ్యులం గొనుము; నీ
  వేచూతువా యుద్ధశి
క్షాదక్షోగ్రమదీయ ఖడ్గవిచల
  జ్జ్వాలావిదాహంబులక్.

ఓరీ! పాపీ! నరసింగూ! నాయకురాలితోడ నీవు గావించు స్నేహంబు ని న్నెంత పని సేయించినది! నలగామరాజు నీ కనుంగు సోదరుఁడే! అట్టి యన్నగారి కూఁతు మెడలోని మంగళసూత్రంబును ద్రెంపఁ బాల్పడిన నీ హృదయపారుష్యం బెంతి నిందార్హము! నీవు తమ్ముఁడవు గదా యని విశ్వసించి నలగాముఁ డెట్లు తన రాచటికపుఁ బనాదులఁ జెల్లగించుకొనుచున్నాఁడో లోకమునకు స్పష్టముగా వెల్లడియగుచున్నది. ఆ గాఢ్య వృక్షంబును బీల్చి పిప్పిఁజేయుచున్న వేఱుపురుగు లగు నిన్నును నాయకురాలిని దొలఁగించినం గాని గురిజాలప్రజాక్షేమంబు కుదుటవడదు.

—♦ బ్రహ్మనాయఁడు ♦—

ఏత్వా! నరసింగరాజూ!

ఈ యుద్ధము మనకొఱకుఁ జేయుచున్నా మనుటకంటె లోకమునకు ధర్మరక్షణంబుఁ గలవుట కని చెప్పిన మిక్కిలి ప్రశంసార్హము.

అసహాయుల్ ధనహీను లన్నమునకై
యాల్లాపునా రెంవటీ
వసుధన్! వారల యిండ్లువాకిళు లిటే
వంతానబాధింత్రు భా
గ్యసమేతుల్ బలవంతు — లీ తెగులు పో
కార్పన్ వలెం గాని చూ
చి సహింపం దగ — దోర్పు పాపము బ్రజా
క్షేమానుసంధాయికిన్.

ధర్మబాహ్యం బయిన దుష్ప్రవర్తనంబున నిరాఘాటంబుగ సంచరించు నాయకురాలిని వెనుక వేసికొని కుటిలత్వంబున రాజ్యపాలనం బొనరించు నలగామభూపతిపైఁ జిన్ననాటి మనుకారం బంతయుఁ దోసిపుచ్చి ధర్మోద్ధరణంబునకై ప్రయత్నింప వలెఁ గాక. ఛీ! నలగామా! ఎంత కానరాని పలవనైనావు! చిన్నతనంబున న[illegible]సహవాసంబున నా యొద్ద నేర్చికొన్న నైతికవిద్య యను లతికను నాగాంబా[illegible]విషజలంబు పోసి మొదలంట నశింపఁ జేసినావు. నీతి చెడిన వెనుక నిం కేమున్నది.

పరిమళము లేని సొగసుపువ్వంబు పోల్కిఁ
బతిని గోల్పోయి మను కులసతి విధాన
దేశమాత్మంబు లేని జాతీయత వలె
నీతి లేనట్టి యేలుబడి నిష్ఫలంబు!

నిరవధికపరిపూర్ణత్వము వహించినను ధర్మం బున్న నాధారపడని రాజ్యలక్ష్మి పరికాశించి చిరకాలము నిలువఁజాలదు. రాజ్యంబును బెద్దలు స్త్రీ గా భావించి ధర్మమును సర్వాంగలక్షణంబులను నూహించియున్నారు.

పృథులబాహాబలోద్రిక్తమత్సర మైన
సేనాసమూహంబె చేయికాలు
విద్యాప్రతిష్ఠాపన విస్తృతిదీక్షయే
సమధికశ్వాసకోశముల బలము
చిన్నిరాటము కొంతల్ చేతిపరిశ్రమల్
చెదరనీయని పట్టు మెదడుపట్టు
కవితాదిసత్కళాక్రమవిజ్ఞానంబె
సర్వాంగరక్తపరిసారణంబు
అక్షయం బైన ప్రజల సౌఖ్యానుభవమె
సాంద్రతేజ మైన ముఖవికస్వరత; యట్టి
లలితమోహన మగు రాజ్యలక్ష్మి కరయ
ధర్మమే ప్రాణమనుచుఁ బెద్దలు వచింత్రు.

ధర్మమే ప్రాణముగాఁ గలిగి మాచెర్ల రాజ్యలక్ష్మి మరలఁ దలయెత్తి తిరుగవలసిన యదృష్టము త్వరలో భగవంతుఁడు కల్పించుఁగాక. నాగమ్మ గారి రాజ్యతంత్రజ్ఞానము దోసిలొగ్గి "దాసోహ" మ్మని గులాములైనను నెప్పుడును నవసరము లేకుండ నీ వీరులకు మాచెర్లచెన్నకేశవుఁడు సహన బాహాబలంబును నంతకు మించిన ధైర్యసాహసములుఁ బ్రసాదించినాఁడు. ఆ నాఁడు కోడిపందెపు నెపముచే విధి మా యందుఁ దప్పుఁదలంచెను గాని లేకున్న ధర్మబద్ధమైన యీ రాజ్యము మా చేతి నుండి జాఱిపోవలసిన దా? గతించినదానికి వగచి లాభము లేదు. వీరులారా! చేతులార స్వరాజ్యమును గోల్పోయి నికృష్టమైన పారతంత్ర్యమునకు లోఁబడి యుండలేము. ఛీ! పారతంత్ర్యం బెంత నీచతమము!

స్వకులధర్మంబులు చప్పఁజల్లాఱును
మన మహాదర్శముల్ మంటఁ గలియు
జాతివ్యక్తిత్వంబు, నీతి, నాశము నొందుఁ
బరసంప్రదాయముల్ పట్టువడును
దాస్యభావము లోన దాండవం బాడును
మానపౌరుషదీప్తి మట్టువడును

కమనీయసంగీతకవితాకళాదుల
ధర్మజిజ్ఞాస వైధవ్యమొందు
అన్యభూపుల మనకు మర్యాదలేదు
మాడుగుడ్డయుం బ్రజలకుం గొఱంతపడును
బద్ధనైచ్యంబు పరమనిర్భాగ్య మైన
దారుణనికృష్టపారతంత్ర్యంబు దగదు.

—* బాలచంద్రుఁడు *—

వినుండు. వినుఁడు. తండ్రీ! మఱొక్క మాట సెలవిండు.

—* బ్రహ్మనాయఁడు *—

(మఱలఁ జదువును)

అమితవిక్రమధురీణు లగు వీరులు పారతంత్ర్యంబున కిచ్ఛగింపఁ జాలరు.

—* బాలచంద్రుఁడు *—

తండ్రీ! అదిగో! ఆ చెట్టుపై నున్న పక్షి యెట్లు మనల స్వాతంత్ర్యప్రియులనుగాఁ జేయుచున్నదో!

"కులమా — పక్షికులంబె, మా
కపలు చీకుం జింతయుల్ లేదు, ని
చ్చలు స్వాతంత్ర్యవిలాసజీవితములన్
సాగించుచున్నాము వ
తుల మైనన్ — నరజాతివారు గద సి
గ్గుం బొందరే" యంచుఁ గో
యిల గానం బొనరించు చున్న దదిగో!
యెల్లెత్తి వీక్షింపరే.

—§ బ్రహ్మనాయఁడు §—

అధఃపతనంబుం దున్న జాతికిఁ గాలపరిస్థితుల ననుసరించి సత్కవీశ్వరు లెట్లు ప్రబోధం బొనరించునో యట్లే మనకును సీ కోయిల తన కలగానముచే స్వాతంత్ర్యమాధుర్యంబును గూర్చి నొక్కి వక్కాణించుచున్నది. ఆహా! స్వరాజ్యం బెంత సౌఖ్యదాయకము!

కృపణత్వంబును బూర్తిగాఁ దోలఁచు ని
ర్జీవత్వ మూటాడ్చు ని
ష్కపటం బైన మతప్రచారమున కా
శల్ పెట్టుఁ గాపాడు దే
శపు వ్యక్తిత్వము దేశరక్షణకళా
చాతుర్యవిజ్ఞానమో
హుశథంబుల్ సమకూర్చి పెట్టును
స్వరాజ్యం బాత్మసంతృప్తిగన్

అట్టి స్వరాజ్యంబు సంపాదించు పట్ల నే మాత్రం బలసభావము లేక నిరంతరయుద్ధప్ర రంబు నేసి సేనానివహంబులకై ప్రజాసంఘంబు బుఱికొల్పుటయే కాక యీ పలు కనేకయుద్ధం లందు నాచే సహాయంబు నొందిన వారలతో గలిసి మాట్లాడి వారి యంగీకారంబు వడసి వచ్చె గాక. మన గృహదైవం బగు చెన్నకేశవు న్యాయాన్యాయవిమర్శన మొనర్చి ధర్మపక్షంబున జయం బొసంగు నని భక్తుల మగు మన మె రము విశ్వసింపవలసి యున్నది.

—* మల్లదేవుఁడు *—

మనము పోయి స్త్రీజనంబును గొ యోదార్పవలసి యున్నది.

—* బ్రహ్మనాయఁడు *—

మంచిది, పోవుదము.

(తెరపడును)



## దృశ్యము 16

నాయకురాలి గృహము.

నాయకురాలు — నరసింగరాజు మాట్లాడుచుందురు.

—† నరసింగరాజు †—

మాచెర్లరాజ్యములో సగ ది మోవు నే యయినను మన మిప్పటికుండుటచేత రాజుచు

బాహ్యాగార ఖండంబునందలి కోపాగ్ని చల్లగాఁ జ
విషాన్నదానసంవిధానం బనెడి సమిత్సమూహంబు
నొక్కమాఱుగా వైచి యుద్రేకింపఁ జేసినారము.

— * నాయకురాలు * —

మాలమాదిగలతోఁ గూడికొని తిరుగుచు వారి యుద్ధరణమే ప్రపంచోద్ధరణముగా నెంచు పాపుల విషయమై మన మెంత యక్రమముగాఁ బ్రవర్తించినను దోసము లేదు.

— ♦ నరసింగరాజు ♦ —

పల్లకీ లోనిసాక్ష్యపుఁగాగితముల కట్ట చేఁ జిక్కినది. కాని యా వైష్ణవులు విడిచి వచ్చిన మాట లోని యుత్తరము మాత్ర — మెంత చేవ్రాలు లేకపోయినను — చాలమట్టుకు మన గుట్టు బయలువేయు నేమో.

— ‡ నాయకురాలు ‡ —

ఎందుకు! చారులు వచ్చి చెప్పిరిగదా నిన్నటినము బ్రహ్మనాయుఁడు గారు గూడఁ బూర్ణముగ మనమే దోషుల మని విశ్వసించిరఁట. అయినను నరసింగరాజుగారూ! మన మేమాత్రము భయంపడ నవసరము లేదు. నలగామరాజుగారు బయటికిఁ గన్పడక పోయినను మతాభివృద్ధి విషయమై మన మెట్టిప్రయత్నములఁ గావించినను గాదనజాలరు. అలరాజు నెవరో వైష్ణవమతస్థులే హత్య గావించినా రని రాజుగారి చెవి వేసితిమి కావున, నతఁ డెట్లు నిజముగా హత్య గావింపఁబడెనో మనమువారి కెంతమాత్రముఁ దెలియనీయ రాదు.

— ‡ నరసింగరాజు † —

అ దెట్లు చేయఁగలము?

— † నాయకురాలు † —

పూర్వకథ లన్నియు నెట్లు నడపితిమో యిది కూడ నట్లే చేయవచ్చును. మొత్తము మీఁదఁ గొన్నాళ్ళకయినను దెలియక పోదు లెండు. కాని కాలము గడచుట వలనను మతోన్మాద ముండుట వలనను, దెలిసినను, వారునోరెత్తఁజాలరు. అంతగా వారు రేఁగునట్లు తోఁచిన యెడలఁ దక్షణమే యీ మంత్రిత్వమును విసర్జించి పోయెద నని బెదరింపఁ గలను. తగిన శైవమతోద్ధరణకర్తయును లేక, రాజ్యపాలననిర్వహణసమర్థుఁడైన బ్రహ్మనాయఁడును దగ్గఱ లేక రాజుగారు కుడితిలోఁ బడ్డ బల్లి వలెఁ గలగుండువడరా! మనకా భయము లవసరము లేదు. మొదటినుండియు మన ప్రయత్నము లట్టివే. వారి యుదాసీ భావము నట్టిదియే.

— ‡ నరసింగరాజు † —

అవును అంత స్పష్టమైనను జూచి చూడన ట్లు పోనియెడల వైష్ణవాభివృద్ధి యెట్లు సాగును!

— * నాయకురాలు * —

బ్రహ్మనాయుఁ డిఁకనింత వ్యవధి లేకుండనే యుద్ధసందేశ మంపినాఁడే.

— § నరసింగరాజు § —

అది యెట్లు చూచినను మాటపలుకుబడి గల మనకే కాని యతని కంత లాభకారి గాదు లెండు.

— ‡ నాయకురాలు ‡ —

(ఎగతాళిగా) అట్లనెద రేల? రేపు కారంపూడి యుద్ధభూమి కెన్ని మాలపోతు మూఁకలఁ దెచ్చునో చూతుఁడు. ఆయన పంచమోద్ధరణోపన్యాసము లూరక పోవునా?

— * నరసింగరాజు * —

మాలపోతులతోఁ గూడఁ గొందఱు యోధులున్నారు గాని లేకపోలేదు.

— ‡ నాయకురాలు ‡ —

ఉన్న యుద్ధవీరులలో బ్రహ్మనాయఁడు, బాలచంద్రుఁడు, కన్నమదాసే యే మయిన పేరు

గలవారు. మిగిలిన వారి మాట లేల లెండు. అల
రాజు మరణంబు వినిన. యనంతరము కోపశా
ప్రముఖుండై మండిపడి హంతకుం డైన నరసింగ
రాజు తల ఛేదింతు నని బాలుండు ప్రతిన వట్టెనని
వింటిమిగదా. మన మెంత సమర్థతతో వారిని
మార్కొని తృణప్రాయులుగాం బరికింపంగల్గినను
— పాము చిన్న దైనను బడితె పెద్దదిగా నుండ
వలెనను న్యాయము ననుసరించి — ధూర్తుం డగు
బాలచంద్రునియెడ మనము జాగ్రత్తతోం బ్రవ
ర్తింపవలెను.

—§ నరసింగరాజు §—

పోనీ యతనిని వీరమేడపి నుండి రాకుండం
జేసినచో!

నాయకురాలు

అది మన మెట్లు చేయంగలము?

నరసింగరాజు

దాని కొక యుపాయము ముందే యోచిం
చితిని. తమతో మాట్లాడవలె ననుకొంటిని.

నాయకురాలు

(తనలో) ఎంత బీరంబులు వలుకుచున్నను
నెవరి ప్రాణంబుపై వారికిం దీపిగదా (ప్రకా)
అదేమి?

నరసింగరాజు

ఏ మందురా?

నాయకురాలు

చెప్పుండు నే గూడ వినియెదను.

నరసింగరాజు

కారంపూడి యుద్ధభూమికి రావలె నని
బాలుం డువ్విళ్లూరుచుండును గదా.

నాయకురాలు

అవును.

నరసింగరాజు

వీరు లందఱును గదలి యుద్ధభూమికి వచ్చి
యుండుటచేత, "వీరమేడపిలోని స్త్రీజనం బొంట
రిగ నుండు ననితలంచి నరసింగరాజు సేనతో వచ్చి
మేడపిని ధ్వంసముం జేయునట్టి కుట్ర గురిజాలలో
రహస్యముగాం బన్నుచున్నా" రని బ్రహ్మనాయఁడు
దగినంత రహస్యముగా గ్రహించునట్లు చేయ
వలెను. అట్లగుచో నాతల నడచుటకై ప్రతిన వట్టిన
బాలుఁడు నా సైన్యపు ధాటకై వీరమేడపిలోనే
కనిపెట్టుకొనియుండును. నేను మాత్రము వీరమేడపికి
బోను గద. బాలుం డక్కడనే యుండియుద్ధమునకు
రాకపోవుట తటస్థించును. అతని రాకపోవుట సందు
చేసికొని కారంపూడిలో మనము విరోధిపక్షమును
దగినట్లు విజృంభింపవచ్చును. బ్రహ్మనాయఁడు
కన్నమదాసు యుద్ధభూమిలో నున్నా రనుకొనుము
అయినను మేటి వీరులలో నొకండు లేకపోయినను
మనకు మేలే గద.

—† నాయకురాలు †—

(యోచించి నవ్వి) చక్కని యెత్తుగడ
బాగుగా యోచించినారు. సరే. అట్లేచేయుదము
(యోచించుచు) కారంపూడిలో యుద్ధము ప్రారం
భింపంగానే నరసింగరాజుగారు సైన్యముతో వచ్చి
వీరమేడపిపైం బడుదురని గురిజాలలోం దిరుగునట్టివారి
చారులకు రహస్యముగాం దెలియ నిచ్చిన యెడల
వారు పోయి బ్రహ్మనాయనికిం జెవిని వేయుదురు
ఈ మోసము గ్రహింపలేక వారు చెప్పినట్లు బాలుం
డచ్చటనే యుండును ఇ దంతయు వంచన యని
బాలునికిం జివరకుం దెలియును. తెలిసి యప్పుడేమి
చేయంగలండు లెండు. యుద్ధము ముగిసియే యుం
డును.

—♦ నరసింగరాజు ♦—

అవును

—‡ నాయకురాలు ‡—

చక్కఁగా నున్నది నరసింగరాజుగారూ! మంచి యాలోచనముఁ జేసినారు వంచనాధిదేవతను గుత్రంత్రహార్యాగ్రమెక్కించి విహరింపఁ జేయుచున్నాము.

—‡ నరసింగరాజు †—

వారి చారులిప్పుడు గురిజాలలోఁ జాల తిరుగుచు యున్నారంటగదా. ఎవరికి నిది వంచనమని తెలియనీయరాదు. ఈసాయంత్రమే గురిజాలలో నచ్చటచ్చట మా చారులచే రహస్యముగా నావిషయము బ్రసంగింపఁ జేయుదము. అది విని గూఢప్రవర్తనులై యున్న వారి చారులు తత్క్షణమే వీరమేడపిలోఁ దెలుపుదురు.

—† నాయకురాలు †—

మంచిది. అట్లే చేయుదము.

—‡ నరసింగరాజు †—

కారంపూడికి మన ప్రయాణములు?

—* నాయకురాలు *—

రేపల్లండి యావలిదినమే కదా తేనిది. వ్యవధి యే మాత్రము లేదు. మనము కబురంపిన రాజులందఱును కారంపూడికి వత్తురో రారో తెలియదు.

—§ నరసింగరాజు §—

రాకేమి? తప్పక వత్తురు

—† నాయకురాలు ‡—

ఇంకఁబోయి మన ప్రయత్నములు మనము చేయుదము.

—* నరసింగరాజు *—

మంచిది

(తెరపడును)

## దృశ్యము 17

కార్యంపూడి — నాగులేటి తీరము,
నలగామరాజు శిబిరము
నలగామరాజు నాయకురాలు ప్రసంగించుచుందురు.

—* నలగామరాజు *—

నాగమ్మగారూ! అపరిమిత వైశాల్యంబు గలిగి యతరుపర్వతాదిమధ్యంబై సమతలంబుగా నుండుటయేకాక సర్వవిధంబుల నీకార్యమపూడిలోని సంగ్రామభూమి యెంత యుత్సాహోత్సాహరసప్రదర్శనానుకూలంబుగానున్నది! ఈమన ముందు పారుచున్న నాగులేఱుగూడ మిక్కిలి వెడల్పులేక యొక యుపనది శోభం దాల్చి కూలంకషంబై లేఁత కొబ్బరి నీటనీరు తియ్యందనంబు నధఃకరించు తన నిర్మల జలంబునందలి తరంగశిఖావిస్ఫురితంపరలచే రోధస్సన్నవృక్షపఙ్క్తి పాదంబులపైఁ బూలపూజ సేయుచుఁ జూపఱకు నేత్రపర్వంబై యున్నది. బ్రహ్మనాయఁడీ కారంపూడినే రణభూమిగా నేర్చుటమిగుల శ్లాఘాపాత్రము. (దూరమునఁజూచి) అదే మచ్చోటు బహుజనాకీర్ణముగా నున్నది?

—* నాయకురాలు *—

రాజేంద్రా! అదినాగులేటిలో గంగధార యను పేరుగల మడుగు. అది సుప్రసిద్ధమైన పుణ్యస్థలమనియు నందాప్లావంబొనర్చువారు గతకల్మషులగుదురనియుఁ బ్రతీతి. అందు మన సైనికులు విశేషసంఖ్యలుగా స్నానమొనర్చుచున్నట్లున్నది.

—* సేవకుఁడు *—

(ప్రవేశించి) అయ్యా! ధరణికోట రాజైన భీమదేవుఁడుగారి కొడుకు కోటకేతు రాజుగారంట వచ్చారు దర్శనానికి.

—* నలగామరాజు *—

తీసికొని రమ్ము.

—* సేవకుడు *—

(తీసికొనివచ్చి నిష్క్ర-)

—* కోటకేతుడు *—

(ప్రవేశించి నమస్కరించును.)

—* నాయకురాలు *—

రండు. ఈపీఠంబధిష్ఠింపుడు.

—* కోటకేతుడు *—

చిత్తము. (కూర్చుండును)

—◆ నలగామరాజు ◆—

శివపూజయైనదా?

—§ కోటకేతుడు §—

చిత్తము.

—* నాయకురాలు *—

తండ్రిగారు గూడ భోజనముఁజేసి నారు గదా?

—* కోటకేతుడు *—

ఆఁ. భోజనమొనర్చి ప్రయాణశ్రమము వలన శయనించినారు.

—* నలగామరాజు *—

పోనిండు పెద్దలు (కొంచెముండి) తమరు మొన్నటిదినము బయలుదేఱితిరి కాఁబోలు.

—§ కోటకేతుడు §—

మా తండ్రిగారును సేనానికాయంబులు మూఁడు దినములక్రింద బయలుదేఱిరి. నేనుమాత్ర మంతకు ముందే పయనమై తమ యాజ్ఞఁ బురస్కరించు కొని నాకుఁ దెలిసిన యోధులలోఁ గొందఱు పేరు గల వాఁడి మగలు విజయవాడలోను గుంటూరు వినుకొండలలోను నుండుటచే వారలఁగూడఁ దీసి కొని త్రోవలోఁ గలిసి యీ యుదయము నా తండ్రిగారును నేనును నొక్కమాఱే వచ్చియు న్నాము.

-§ నాయకురాలు §-

గురిజాల ప్రభువులకుఁ దా మొనర్చు సేవ నిరుపమానము.

—* కోటకేతుడు *—

అయ్యయ్యో! తమ రట్లనరాదు. ఇది యే మంత గొప్ప సాయము లెండు ...... కాని — యన్నతమ్ములకే — యిట్టి కలతలు వొసంగె గదా — యని — విచారము.

—‡ నాయకురాలు ‡—

మన మేమిచేయఁగలము! ఈశ్వరసంఘటనము.

—◆ కోటకేతుడు ◆—

(తలయూఁచి) ఆహ్వాన మంపినవా రందఱును దమ తమ దళంబులతో వచ్చి విడిసి యున్నట్లేకదా?

—§ నాయకురాలు §—

లే దింకను గొందఱుందు రావలయును. యుద్ధోపక్రమణదినమున కింకను రెండుదినములు గడువున్నది గదా

—§ కోటకేతుడు §—

ఇప్పు డెవరెవరు వచ్చినట్లు?

—◆ నాయకురాలు ◆—

ద్వారసముద్రాధిపతియగు వీరభల్లాణుఁడును, గుడిమెట్ట కేలికయగు నాగిపోతరాజును జంఠవోలు బాపట్ల చుట్టుప్రక్కల ప్రదేశమయిన వెలనాటిలో సింహాసన మధిష్ఠించియున్న రాజేంద్ర చోడుఁడును, నురగసేన ప్రభువర్యుండును — వీరు గాక మాడుగుల వీరారెడ్డి మొదలగు యోధాగ్రేసరులును వచ్చి విడిసియున్నారు. చంద్రగిరి నృపాలుండును నొక రిద్దఱు యుద్ధవీరులును నింకను రావలసియున్నారు.

-* కోటకేతుఁడు *-

వారికై వా?

—‡ నాయకురాలు ‡—

రాజు లోక రిద్దరు దప్ప లేరు

-♦ కోటకేతురాజు ♦-

గాజులు లేకపోవచ్చును. యోధులు మాత్రము చాలమంది వచ్చినారని వినినాను.

-§ నాయకురాలు §-

అవును. డెబ్బదియువపడిలోఁబడిన గండు కన్నమనాయఁడు నలరాజు చావుచే సగముచచ్చి మంచములోఁ దీసుకొనుచున్న కొమ్మరాజు మొదలగువా రున్నారు.

-§ కోటకేతుఁడు ‡-

కన్నమనాయఁ డెవరు?

-‡ నాయకురాలు ‡-

బ్రహ్మనాయని బావమఱఁది పైన బాలచంద్రునికిఁ బిల్లనిచ్చినమామ

-§ నలగామరాజు §-

వీరు లా వైపు లే రనెదరేల? నగ్మాల కోటిలింగము, ముతసాని కిచ్చిరెడ్డి, గోవిందుల బాపినీడు, పైడిచుక్కల ముత్యాలు, సంపెట నారన్న — వీరుగాక పెనుమాలవారను వీరులు — నింకెందఱెందఱో యున్నారు. అందఱను దలఁదన్నిన కన్నమదా సున్నాఁడు. ఇఁక వీరాధివీరుండగు బ్రహ్మనాయనిసంగతిఁ జెప్పనక్కఱలేదు గద. అదృష్టవశంబున బాలచంద్రుఁడును దత్స్నేహితులు మాత్రము రాలేదు. వీరమేడపి సంరక్షార్థం బుంచినారని నాగమ్మగా రనుచున్నారు.

-‡ నాయకురాలు ‡-

బాలచంద్రుఁడు వచ్చిన మాత్ర మేమిలెందు ఇక్కడ నంత చేతఁగానివా రెవరు? అయినను నలరాజు మరణవార్త వినిన యనంతరము సభలో గురిజాలపై ముండిపడుచు నేరమును నాపైనం నరసింగరాజుగారిపైనం మోపి శిరశ్ఛేదము గావింతునని యుత్తరకుమారప్రతిజ్ఞ లేడ్చిన బాలుఁడు రాకుండుటకుఁ గారణ మేమబ్బా!

నరసింగరాజును బాలుండు శిరశ్ఛేదం బొనరించు ప్రతిజ్ఞయే కాక నన్నుఁగూడ యుద్ధంబున బట్టి బంధింతునని బ్రహ్మనాయని ముద్దులకొడుకు — ఆ మాలగుంటఁడు — కన్నమదాసు శపథముఁ బట్టినాఁడఁట. చూచెదముగాక యీ కుట్రకుంకల ప్రతాపాతిశయములు.

-§ కోటకేతుఁడు §-

ఈ నాఁటికిఁ బరిస్థితు లిట్లు మాఱెంవికాని లేకున్న మీా రెండు కుటుంబములకుఁ గల పరస్పర సంబంధంబును వృక్షంబు పరులకు నిలువ నీడనిచ్చుచు నెంత ఫలవంతమై విరాజిల్లుచుండవలసినది! విధియనుల్లంఘ్యము.

-† నలగామరాజు †-

యథార్థము (కొంచెముండి) కోటకేతుఁడు గారూ! (రహస్యముగా) మనలో మాట. మన వైపు వీరులసంఖ్య విస్తారముగా లే దెట్లగునా యని యించుక విచారము గలుగుచున్నది. అయినను దమబోం ట్లున్నారనుకొనుఁడు కాని లోపము లోపముగానే యుండును.

-♦ కోటకేతుఁడు ♦-

నాగమ్మగారికిఁ గోపము వచ్చునేమో రథగజతురగ సైన్యంబులు మనకెక్కువకలవేమో కాని పదాతిజనంబులు మాత్రము మనకంటె వారికి వేయిమడుంగు లెక్కువ. రాజుగారూ! ఈ పూట వారిపక్షంబున వచ్చిన మాలమాదిగలు గల కాలిబంట్లు సంఖ్యాతీతు లనుకొనుఁడు. నిజముగా నట్టి సేనానివహంబులఁ జూచి నాకు గుండె బ్రద్దలయి

వల్నాటిపౌరుషము.

తని నమ్మండు.

—! నలగామరాజు !—

అవును నిజమే

—! కోటకేతుండు !—

కాని యొకటి. బాలచంద్రుండు మాత్రము యుద్ధమునకు రాలేదు.

—! నాయకురాలు !—

వీరులందఱిలో నతం డొకండు. అతండేమి బ్రహ్మండనాయకుండా? మీరలిట్లు బేలలై పరిగణించుచున్నారు గాని నా కణుమాత్రి మధైర్యము లేదు యుద్ధము ప్రారంభ మెల్లుండిగదా ఇంకను రాజులును. సైన్యములును రావచ్చును. ఇంతలోనే యధైర్యపడనేల?

◆ సేవకుండు ◆

(ప్రవేశించి) అయ్యా! దండాలు. చంద్రగిరి రాజుగారు పంపించారంట సైన్యం వచ్చింది.

నాయకురాలు

మంచిది

—! కోటకేతుండు !—

నాగమ్మగారు చెప్పినట్లు మన మిప్పుడే యధైర్య మొందుటేల? నేండు రేపు సంకెవ్వరు వత్తురో చూచెదము. అప్పుడే స్వపక్ష పరపక్ష బలాతిశయంబులం జూచి విచారించుకొన వచ్చును.

—! నలగామరాజు !—

అవును. ఆ వచ్చిన సేనలయు సేనాధీశులయు యోగక్షేమంబు లరసి వత్తురా నాగమ్మగారూ!

నాయకురాలు

చిత్తము. (నిష్క్ర)

—! నలగామరాజు !—

కోటకేతుండుగారూ! పెద్దలగు మీ తండ్రిగారినిదర్శించిచాలకాలమైనది.రంపుమీశిబిరమునకు

—! కోటకేతుండు !—

మంచిది.

(ఇరువురునిష్క్ర)

దృశ్యము 18

దోర్నీండు ప్రవేశము.

—! దోర్నీండు !—

అందరూ యుద్ధానికి పోవడంచేత వీరమేడపి అంతా బావురుమంటున్నది. కారంపూడిలో యుద్ధము నిన్ననే మొదలుపెట్టుండాలె. బాలచంద్రుడినికీ అతని స్నేహితులకు మాకూ యింకా కారంపూడికి బోయే అదృష్టం పట్టలేదు. ఆ నరసింగరాజు వచ్చేమాటేం కనపడలేదు. లేకపోతే మనం కారంపూడికి రాకుండా చెయ్యటానికి నాగమ్మ పన్నిన పన్నాగమా యిది అని బాలచంద్రుడు అనుమానిస్తున్నాడు. ఈ సాయంత్రేము గూడా చూస్తాడు. రాకపోతే యిదంతా మోసమనే అనుకొని రేపు కారెంపూడి దూకుతాడు. ఊరుకోడు. పులిపిల్ల. బహు కచ్చమనిషి. (యోచించి) ఓహో! నరసింగరాజు రాకపోయినా సరే మేడపిని కాస్తుండమని కదా బ్రహ్మనాయుడుగారి యుద్దేశ్యం. ఇకను ఈన కారంపూడి యెట్లా వెళ్తాడబ్బా? అయినా మాట్లాడుదాం. ఏమిా తోచక అతను బొంగరా లాడబోయింది ఆ తోపులోనే గదా. పోయి... ..(వినుటనభినయించి) ఆ పోతున్న వాళ్లేమో అంటున్నారే నన్నుచూచి

(తెరలో)

కోమటి అన్నమ్మ కాలికి మీ స్నేహితుడు బాలయ్యగారి బొంగరం దగిలింది. ఆమె యేడుస్తూ ఆయన్ను తిడుతున్నది. పొండి. దబ్బున బొండి.

—† దోర్నీఁడు †—

అరెరే! తిట్టుబోతయిన అన్నమ్మ కాలికే తగిలిందే. త్వరగా బోదాం.

(నిష్క్రమి)

దృశ్యము 19

మామిని తోఁపు — బొంగరా లాట.

అన్నమ్మ కాలు పట్టుకొని కూర్చుండును. బాలచంద్రుఁ డామె కాలి దగ్గఱఁ గూర్చుండి యుండును. అతని స్నేహితుఁడు దోర్నీఁడు గూడ నుండును.

—* బాలచంద్రుఁడు *—

అమ్మా! బుద్ధిపూర్వకముగా మాత్రము తమ చరణంబునకు హాని గలిగింప నెంచలేదు. ఇది నే నెన్ని సారులు నొక్కి చెప్పుచున్నను దమరు నాయందుఁ గరుణార్ద్రచిత్తలు గాలేదు. ఇది, నా దురదృష్టము.

—§ అన్నమ్మ §—

(ఏడ్పుగొంతుతో) నీ దురదుష్ట మేం కమ్మం నా దురదుష్టమే కాని. ఆయిగా ఎండలో పేడ బోగుజేసుకోక యిట్టా వచ్చి అడ్డమయిన వాళ్ళ చేతా దెబ్బలందుకు దింటాను. నా కమ్మం నా పాలుద్దం. పైగా బుద్ది పూరకంగా కొట్టలే దంటావ్? (మెటికెలు విఱుచుచు) నీ దుంప దెగ. నీ శెయ్యి బడ. ఇయ్యాల్రోరి మొగం సూశానో కాని నీ యంటి పాపిట్టోడి శాత కాలిరిగింది. (నొప్పితో) శ్శ్. అమ్మో! నీ జిమ్మడ. ఎంత దెబ్బ గొట్టావురా. నీ బొంగరం నువ్వూ వూడ్చుకుపోను. ఎయ్యాల్లనే యేశావు. లేకుంటే నాకే మొందుకు తగుల్తుంది?

—♦ బాలచంద్రుఁడు ♦—

అమ్మా! అట్లనుట పాడిగాదు. బొంగరా లాట చూడ వచ్చిన వారు రెండుమూడు వందల జనమునకుఁ దక్కువ యుండరు గదా. ఇందఱిలో మీపయి మాత్రము విరోధించుటకుఁ దగినంత కారణ ముండవలెను. అట్టి కారణ మేమియు లేదని సర్వసాక్షి యైన భగవంతుఁడు డెఱుఁగును.

—‡ దోర్నీఁడు ‡—

అవు నిందఱిలో నీకే హానిఁ జేయుటకుఁ దగినంత కారణ మేమున్నది?

—‡ అన్నమ్మ ‡—

నువ్వున్నావా నాయనా యిక్కడ! చీరంగ నీతులు జెప్పవచ్చావు నోరు మూచుకు గూదోక! తనూ ఒక పెద్దమంచల్లే చెప్పవచ్చావు. నాకలో ళ్ళబ్బాయివే. ఉద్దోగం చేసుకోకుండా పెద్దోళ్ళను యిడిసి పెట్టి యీపోలగాడి సుట్టూ తిరుగుతావు! చిగ్గు లేదూ?

—† దోర్నీడు †—

అదిగా దమ్మా!

—‡ అన్నమ్మ †—

సాలుసాల్లే రా నాకలెదవా! కొట్టడాని కేం కారణముండాలెరా? కొంటె శేట్టలకు కారణమేంది? కొంటె పిల్లోళ్ళు కనపడ్డ వాళ్ళ నల్లా కొడ్తారు. ఆళ్ల కేం మాయరోగమా? తింటారు వుల్చుల్లో ముక్క లల్లే తెగదిరుగుతారు. దున్నపోతు లల్లే దిని తెగ బల్చి కొట్టుకుంటున్నారులే అంతా. ఈ నొకడు దొరికాడు నాయకుడు మీకు.

—* దోర్నీఁడు *—

ఏదీ యిప్పు డన్నమాటలు మళ్ళీ అను. తల చెండేస్తాను (అని కత్తి యెత్తును)

—* బాలచంద్రుఁడు *—

(వారించి)

అమ్మా! పొరపాటున నపరాధ మొనర్చి తిని బాలుఁడను. నా తప్పు క్షమించి శాంతము

వహింపుఁడు. నే జెప్పికోనవలసినది చెప్పినాను. పిమ్మటఁ దమ చిత్తము.

—‡ అన్నమ్మ ‡—

నువ్వు బాలుఁడవా? బుచ్చెబ్బాయివి పాపం. నీ కేం తెల్సు. నోట్లో వేలుపెడితే కొరక లేవు. నేతిబీరకాయవు. పేరుకు మాత్రము బాలుడవు. బెమ్మనాయుడుగారూ అరంతా యుద్దానికెల్తూ యిక్కడ నిన్ను దించిపోయింది యిందుకే కామాలె. ఆళ్లతో బోయి యుద్ధం జేయలేక "ఎవడో వత్తాడు సంపా" ల్నని వంక బెట్టుకొని గాజుల్దొడిగించుకొన్న ఆడదానల్లె యింటో కూకున్నావ్! ఈరు డంటు యీరుడు ఆడదానికంటె కనాకట్టం.

—* బాలచంద్రుఁడు *—

(చివాలున లేచి కత్తి నూడఁబెఱికి) ఏవిా! ఏమంటివి! వైరిసైన్యసంరంభంబున కాగలేనని తలంచియా నేను యుద్ధరంగంబున కందఱితోఁ బాటు పోకుంటిని? ఈ వాక్యము స్త్రీ నోటి నుండి వెలువరింపఁబడుటచే మిన్నకుంటిని గాని పురుషుం డెవ్వం డైనను గడకుఁ బ్రాణమిత్రుం డైనను హృదయశల్యాయమానం బయిన యీ పలుకుఁ బలికిన యెడల మదీయఖడ్గవిక్షేపంబునఁ దదీయశిరంబు పరిత్రుటితం బొనర్చియుండును. ఈ మేడపై లోని వారు లందఱు నిట్లే యపోహంబులం బొందుచుండిరేమో కదా! ఎంత పాపము! ఎంత ఘోరము! ఎంత కర్ణకఠోరం బైన యపవాదవాక్యములు నేఁడు వినవలసివచ్చినది! అగణ్యశ్రీమంతుఁడును నిఖిలాంధ్రరాజ్యంబునందే కాక పరరాష్ట్రంబులందుఁ గూడ విఖ్యాత వీరులందఱకును నిరుపమాన పౌరుషభిక్షంబు వెట్టి దేవతాప్రస్తూయమానుండై వీరాధివీరుండని యనేకయుద్ధంబుల విజయలక్ష్మిచేఁ గరపత్రంబులం గొనిన బ్రహ్మనాయునికి గారాబు పట్టియై విరోధిజనంబుచేఁ గూడ నిశ్చయబుద్ధిచే సింహకిశోరం బని పిలువంబడుచు నింతవఱకు సకలజనజేగీయమానుండనై బాల్యం బాదిగ మనస్సును వీరవిక్రమకథాసైకతస్థలులఁ గ్రీడింపఁజేయుచున్న యీ బాలచంద్రునికా — యీ యసమానదోర్బలవిజృంభణ తృణీకృతసైనికవీరాగ్రేసరునికా యుద్ధభీతి! ఎంతమాట! ఈ పరుషభాషణము నా హృదయంబును గలగుండు పఱచుచున్నది. ఇంక నే నోర్వఁజాలను మా యిలువేల్పగునో స్వామిరా! చెన్నకేశవా!

అతిమాత్రంబగు నా పరాక్రమమె
యాహా! లోకులీక్షింప నీ
గతి నాడంగులచేత దూషణకళా
ఘాతంబులం బొందె నా
మతి ఘోషించెడు నస్త్రజీవినయి యి
మ్మాడ్కిన్ వృథాకాలయా
పనం బొందితిఁ — దప్పుఁ జేసితిని — నా
పాపంబు సైరింపుమా.

దోర్నీఁడా!

అసమోదగ్రమదీయ సంస్తిమిత
శౌర్యాభీలసంగ్రామసా
హసభారం బను మందు పాతఱకు
నిప్పంటించె నన్నమ్మ క్రౌ
ర్య సమేతంబను శత్రురాజఘనసై
న్యంబెల్ల నిర్దగ్ధమై
యసువుల్ గోల్పడుఁ గాక నింక మనవై
పానంద ముప్పొంగఁగన్,

(అన్నమ్మ భయముతోఁ దొలఁగిపోవును)

—* దోర్నీఁడు *—

అన్నయ్యా! యుద్ధానికి బోతావా యేమి?

—§ బాలచంద్రుఁడు §—

అవును నిశ్చయముగాఁ బోవుదును.

—§ దోర్నీఁడు §—

పొరపడుతున్నావు

—§ బాలచంద్రుఁడు §—

ఎట్లు?

—◆ దోర్నీఁడు ◆—

వారంతా పోతూ నిన్నిక్కడ విడిచిపోయినారు గదా?

—§ బాలచంద్రుఁడు §—

నరసింగు వచ్చునేమో యని కదా విడిచిపోయినది. ఆఁతడిప్పటివఱకును రాకుండుటచే యుద్ధభూమికి నేను పోకుండుటకై విరోధులు మోసము పన్నినారని సందేహించుచున్నాను.

—‡ దోర్నీఁడు ‡—

అది గాకపోయినా మేడిపిలోనే వుండి కాపుదల చేస్తుండాలె నని కదా వారి యుద్దేశం.

—† బాలచంద్రుఁడు †—

దోర్నీఁడూ! తండ్రిగారి యభిప్రాయమాజ్ఞకాక పోయినను నవ్యుల్లంఘ్య మని నాకుఁ దెలియును. కాని విపరీతపరిస్థితులావహిల్లినప్పుడట్టి ధర్మంబులలోని నైర్మల్యంబును మన మంతగాఁ బాటింప నక్కఱలేదని నా మతము.

—‡ దోర్నీఁడు ‡—

(నిదానించి) ఏమో! నీ భావం సరిగా తెలియడంలేదు. మొత్తము మీద యేవో కొత్త ధర్మాలు పుట్టిస్తున్నావు.

—§ బాలచంద్రుఁడు §—

దృష్టాంత సహితముగఁ జెప్పుచున్నాను. వినుము. అసమానబలుండగు నర్జునుండు మున్నొకప్పుడు తన గాండీవంబు గూర్చి తిరస్కార వాక్యంబు లెవఁడాడునో యట్టివాని శీర్షంబు ఖండింతునని శపథం బొనర్చియుండెను. కౌరవ పాండవయుద్ధంబున కృష్ణార్జునులు దగ్గఱ లేనప్పుడు కర్ణుం డొకనాఁడు ధర్మరాజును జుట్టుముట్టి బాణ పరంపరాసంపిహితుం జేసి శరీరంబున రక్తధారలవిరళంబుగ ప్రవహింపం జేయ నతండు శిబిరంబునకుం బోయి శయించి తనకుఁ దన సన్నిధిం జేరవచ్చిన యర్జునుని — కర్ణుం డింకను జావకపోయెఁ గదా యను ననుశయంబున — ననరానిమాటలాడి యాతని గాండీవంబును గూడ దూషించెను. పూర్వము గావించిన శపథము ప్రకార మర్జునుఁడు ధర్మరాజు శిరంబు ద్రెవ్వనేయ నుద్యుక్తుండు గాఁగా జగన్నాటకసూత్రధారి యగు శ్రీకృష్ణభగవానుం డడ్డపడి సమయానుకూలధర్మోపన్యాసంబు గావించి యా దుష్కార్యంబు నుండి యతనిని మాన్పించెను. శపథము ప్రకారము ధర్మరాజును జంపియుండవలసినదిగదా. అట్లే జరిగి యుండిన యెడల ధర్మరాజు మరణము, ధనంజయుని మనస్తాపము, మనోవైకల్యము మొదలగునవన్నియు సంభవించును. యుద్ధ మాపవలసివచ్చును. దుర్యోధనాదు లనెడి భూభారం బట్లే నిలిచియుండును. ఇవన్నియు నాలోచించియే శ్రీకృష్ణుండు విపరీతపరిస్థితులందు ధర్మచ్యుతికిఁ గొంత యవకాశము గల్గించి యున్నాఁడు. మఱియు నొక్క దృష్టాంతము. పూర్వ మొకనాఁడు గొందఱు బాటసారులు త్రోవం బోవుచుండఁగాఁ జోరులు వారిని వెంబడించిరి. ఒకచోట నొక ఋషి కూర్చుండియుండ బాటసారు లాతని యభిముఖంబున నున్న పొదలోనికిం బోయి డాఁగిరి. చోరులు వచ్చి ఋషిని ప్రశ్నింపఁగాఁ దనకుఁ దెలిసిన విషయమే కావున నసత్య మాడరాదని యెంచి పొదలో నుండి రని నిజముఁ

జెప్పెను. అంతట దొంగలు బాటసారులను బట్టి కొని వారి ననేకవిధముల హింసించి ధన మపహరించిరి. లోకాంతరంబున నా ఋషికి నరకప్రాప్తి యయ్యె నట. ఋషి చెప్పకుండిన యెడల బాటసారుల కా హింస తప్పెడిదే కదా. అతఁ డసత్య భీతిచేత హింసకుఁ దావిచ్చినవాఁ డయ్యెను. సత్య మెంత గొప్పదియైనను నహింస — సత్యము — నను రెంటిలో నహింసకే ప్రాముఖ్య మీయవలెను. చూచితివా యీసందర్భంబున సత్యంబునకు విలువ దగ్గినది! కాఁబట్టి సందర్భముల ననుసరించి యిట్టి ధర్మచ్యుతి కంగీకరింపవచ్చును.

-§ దోర్నీఁడు §-

మీతండ్రిగారి యుద్దేశం ఆజ్ఞగానే అనుకొని దానినుండి తొలగుట ధర్మం గాదని మనసులో ఒప్పుకుంటూ పైకి మాత్రం యిట్టి ధర్మచ్యుతి కంగీకరింపవచ్చు నంటావ్!

-‡ బాలచంద్రుఁడు ‡-

నిజముగా ధర్మచ్యుతి యగునో కాదో — యీ పరిస్థితులందుఁ జేయఁ దగినది యిది.

-† దోర్నీఁడు †-

(చూచి) అమ్మగారి సేవకుఁ డొస్తున్నాఁడే! ఎందుకో!

◆ సేవకుఁడు ◆

(ప్రవేశించి) బాబుగారూ! దండాలు.

-† బాలచంద్రుఁడు †-

ఏమివిషయము?

-◆ సేవకుడు ◆-

తమ బొంగరం కొమ్మటి అన్నమ్మ గారికి నగిలిందనీ ఆమె యేమేమో అనరాని మాటలాడుతూ అందరూ యుద్ధానికి బోతే ఆడదానల్లే యింట్లో వున్నావా అని తిట్టిందనీ దోవనబోతూ ఎవరో చెపితే ఐతమ్మ అమ్మగారు యిది యీ చీటీ రాసి పంపారు.

(అందిచ్చును.)

-§ దోర్నీఁడు §-

అమ్మగారి కప్పుడే తెలిసిందే!

-† సేవకుడు †-

సెలవు.

-† బాలచంద్రుఁడు †-

పొమ్ము.

-† సేవకుడు †-

(నిష్క్ర)

-† బాలచంద్రుఁడు †-

(ఉత్తరము చదువును)

" వీరపుత్రుఁడికి,

అన్నమ్మ గారి నోట వచ్చిన వాక్యములు నాహృదయంబున శంకువై వేధిస్తున్నవి. అవి వీరుడి కీర్తికాంతకు వజ్రాయుధపు దెబ్బ లని గ్రహించుకో. పరులచే జేయబడిన పౌరుషనింద యుద్ధవీరుడి కాయంబునందలి వ్రణమై బాధిస్తుంది నీతండ్రివైన వారు తల్లివైన వారు మానవంతులకు శూరశిఖామణులు. మడిబట్టపై మసి వేయకుము. కోడెత్రాచుపిల్లపై గడ్డ వేయఁగలమా? నీచ ప్రాణియైన పాముకంటె మనుష్యుఁ డెన్నిరెట్లధికుఁడు! వీరుడిజీవితవృక్షం మానసంరక్షణ మనే పాదులో బుట్టింది. మానహాని మరణం దగ్గర నుంచి సుంకం గొంటుంది సుమా! వీరపుత్రుఁడా! ప్రజా దురభిప్రాయచ్ఛేదమునకై కత్తి నూనుము.

నేను గండువారింటి ఆడుబడుచును. కాఁబట్టి నీ కింటిబెంగ అక్కఱలేదు. ఆలస్యము

చేయక యుద్ధానికి బొమ్మ్మ.

ఇట్లు,
నిన్ను కానక కన్న తల్లి
ఐతమ్మ"

—| బాలచంద్రుఁడు |—

ఆహా! మా యమ్మ వ్రాసినది యెంత హృదయోద్బోధకముగా నున్నది!

—◆ దోర్నీఁడు ◆—

అన్నయ్యా! భావం గంభీరంగా వుందే. ఉంకోసారి చదువు.

—| బాలచంద్రుఁడు |—

(చదివి) తమ్ముఁడా! చూడు మెంత భావగంభీరమో! "పరులచేఁ జేయఁబడిన పౌరుషనింద యుద్ధవీరుని కాయంబునందలి వ్రణమై బాధిస్తుం" దఁట. కాఁబట్టి నేను యుద్ధవీరుఁడనైన యెడల నన్నుఁ గూడ నామాటలు బాధింపవలెననియే కదా. "తండ్రినైపువారు తల్లినైపువారు మానవంతు" లఁట. అనఁగా "నీవు గూడ మానవంతుడవు క" మ్మని సూచన. "మసిబట్టపై మసివేయతా" దన్నది. స్వచ్ఛమైన వంశమునకుఁ గళంకము రానీయవల దని యుద్బోధించుటయే కదా. చిన్నదైనను గాలసర్పమునకుఁ బౌరుషము విస్తారము. అట్లే బ్రహ్మనాయఁ డను మహావీరుని పుత్రుఁడను గనుక నాకును బౌరుష ముండవలెనని యాదేశము "మానహాని మరణం దగ్గర నుంచి మంకం గొంటుం" దఁట. మానహాని కంటె మరణమే మేలని గొప్పధర్మమును బోధించుచున్నది. పైపెచ్చు "వీరపుత్రుఁడా!" యని సాభిప్రాయముగా సంబోధించుచున్నది. స్త్రీ జనములఁ గనిపెట్టియుండవలెనని తండ్రిగారి యాజ్ఞ గనుక దాని నెట్లుల్లంఘిం తునా యని నేను విచారించుచు నన్నుకొని తాను బౌరుషమునకుఁ బ్రసిద్ధి పొందిన గంధువారి వంశములోని యాఁడుబిడ్డ యనియు స్త్రీజనంబుల నొకరు రక్షింపవలసిన పని లేదనియు నొక్కి వక్కాణించుచున్నది. నీతములు నియమములు నెన్ని యోజరపి కానక కానక మాయమ్మ నన్ను గనినది. అమిత ప్రేమమున నన్ను జూచుకొను చున్నను బౌరుల యుపవాదమును భరింపలేక నే నింటికి వచ్చు నంతలోపలనే నిలువనీయని యారాటమునో "యుద్ధంబున మగఁటిమిఁ జూపు" మని నా కుద్బోధము గలిగించుచున్న నా తల్లి యెంత మానవతి! ఆ వీరమాత కడుపున జన్మించుటచే నా జన్మము సార్థకమైనది. నన్నామె గర్భంబున బడవేసిన పూర్వపుణ్యంబులు పరుల కసూయాజనకములుగాకపోవు. (మనస్సులో తల్లి నుద్దేశించి)

అమ్మా! ఐతమతల్లీ! నీ కొడుకు దివ్య
తేజఃపుంజ దీప్తోద్రేకరో
షమ్ముల్ గల్గిన సింహశాబకము నీచ
స్వల్పజన్ముండుకాఁ
డమ్మేరుప్రతిమానధీరుఁ డగు బ్రహ్మ
జ్ఞానికిం బుత్రుఁడర్
నమ్మంజాలవె బాలచంద్రుఁ డిటు నిందం
బొందునే మానినీ.

మిగుల నాశీర్వదించి పంపితివ యేని
గదనభూమిని నా ధాటి కెదురుగలదె
కలఁచివేయనె లోకభీకరము గాఁగ
శత్రురాజవరూధినీ సాగరంబు.

తమ్ముఁడా! తల్లి యాదేశము వింటివి కదా!

—| దోర్నీఁడు |—

విన్నాను. సంతోషము (వచ్చుచుండు సేవ

కుని జూచి) అన్నగారి సేవకు డొస్తున్నాడే కారం పూడి నుంచి

-† సేవకుడు †-

(ప్రవేశించి) బాబయ్యా! దండాలు

-† బాలచంద్రుడు †-

ఏమి?

-† సేవకుడు †-

అన్నయ్యగా రుత్తరం పంపారు (అందిచ్చును.)

-† బాలచంద్రుడు †-

(చదువును)

"చిరంజీవి తమ్మునికి,

నరసింగు వీరమేడపి పైకి వచ్చు నని వారెంత గూఢముగా వెల్లడించినను నది నీవు రాకుం డుటకై కావించిన వట్టి మాయోపాయ మని తేలినది. అతని నిక్కడనే గుడారములలో దాచియుంచిరి. కనుక నీవాలస్యము చేయక పయనమైరమ్ము. మొదట వీరమేడపికావుదలఁ గూర్చి యనుమానించినను దండ్రిగారు నీ విక్కడకు వచ్చుటకుఁ జివర కంగీకరించినారు. తత్క్షణమే రమ్ము.

ఇట్లు,

కన్నమదాసు"

-† బాలచంద్రుడు †-

(ఆశ్చర్యముతో) ఎంత మోసము!

-† దోర్నీడు †-

అనుకున్నం తయిందే!

-† బాలచంద్రుడు †-

తమ్ముఁడా! రమ్ము పోవుదము.

(అందఱు నిష్క్రమింత్రు)

దృశ్యము ౫౦

నాయకురాలు ప్రవేశము.

-† నాయకురాలు †-

నరసింగరాజు నెంత దాఁచియుంచి బయటికిఁ గన్పడకుండఁ జేసినను శత్రువు లెట్లో పసిపట్టి — యీ దంతయు బాలచంద్రుఁడు యుద్ధభూమికి రాకుండుటకై మేము చేసిన మోస మని — యూహించి యీ విషయము మేడపికిఁ గబురుసేసిరి. అందుచేతనే యీ యుదయము బాలచంద్రుండు వీరమేడపి నుండి తన స్నేహితబృందంబులతో వచ్చి విడిసియున్నాఁడు. కలికి మగఁటిమి గలజోదులకుఁ గూడ నించుక భయోత్పాదన మైనట్లు వినుచున్నాను. నిన్నటిదినము బ్రహ్మనాయఁడు చూపిన రణపటిష్ఠత మాత్రము నిరుపమాన మని చెప్పక తప్పదు. అప్పుడే సైన్యము నాల్గవవంతైనను బ్రహ్మనాయుని క్రోధాగ్ని యెదుట మాడి మశాన మయినది. వచ్చిన రాజన్యులలోఁ ననేకులు మాచెర్లరాజ్యము వారి కిచ్చుటయే న్యాయ మని పల్కుచు ప్రబోధించుచుండుట వలనను బాలచంద్రుండు నరసింగును శిరచ్ఛేదంబు గావించు నను కొని కలంతవడిన కొందఱి యపోహంబుల వలనను నాకు మఁన్ను మనస్సులో లేకున్నది. పోరాటము పట్ల మాత్రము ధైర్యంబు నాకుఁ గించిత్తైనను సడలకున్నను వచ్చిన రాజమిత్రుల యొక్కయు కారి యొత్తిడి గల నలగామరాజు గారి యొక్కయు యుద్బోధనముల వలన వారికి రాజ్యం బిచ్చి సంధి గావించుకొనవలసివచ్చు నేమోనా రాజ్యంబు పట్ల నెల్లున్నను మతివిషయంబున మాత్రము లొంగఁదలఁచు కొనలేదు. (చూచి) అటఁగో! ధరణికోటయువరాజుగారైన కోటకేతువు

గారు సంధ్యుద్బోధనమునకై మఱల నాకడకు వచ్చుచున్నారు.

-‡ కోటకేతుఁడు ‡-

(ప్రవేశించు చు.) నమస్కారము. నాగమ్మగారే మాలోచించిరో తెలియలేదు.

-§ నాయకురాలు §-

అల్పవయస్కులయ్యును ననన్యప్రతిభాశాలులగుటచేఁ దమరునూకుఁ బూజ్యులు. పెద్దల మాట కెదురుసెప్పుచున్నానని దురభిప్రాయపడ వలదని మనవి.

-§ కోటకేతుఁడు §-

మీకును వారికిని దగిన పరిచయంబు గల వాఁడ నగుటచే రెండు పక్షంబుల శ్రేయంబును గోరి "యుద్ధమూపి సంధికిం బూనుఁ" డని హెచ్చరించుచున్నాను. యథార్థ మాలోచించిన వారి రాజ్యము వారికీ వలసినదే కదా. ఇట్లు మిమ్ము సంధికిఁ బురికొల్ప నిశ్చయించినది నే నొక్కఁడనే కాదు. వీరభల్లాణుఁడు మొదలగు వారు గూడ నున్నారు గదా. యుద్ధమాడలేక శరీరము దాఁచుకొనఁ దలఁచి యి ట్లనుచున్నా మని గ్రహింపవలదు.

-† నాయకురాలు †-

కొంత మట్టుకు యుద్ధం బొనర్చి సంధికిఁ బూను నంతటి దురవస్థ యీ పక్షంబున కేల వట్టినదో తెలియకున్నది.

-† కోటకేతుఁడు †-

నేను వచ్చిన తొలిదినంబునుండియు సంధిప్రేరణము గావించుచునే యున్నాను. నలగామరాజుగారికిఁ గొంత నచ్చినది. తమ యభిప్రాయంబులు మిక్కిలి సంభావ్యములగుటచే నిన్ని సారులు లోకక్షేమము గోరి యీ విషయముఁ దమతో నెత్తవలసివచ్చినది. మాచెర్లరాజ్యంబు వారి కిచ్చివేయుట న్యాయమనియు, నన్నదమ్ముల కయ్యము శ్లాఘాపాత్రము గాదనియుఁ బెద్ద లందఱు దలఁచుచున్నారు. అదిగాక మన సైన్యంబు కొంత వఱకుఁ బలహీనమయినదని కూడఁ దమ కొప్పుకొనవలయును.

—* నాయకురాలు *—

క్రొత్త సైన్యంబులకుఁ గబురంపితిని గదా.

—♦ కోటకేతుఁడు ♦—

ఎన్ని క్రొత్త సైన్యంబులు వచ్చిన నేమి? మను బ్రహ్మనాయని ధాటిముందఱ! నాగమ్మ గారూ! నిన్నటి దినము

యుద్ధవిరామఘంటవఱ
కూపిరిఁ ద్రిప్పఁగనీక శత్రురా
డ్బృద్ధవిరోధ మూనుచుఁ గృ
పాణకృతాంత నితాంత పాళముల్
గ్రిద్దదళంబుపైఁ బఱపి
గుండెల దోసిటఁ బెట్టుచున్న శౌ
ర్యోద్ధతు బ్రహ్మనాయని జ
యోన్నతు నాపె నెవండు చెప్పుఁడీ.

మఱియు

మన సేనానివహం బుసిళ్ల గతి న
స్త్రాళీవిరులం జుట్టుము
ట్టిన వేళల్ నవుటాల కెవ్వఁడో — యతం
డే బాలచంద్రుండు వ
చ్చె — ననల్ గాలికి బుద్ధి సెప్పిన దళ
శ్రేష్ఠంబుతో యుద్ధమే
మని కావించెద రింకఁ — బ్రజ్ఞలకుఁ జే
యంబోలు నేకయ్యముల్?

-‡ నాయకురాలు ‡-

మీ కందఱకును సందులో నలగామరాజుగారికిని సంధి యవశ్యాచరణీయముగాఁ దోఁచు

చున్నప్పుడు నేనడ్డు రాఁగూడదు. సరి కానిండు. అట్లయిన సంధిసూత్రము లేమిటి?

—‡ కోటకేతుఁడు ‡—

మాచెర్లరాజ్యము వారి కీవలసినదనియే. దీనికి గుణవంతుఁడైన బ్రహ్మనాయఁడు గతంబు మఱచి తప్పక యొప్పుకొని తీఱును.

—‡ నాయకురాలు ‡—

మిగిలినవారందఱు?

—‡ కోటకేతుఁడు ‡—

వారిని నాయఁడుగారు మందలించి యొప్పింతు రనుట సత్యము. అట్లుగాక, మాచెర్లరాజ్యము నిచ్చుచున్నను మొండిపట్టు విడువక యలరాజు హత్యకుఁ బ్రతిహత్య గావింపఁదలఁచి నరసింగరాజును శిరశ్ఛేదంబు సేయ నెంచి బాలచంద్రుఁడు మొదలగు వా రొప్పుకొనక యుద్ధోన్ముఖులై యుండిరేని యప్పుడు ధర్మదేవత మన పక్షంబున నుండుఁ గాన నొక్కొక బు రంపితిమా యాంధ్రదేశములోని తక్కుంగల రాజన్యులు గూడ మన పక్షంబున వచ్చివిక్రమింతురు. నిజంబుగా నరసింగే శిరశ్ఛేదితుండైన యెడలఁ — ప్రాణంబుల కాసింపక రణసాహసంబు సూపించి దారుణంబైన పరివిదారణంబున నా గుంటను బాలచంద్రుని నని మిషాశ్చర్యపాదకంబుగా యుద్ధంబున బలి దీయక విడుతుమా! బాలచంద్రుని జూచి భయంపడుచున్నా మని మాత్రము గ్రహింపఁజనదు. “ వారి రాజ్యము వారి కిచ్చివేయుట న్యాయము గాదా — అనవసరంబుగా నీ కయ్యమేల ” యని విచారించుచున్నాము గాని వేఱొండుగాదు.

—§ నాయకురాలు §—

రాజ్యభాగంబు మాట యెట్లున్నను మత విషయంబున మాత్రము లొంగఁ దలంపలేము. దేశం బంతయు మాలకూటముఁ జేయుచున్న బ్రహ్మనాయని నింకను గౌరవోత్కర్షముతోఁ జూడఁగలమా? ఇట్టివైష్ణవమతప్రచారము విరమించుకొనుట సంధిసూత్రములలో నొక్కటై యుండిన గాని నే నంగీకరింపఁజాలను. నలగామరాజుగారు గూడ శైవమతవ్యాప్తివిషయంబున రాజ్యప్రాణంబులఁ గూడ లెక్కగొనక పరివర్తింతురు గాని యన్యథాకరింపరు.

—§ కోటకేతుఁడు §—

సరే. వారితోఁ గూడ మాట్లాడుదము రండు.

(తెరపడును)

(తెరలోఁ జాటింపు)

ఈపూట యుద్ధం లేదు. కోటకేతువుగారు యీరులందఱితో మాట్లాడుతారు. సాయంతరము సభ కంతా రావల్సిందని మల్దేవరాజుగారి ఆజ్ఞ అయిందోహోయ్ (డప్పువాయించుట వినఁబడును)

దృశ్యము 21
కోటకేతువు ప్రవేశము

-§ కోటకేతుఁడు §-

(తనలో) మాచెర్లరాజ్యము వారి కీయకుండుట యన్యాయమని యెఱిఁగి యన్నదమ్ముల పోరాటము సమంజసము గాదని తోఁచి మనస్సు సంధికై పీకులాడుచున్నది. పరిపాలననిర్వహణకారణముల వలన నలగామరాజుగారి యాహ్వానము నాజ్ఞఁ బురస్కరించుకొని నేను వచ్చునప్పుడు నాతోఁ గూడఁ గొందఱు వీరులఁ దీసికొనివచ్చినను నాతోఁబాటు మిగిలిన పెద్దలను గూడఁ బ్రోత్స

హించుచు బ్రహ్మనాదుల బలాతిశయంబు కనులకుం గట్టినట్లు వర్ణించుచుం దొలుత వచ్చినవే కాని మఱల నే సైన్యంబులు రాకుండుటచే నెట్లో మాచెర్లరాజ్యము యథాపూర్వము వారి కిచ్చివేయునట్లొప్పించితిని. నాగమ్మగారెంత ధీరోక్తులం బ్రసారించినను, బాలచంద్రుని గంభీరప్రతాపాతిరేకంబుతోం బాటు ప్రతిజ్ఞాపరిపాలనదీక్ష యెల్లర మెచ్చంగి యుండుట వలన వాస్తవముగానే నరసింగుతలం దెగవేయుటకుం బ్రయత్నించునని నా కనుమానంబు పుట్టుటచేత — వారి రాజ్యము వారికిచ్చుటయే కాక మత ప్రచారవిషయంబందును గొంచెము సడలువిడువుండని నే నెంత నొక్కి చెప్పుచున్నను ముఖ్యముగా నాగమ్మగారేమాత్రము లొంగకున్నారు. మాచెర్లరాజ్య మొసంగుటకొప్పికొంటిమి కాని బ్రహ్మనాయని యస్పృశ్యతానివారణ ప్రచారము రూపులేకుండ నాశనముం గావింపవలెననియు నస్పృశ్యతపై నింక నెన్నండు ప్రచారము గావింపరాదనియు నది సంధినిబంధనములలో ముఖ్యమైనదిగా నుండవలెననియు నామె కోరుచున్నది. అంత మగతన మున్నచో నరసింగరాజు తల నఱకినను నిష్టమే కాని పంచమాస్పృశ్యతోపన్యాసములు మానుకొన నిచ్చగింపని యెడల సంధి యెంతమాత్రము వాంఛనీయము కాదని యుగ్గడించు నాగమ్మగారి దీక్ష యక్రమమైనను శ్లాఘాపాత్ర మగుటకు సందియము లేదు. కానిమ్ము ఈ సంధి సూత్రములనే మల్దేవప్రభుసముఖంబున నివేదించెదం గాక. మతప్రచారము మాట యెట్లున్నను రాజ్య మిచ్చుచున్నారుగదా యని సంధి కిచ్చగింతురేమో చెప్పలేను. కడకుం గొంత కాలమైనను మతప్రచారము నాపియుంచుట కొప్పికొందురేమో చూడవలసియున్నది. ఈ యాలోచనము నాగమ్మగారికే మాత్ర మిష్టము లేకున్నను నలగామరాజుగారు సుముఖులుగా గన్పడినారు. ప్రయత్నించెదను. పైన దైవమున్నాండు.

(నిష్క్రి)

దృశ్యము 22

మల్లదేవుని సభ.

బాలచంద్రుండు కన్నమదాసు మల్లదేవుండు గూర్చుండి యుందురు.

—† కోటకేతుండు †—

(బ్రహ్మనాయనితోం బ్రవేశించి) మలిదేవప్రభువర్యులకు నమస్కారము.

—† మల్లదేవుండు †—

ధరణికోటయాన రాజ్యాభిషిక్తుల కభివాదనములు.

—♦ బ్రహ్మనాయండు ♦—

ఈ యాసనం బధిష్ఠింపుండు.

—§ కోటకేతుండు §—

చిత్తము. తమరు గూడం గూర్చుండుండు.

—† బ్రహ్మనాయండు †—

తమరు నేండు శత్రుపక్షంబున నున్నను మాతో సంప్రతించునట్టి కుతూహలము గలిగినందులకు మే మెంతయుం గృతజ్ఞులము.

—‡ కోటకేతుండు ‡—

అనుగృహీతుండను. (లేచి) ప్రభువులకును పెద్దలకును నమస్కరించి నా విజ్ఞాపనవాక్యంబులు శ్రద్ధతో నాలకింపవలెనని ప్రార్థించుచున్నాను. అనేక సంవత్సరములనుండియు నిర్భరయశస్సూర్జితంబై దక్షిణదేశస్థ నిఖిల రాజ్యతారకానివహ రాకాచంద్ర

బింబాయమానమై పరమహీపాలురపౌరుషం బెక్కి రానీక ప్రజాపరిబోధంబున ముందంజ వేయుచు సర్వజనశ్లాఘాపాత్రంబైన యీ పల్నాటిరాజ్యం బంతయుఁ గీర్తిశేషులగు నలుగురాజుగారి ప్రాజాపత్యంబున నెంత తల యెత్తి తిరిగినదో కుఱ్ఱవాఁడ నగు నాకుఁ దెలియకపోయినను బెద్ద లందఱకును విశదమై యున్నది. అలుగుమహీనాథునికిఁ దోడు నీడయై కార్యంబునకును ఖడ్గమునకును దగినవాఁడై యద్వితీయప్రతిభామహోన్మేషంబుల కలిమిచే సమర్థుండైన దొడ్డనాయని మంత్రిత్వంబు పల్నాటి రాజ్యపుటుచ్చస్థితికిఁ బునాది యని యంగీకరింపక తప్పదు. పున్నమనాఁటి వెనుకఁ జందమామ గొప్పఁదనమువలెను నియమముతప్పి భుజింప నిశ్చయించు వాని శరీరారోగ్యము తఱఁగునను నా రాజమంత్రు లిర్వురును దేహము చాలింపఁగానే క్రమక్రమముగాఁ బల్నాటి ప్రభావంబు సన్నగిల్లఁ జొచ్చినట్లు వినుచుండు నాబోంట్లకే కంటఁ దడి కాఱుచున్నప్పుడు ప్రత్యక్షముగాఁ జూచి బ్రహ్మ నాయఁడుగా రెట్లు పరితపించుచుందురో మనము చెప్పలేము. అలుగురాజు వెనుక ముఖ్యముగా శైవవైష్ణవమతపరస్పరనిందాపూర్వకాందోళనఫలంబుచే నైన నేమి యితరకారణంబులచే నైన నేమి ప్రజాసంఘంబులం దశాంతి పెచ్చు పెరిగి యది యీ విశాలరాజ్యైకత్వమునకు భంగము గలిగించి "గురిజాలరాజ్యము — మాచెర్లరాజ్యము" నను రెండు చీలికలగునట్లు చేయుటకుఁ బాల్పడుటచే వీరియందు రాష్ట్రేతరులకును నించుక యలక్ష్యము గలిగించిన దని ప్రాజ్ఞులు గ్రహింపవలెను. పరనిందాస్తుతులకు దాసులు కాకుండ ధర్మ రూపణమే కర్తవ్యముగాఁ గలిగిన రాయబారులఁ జూచి — కఠినంబైనను సత్యంబుద్ఘాటించునప్పుడు పెద్ద లాగ్రహింపకుందురుగాక. అన్యోన్యానురాగలతికలచేఁ బెనచివేయం బడి యైకమత్యంబుచే జీవనంబుసేయు రాజకుటుంబములోనే మతసంఘర్షణంబులు గలిగి దేశంబున నవి ప్రతిధ్వనించి రెండుమతంబులలోని యుద్రేకపూరితులగు యువజనులను భూమికృషి చేతిపనులు నను నున్నతోద్యోగంబులనుండి చాలవఱకు మరలించి యనావశ్యకాందోళనంబులో మునిఁగించి దేశసంపద కనర్థంబు గలిగించెను. దీనికిఁ గారణ మెవ్వరైన నేమి వారు భరతమాత యెడ మిగుల నక్రమముగాఁ బ్రవర్తించి నారని స్థిరీకరించుచున్నాను. పాలితులకు ధర్మబోధనము గావింపవలసిన 'రాజకుటుంబము లోని యన్నదమ్ములే యుద్ధంబు నకుఁ గదలి వచ్చి సంకులతమంబుగాఁ బోరు సల్పునప్పుడు రాష్ట్రప్రజలలో మాత్రము సౌభ్రాత్రాదిసద్గుణాంబు లెక్కడ నుండి వచ్చును? అంతియ కాక యిట్టి యుద్ధంబులచే జననాశనము క్షామము ప్రజానాశనకరంబు లగు నంటుజాడ్యములు మొదలగునవెన్నియో సంభవించు నని యెఱింగియుండియు గురిజాల వారును మాచెరల వారును నిట్లు నింద్యంబులగు యుద్ధసన్నాహంబులు గావించుట బుద్ధిమంతుల కసహ్యంబుగ నున్నదని నిర్విశంకంబుగా గ్రహింపుఁడు. ఈ మూఁడు పూటల నుండియు నీ విషయంబులు వారికెఱుపుటఁ గూడ నివేదించి నా యారాటము మీ సన్నిధిఁ దెలిపికొని యెట్టులైనను సంధి కుపక్రమించునట్లు ప్రోత్సహించుటకై యేతెంచితిని. మొగమోటములేకుండ మాచెర్ల రాజ్యము మల్లదేవుల కిచ్చివేయుట సంభావ్యమనియు నవశ్యాచరణీయ మనియుఁ బల్కి వచ్చి

తిని. మీలో మీకుఁ బరస్పరవివాదంబులు గలిగి యే పాపపుణ్యంబు లెఱుంగక నోరు లేని మోటు పశువు లనం దగిన యీ సైనికులఁ దెచ్చి మీ ప్రయోజనంబు కొఱకు — వారిని యుద్ధంబున బలి దీయుచు నిట్లు భూతహింస గావించుట మీ వంటి వారికిఁ దగునా యని సందేహించుచున్నాను.

—‡ కన్నమదాసు ‡—

ఇది యనాదిగ వచ్చుచున్న యాచారమే కాని క్రొత్తది గాదు. కాని ధర్మబోధంబు గావించు రాయబారినే హత్య గావించిన వారి నింకే మన వలెనో తెలియకున్నది!

—‡ కోటకేతుఁడు ‡—

మీ రలరాజు మరణంబు గూర్చి యెత్తి పొడుచుచున్నారని యెఱుంగుదును. ఈ సందర్భంబున దమ కంత చెప్పఁ గలవాఁడను గాను. మఱియు

కడవఁబడువాని ద్రవ్యటల్ కానిపనులు
ప్రస్తుతోద్బోధవిషయంబె భావవీధి
మలయుచుండుట మేలని మనవిసేతు
సర్వ మెఱిగిన శాంతభూషణులు మీరు.

—‡ కన్నమదాసు ‡—

శాంతభూషణులము కావున నెన్ని దుండగంబులవా రొనరించుచున్నను నోరు మూసికొని యుండవలయుఁ గాఁబోలు.

—‡ కోటకేతుఁడు ‡—

నే నట్లనలేదు. జరగిన దేమో జరగినది. ఇఁకనైనను సంధి మేలని నా యాశయము.

రాయబారంబు సఫలము కర్గమున నున్న
వడుచు సాహసంపు టలరాజు వడె నటంచుఁ
గినిసి యేతెంచి కడిమితోఁ దెనఁగి నార
లరయ నిఁకనైన సంధి శ్రేయస్కరంబు.

బాహాబాహి కచాకచిం దొడరుచుం
బాణాసనస్యోన్యశౌ
ర్యాహంకార తరుప్రకాండముల నూ
టాడించి యున్నారు; చా
లాహా! మీ రణసాహసంబు ప్రక
టం బయ్యెం బ్రపంచంబునన్
స్నేహం బూని సుఖింపఁగయ్య స్వజన
క్షేమాభిలాషంబునన్.

పూర్వ మన్నదమ్ములయిన కౌరవపాండవులలో యుద్ధ మేమాత్రము శ్లాఘనీయంబుగా నున్నది! యుద్ధంబున సోదరుల నెల్లరను రూపుమాపి "నా" యను వా రెవ్వరును లేక పాండవు లేపాటి సౌఖ్య మనుభవించిరి?

అలరాజెగ్గుఁ బురస్కరించుకొని, కా
ర్యంపూడి యందన్నద
మ్ములు పోరాడి కదా — యశస్సు గొనఁగా
బుద్ధిన్ మనోవాంఛ మీ
విలసద్వంశపుఁ బాలకుండ విషమున్
వేయింతురే బ్రహ్మనా
దుల బుద్ధిప్రతిభల్ మఱుంగు వడె నే
దుష్కాలకర్మంబులన్.

కడఁగి యొకవేళఁ బోరాడఁ గలిగియున్న
శాత్రవుల — కాదు బంధులఁ జంపుకొంద్రు
పైన రాజ్యంబు లనుభవభాజనములె?
పాండవులపాటి సౌఖ్యముల్ వడుట కితవె?

—‡ మల్లదేవుఁడు ‡—

అసలు సంగతిఁ గూర్చి కొంచె మెత్తి యుం

తటితో విరమించినారు. వారు రాజ్యమిత్తురో లేదో స్పష్టముగాఁ దెలియుట లేదు.

—◆ కన్నమదాసు ◆—

అది మన మనుగు లెందులకు? సంధిప్రేరణ మెప్పుడు కలిగెనో యప్పుడే రాజ్యమిచ్చు నిర్బంధంబుండు గదా. అట్లు కానిచోఁ రక్తమాంసాదులతో యుద్ధకాళికాపూజ నిశ్శంకంబుగా నవరింప వచ్చును. మన కా భయ మవసరము లేదు.

—* బాలచంద్రుఁడు *—

రాజ్యంబు మాటయటుండ నిండు. శౌర్యశ్రేష్ఠుం డనిపించుకొనిన యలరాజును హత్య గావించిన ఘాతుకుల నూరక విడిచి పెత్తురా! అంత ఘనత వహించి వృద్ధికాముండైన యల్లుఁడగు నలరాజు చావున కింతయు విచారము నూపని వారి నేమనవలెనో యెఱుఁగకున్నాను.

—† కోటకేతుఁడు —

పాప మట్లనవలదు. అలరాజు చావునకై రాజుగా రెంతయు జింతించుచున్నారు.

చనిన యలరాజు నల్గామజనవిభునకు
"పంచప్రాణాలు" విడిచెడు బాంధవుండు
ముమ్మరంబైన చింతాబ్ధి మునిఁగె నతఁడు
కాని దుర్విధి కెదురీఁదఁ గలరె జనులు.

వీరులారా! నే నొక్కటి మనవి సేసెదను. చిత్తగింపుఁడు.

రక్తబలిప్రాప్త రాజ్యభాగము కంటె
ఘనులకుఁ జిరికెంబె గౌరవంబు
మొదటఁ గా దనినను బోరు నిల్పిన మీకు
రాజ్యంబొసంగు భారంబు నాది

చలమూని వరపింగు తలఁ బట్టి నఱికిన
మన కింక నలరాజు మనికిరాఁడు
కయ్యంబు పగ హెచ్చఁ గారణంబగుఁ జెండి
పగకు సంధి మనస్సు తగిన మందు
స్నేహహస్తంబు రాజకంఠీరవుండు
చాఁచ గలఁడు మీ శీతలస్పర్శమునను
వారిపైఁ బ్రేమ కాకున్న వచ్చియున్న
ప్రాణికోటికిఁ బెట్టుఁడు ప్రాణభిక్ష.

మఱియును

దుర్బలుఁడు కత్తిచేత శత్రువుల నోర్వఁ
జెలిమి నొవరించి లోఁగొను బలయుతుండు
పోటు పొడుచుట ప్రాజ్ఞుల మాట గాదు
రణము ఫలితంబు రాజ్యసంగ్రహము కాదు.

ఎన్ని కష్టంబు లనుభవించియైనను గడకు వా రెన్ని నిరోధంబు లేర్పఱచినను సహించి యహింసాసిద్ధాంతమును బైకెత్తి ప్రజామార్గదర్శకులు గావలెనని నీతికోవిదులగు బ్రహ్మనాదుల నభ్యర్థించుచున్నాను.

—* బ్రహ్మనాయఁడు *—

(లేచి) వీరులారా! గురిజాల ప్రభువులతో మాచెర్ల రాజ్యప్రదానంబుగూర్చి మాటాడి యొప్పించి మన సన్నిధికి వచ్చి యనవసరంబుగాఁ గయ్యంబు పెంచుకొనుట కూడని పని యనియు నీ రెండు పక్షంబుల వారును నైకమత్యంబున మెలంగుట శ్రేయోదాయక మనియు నింతిగాఁ జెప్పుచున్న ధరణికోటయువరాజుగారైన కోటకేతు ప్రభువులకు వీరుల పక్షంబున హృదయపూర్వకనమస్కారంబు లొనర్చుచున్నాను. వారు గావించిన హితబోధ మవశ్యము పరిగ్రాహ్య మనుటకు సంది

యము లేదు అశ్రుతపూర్వంబును నదృష్టపూర్వం
బును నైన పరిజ్ఞానధురంధరత్వముగల నాగమ్మగారి
చేతులలో మన మెన్ని యిబ్బందులు పడినను గడ
కైనను వారు స్నేహహస్తంబు సాచుచున్నప్పుడు
పరిగ్రహింపకుండుట సాధువర్తనుల లక్షణము కాదే
మో యని శంకించుచున్నాను. కోపము తాత్కా
లికమై క్షణభంగురమై యుండవలెం గాని దీర్ఘమై
యవినశ్వరమై యుండుట ధర్మవేత్తలగు వారికిం దగ
దను విషయము పెద్దలందఱును సంగీకరించినదియే
యని నేను మీకుం జెప్ప నక్కఱలేదు. పరిస్థితులు
విషమించియో పూర్వహృదయంబు పరిణామంబు
నొందియో నాయకురాలు వచ్చి — మన మొందు
కొఱకింత దూరము వచ్చి యుద్ధం బొనర్ప నిశ్చ
యించుకొంటిమో యా రాజ్యము మఱల మన
కిచ్చి సంధి సేయం గోరినప్పుడు మన మింకను బిగిం
చుట తగునా? పూర్వ మన్ని దుష్కార్యములు సే
సిన నాయకురాలి నూరక పోనిచ్చుట సమంజసము
గాదని మీ రూహింపవలదని ప్రార్థించుచున్నాను.
అలరాజు పగం దీర్చుటకై యుద్ధ మొనర్చినను
జయమో పరాజయమో యెవ్వండెఱుంగును? పరా
జయ మగునో రాజ్యంబు గూడం బోవును గదా.

మా చెరల రాజ్య మిత్తుము మరలం డనుచుం
బ్రార్థన మొనర్చె నాయకురాలు నేఁడు
జయపరాజయవిపులగర్జనము లేల
గతము మఱవంగ వలె సంధికార్యమునకు.

మఱియు

అయినది యేమో యైనది మ
హామతిమంతుఁడు నల్లగామ భూ
దయితుని ముద్దుటల్లుఁడు ని
తాంతయశుం డలరాజు పూవలె
వయసున ద్రుంగి యుంట వల
వారికిం గూడ విచార మంట ని
శ్చయముని నమ్మికై కొనుఁడు
చాఁచిన చల్లని స్నేహహస్తముల్.

ప్రజాభిప్రాయము మెల్లుండిం గలదా యని వి
చారించి నడచుకొనుటయే వీరులకు నేను విశేషము
గాం జెప్ప నక్కఱ లేదు.

ఏదెటులున్న లోకమున
కేనియు జంకంగంబోలు రాజ్య సం
పాదన మబ్బుచుండినను
బాము పగం గొని నిర్మలస్వభా
వోదిత సేనలం జదుపు
చుండిన లోకము మెచ్చునే? ప్రజా
వాదభరానుసారిపరి
పాలనబుద్ధులు మీ రెఱుంగరే.

నాకుం దోంచిన విషయముం జెప్పినాను. త
ఱువాత వీరుల యిష్టము. అధికసంఖ్యులచే నిర్ణ
యింపంబడు నెట్టి తీర్మానమైనను నేను నంగీకరిం
తును గాని త్రోసివేయను నని చెప్పుచున్నాను.

— మల్లదేవుఁడు —

నాయకుఁడుగారు దమ యభిప్రాయమును వెలి
బుచ్చినారు. ఇతరులు గూడ నెవరికిం దోంచినట్లు
వారు వ్యక్తీకరింపవచ్చును.

— బ్రహ్మనాయఁడు —

ఇట్టి మహానిర్ణయము గావించునప్పుడు ప్ర
త్యేకవ్యక్తుల గొప్పఁదనంబులం బరికింపరా దని హె
చ్చరించుచున్నాను. ఎవరి యంతరాత్మ ప్రకార
ము వారు మాటాడవచ్చును.

— కన్నమదాసు —

(లేచి తనలో) మన వీరులలోం గొందఱ
కును సాయము వచ్చిన వారిలోం బెద్దలగు వారికిని
దండ్రిగా రాడిన పల్కులు మిక్కిలిగా రుచించి

నట్లు వారి ముఖవికాసములు శిరఃకంపములు గూడి పఱచుచున్నవి. కానిమ్ము నాకుఁ దోఁచినది నే జెప్పెదను. (ప్రకా) వీరవరులారా! వాక్చతురులైన కోటకేతుప్రభువు గారి వలెనే మా తండ్రిగారగు బ్రహ్మనాయఁడు గారును సంధివిషయంబు పంజొలిచి చేతఁ బెట్టినట్లు విశదీకరించియున్నారు. ఆ నాఁడన్యాయప్రధానంబైన కోడిపోరులో నొక కట్టుబోతు సాయంబున మమ్ముల నోడించి వనవాసంబున కంపఁగా నా బాలవృద్ధంబుగాఁ గానల పాలయిపోయి — ఒక యేడు గాదు — యేడేండ్లు భాషాతీతంబు లయిన కష్టంబులం దుష్గుడుచుచున్నను దయ కొంచెమైనను లేక పాపభీతి యంతకు ముందే లేక భిల్లులం బంపి పశుహరణము మొదలగు దుష్కార్యంబు లాచరింపించి తుదకైనను మా రాజ్యము మాకీయక యేడిపించి యె[illegible]ళ్ళు చేసి రాయబారిగా వచ్చిన యలరాజును హత్య గావించుటకుఁ గూడఁ బాల్పడిన దుర్మార్గు లింకను జీవించియుండుట యీ వీరుల మగతనంబునకుఁ గళంకముఁ దెచ్చుచున్న దని నమ్ముఁడు. మన సంగతి యెట్లున్నను లోకము కొఱకైనను నా దుస్స్వభావుల రూపుమాపుట న్యాయ మని యభిప్రాయపడుచున్నాను. అది కాకపోయినను నీ సంధి వలన వారు మనకుఁ బ్రత్యేకముగాఁ గావించిన మేలేమున్నది? మన మాచెర్ల రాజ్యము మన కిచ్చుచున్నారు అంతియే కద. వీరి దుశ్చేష్టల వలననే కదా మన పశువులకు రక్షకుఁడైన లంకన్నను, రాయబారి యయిన యలరాజును జంపుకొంటిమి. ఈదుండగముల కేమి ప్రాయశ్చిత్తము వారు విధించుకొందురు? అదిగాక, యొకవేళ నెట్టి నిరోధంబులఁ గలిగించుచున్నను సహింపసిద్ధాం తనిర్వహణము కొఱకు సంధిఁ జేసికొనవలె రాయబారి యగు కోటకేతుప్రభువు గారు బో చుచున్నారు. సంధిసూత్రములలో మతప్రచా నిరోధకములగు సూత్రము లెవ్వియైనను ను వేమో యింకను బయలుపడలేదు. ఎన్ని తీపిమా టలు పలికినను వారికిఁ దగిన ప్రాయశ్చిత్త కానిదే సంధివాంఛనీయము కాదని నా నిశ యాభిప్రాయము.

—* బాలచంద్రుఁడు *—

(లేచి) మహాశయులారా! పిన్నవాఁడన త్రోసివుచ్చక నా మనవిని గొంతవడి వినవలె సభాసదుల నందఱఁ గేల్మోడ్పులతోఁ బ్రార్థించు చున్నాను. మంచిచెడ్డల నారయునెడఁ జిన్నపె లను విషయం బవిచార్యంబు. మీలోఁ గొ దఱు మహాకేదారక్షేత్రంబు నందిలి దృఢాభిప్రా యంబు లను మొక్కలు నాయీచెప్పుమాటలు లుగాఁ బరిణమింపవచ్చును. అకారణంబు నన్ను దూషింపం జనదు. ఈ సందర్భమున నా యభిప్రాయంబులు నేను విశదీకరించుట తప్పు గాదు. ద్యూతసభామధ్యంబున దుర్యోధనా దులకు ధర్మోపదేశం బొనర్చు వికర్ణుని వలెను దండ్రి యెదుట హరిగుణకీర్తనంబు గావించు నీతి గలపు ప్రహ్లాదుని వలెను నేను మీ యందఱ సముఖంబున నిల్వఁబడి మిక్కిలి సాహసముతో మీరీ రాయబారి మధురవచనంబు లాకర్ణింప వలదని ప్రబోధించుచున్నాను. నేఁటి యుదయము నఱుకు జాజ్వల్యమానంబై యుండిన మీ యుత్సాహాగ్నికిఁ గోటకేతుప్రభువుల రాయబారంపుఁబలుకు లార్ద్రకాష్ఠంబు లయినవి కాని నిజ మాలోచించినయెడ నాబోంట్ల కందఱకు నవి యెం

డిన చిదుగులై దాని నుద్రేకింపఁ జేయుచున్నవి. వీరపుంగవులారా! నా మాటలు మీకుఁ బరిహాసాస్పదములుగా నుండునేమో కాని మిమ్ముల జూచిన నాకు యథార్థంబుగా జాలి కలుగుచున్నది. నిశ్చయముగా హృదయము మాఱియే నాయకురాలు సంధికి దిగుచున్న దనుకొనుచున్నారా?

అందిన జుట్టు లేనియెడ
నంఘ్రులు వాయకు గాలి సుట్టుః నై
తం దగి పోరు శక్తి సమ
రీతి నెసంగిన; గాని మీరు మ
ధ్యందినచండభానునికి
తాతచతుర్భ్యభుజాబలంబు మా
నం దెరలింప లేక కసి
పట్టి విరోధుల మైత్రిఁ గోరెదిర్.

మిక్కిన మార్పు గల్గఁగ న
పూర్వముగా జగజంత గౌరవం
బెక్కఁ బరస్పరప్రియస
మీహితసంధికి లొంగునో క్కా? యా
టక్కరిమాట లెల్లఁ గుల
టాపతిభక్తిసుభాషితంబు లే
చిక్కులఁ బెట్టఁగా మఱలఁ
జెల్మికిఁ బూనెనో వమ్మవచ్చునే.

మఱియు

వేశానాశకుఁ శస్త్రధారత రణ
క్షేత్రాబ్ధిలో మండి శా
పావిష్టాతుని గోటకేతు నవాపర్
సంధింతు రేకో సంగరం
బే నింకర్ విగమ్మించుఁ బోరుటకు నా
శేమాతృముం గాదు; మీ
కావర్ చేరము నైచి ప్రోవు మని పా
దస్వాంద్వముం బట్టె యా

యయ్యో! నా చిత్తము గద్దెఁ దిన్నది; సమ
జ్యానీవ పాఘంత గా
జానీకాదులు పొత్తు లౌదురు భువి
వ్యాకారాలము దెంతయున్
జ్ఞానం బూని చరించు దానను గ్రహ
జ్ఞత్వంబుతో నుండు" నం
చేవిర్ నమ్మక మిమ్ము వో విరఁగ మే
లీ సంధి సూత్రంబులర్.

— కోటకేతుఁడు —

మీ రాజ్యము మీ కిచ్చుచున్నను నిట్టి విషమనియమములఁ గోరుట పాడిగాదు.

— బాలచంద్రుఁడు —

"రాజ్య మిచ్చుచున్నాము. రాజ్య మిచ్చుచున్నా" మనుచున్నారు! రాజ్య మూరక యిచ్చుచున్నారా?

రణము బాధను బడలేక రాజ్యమిత్తు
రంతియే కద — కోడెప్రాయంపుఁబిడుగు
పరిపాయంకరు నలరాజు నణఁచినార
లింత కింత ప్రాయశ్చిత్త మేది చెపుడి.

—* బ్రహ్మనాయఁడు *—

అందుకొఱకా యుద్ధంబు సాగించి యీ సేనాసమూహంబును హతము గావించుట! ప్రాజ్ఞు లొప్పుదురా? మన వీరులలోఁ గూడఁ జాల మంది యీ మాట లొప్పుకొందు రని నే ననుకొనను.

(తెరలో నొకరు) నిశ్చయము.

— బాలచంద్రుఁడు —

అవును. పెద్ద లిట్లు ప్రోత్సహించుచుండ వారేల యొప్పుకొందురు? మన యలరాజును

పుద మన్నన్ మనకేకొ యంత ; యెటులేఁ
బోరన్ సమీపించి తా
నెదురం గాయము పుండు సేసి విడుతున్
హేలన్ వినుం డామెక
ర్యాదయం బూన్పుచు రాయబారికి విసం
బుం బెట్టు నా కుటిలి కా
స్పదమై యుంకించిన నర్సరాజును — బరి
క్రంసన్మదో దేకశౌ
ర్యదురంతస్థిరధైర్యబాహుబలులా
రా! దుష్ప్రలాపంబు గా
విది నల్గాముని గుండె గాలమయి నే
నెట్లే నృసింహాధిపున్
మదహాస్తిన్ బరి రీతిఁ బైఁబడి విసి శుం
భద్ధస్తశాతాసిచేఁ
గదనస్థో ణిజనంబు తల్లడపడన్
ఖండింతు శీర్షంబు నా
దిదియే నుండి ప్రతిజ్ఞ ; చెప్పెదను నే
నీనాఁడుఁ బాలింతు న
య్యాది బ్రహ్మాదులు వచ్చి యడ్డయిన మా
ద్యత్ఖడ్గవిక్షేపమా
ర్గప్రశాస్త్రప్రభధైర్యకంపముకుఁడనై
దర్పించి పోరాడ నే
ర్చెద ; వెన్కాడుట లేదు ; నే నొకఁడనే
చెండాడఁగా నేర్తు వాఁ
డుని భంగిన్ శిబిరంబులం దొదిగి పో
టుం జూప కెట్లుండుటా?
మది కారాటము లేదె? యిం దిసువులన్
బ్రగ్గించి దోర్దర్ప సం
పదఁ జూపించి జనాళి మెప్పుఁ గొనరే!
పల్నాటి వీర్యంబు చం
పుదురే? పౌరుషహీనులార! యిటు మి
మ్ముం బాసి నే నొంటినై
న దురంబందుఁ బ్రతిజ్ఞఁ దీర్చికొన బ్రా
ణంబైన నర్పించెదన్.

(కూర్చుండును)

(తెరలోఁ జాలమంది చప్పటులు సలుపుదురు.)

—* బాలచంద్రుఁడు *—

మొదటఁ దమ యుపన్యాసములో నెట్టి నిరోధముల కైనను సహించి యీ సంధి కొప్పు కొనుఁ డని రాయబారిగారు హెచ్చరించినారు. అవి మతప్రచారనిరోధము లేమో? అవిగూడ సంధిసూత్రములలో నివే?

—‡ కోటకేతుఁడు ‡—

సంధి యెంత మాత్ర మిష్టము లేని వారి కా సూత్రముల మాట యెందుకు లెండు.

—† బ్రహ్మనాయుఁడు †—

అవును. నేను గూడ మఱచినాను. మాచెర్ల రాజ్యము మా కిచ్చుచ యొప్పుకొనుచు నిం కేవయిన వారు చెప్పిరేమో తెలిసికొనవలెనని యున్నది.

—♦ కోటకేతుఁడు ♦—

మీరు మాచెర్ల రాజ్యము తీసికొనుట యును, నందుకు బదులుగా నాల్గు సంవత్సరములు మీరు పంచమాస్పృశ్యతానిరోధక ప్రచారమును మానుకొనుట యొడంబడుటయు సంధిసూత్రము లలో ముఖ్యమైనవిగా నుండవలె నని నాగమ్మ గారి యూహగా నున్నది. ఆమెను గూడఁ గొంత వఱకుఁ గ్రిందికి దింపవచ్చును. నా కాధైర్యము గలదు. రెండు పక్షంబులవారును దమ పట్టుదలలు సడలువిడిచిన గాని సంధి పొసఁగదు గదా. అయి నను నా విషయ మేల — రాజ్య మిచ్చినను సంధి యక్కఱలే దనుచున్నారు గదా.

—♦ బ్రహ్మనాయుఁడు ♦—

ఏమీ! మాలమాదిగల యభివృద్ధికై చేయు ప్రచారమును మేము మానుకొనవలెనుగా! ఎంతమాట! ఈ మాచెర్లరాజ్యము మాకిచ్చినను

సరియే. లేకున్నను సరియే. చిరకాలము ప్రజాహితాజీవనంబునం దుండి నిమ్నజాత్యుద్ధరణప్రచారము చే లోకోద్ధరణంబును దానిచే నాత్మోద్ధరణంబును గావించుచున్న మా పవిత్రకార్యంబుల కడ్డు గలుగునట్టి సంధికి మేము బద్ధులము కామని వారు స్పష్టముగా ముందే యెఱింగియుండుట మేలు. రాజ్యానుభవమునం దైనను గొంత లోటు గల్గిన నొప్పికొందుము గాని మాలమాదిగల నుద్ధరించు ప్రయత్నంబులందు మాత్ర మెవ్వ రడ్డుపడినను నోర్వఁజాలము.

—‡ మల్లదేవుఁడు ‡—

నాయుఁడు గారితో నేను బూర్ణముగ నేకీభవించుచున్నాను.

—* కోటకేతుఁడు *—

రాయబారంబున కేమని ప్రత్యుత్తర మిచ్చెదరు?

—‡ మల్లదేవుఁడు ‡—

నిమ్నజాత్యుద్ధరణప్రచారము నొక దినమైనను నాపక యహరహము యథాపూర్వము దాని యందే నిమగ్నులము కాఁదలంచితి మని చెప్పవచ్చును. వారి కంగీకారమైన మాచెర్లరాజ్య మిచ్చినచో మిగిలిన వీరుల నొప్పించుటకుఁ బ్రయత్నముఁ జేయుదుము. లేకున్న యెడల యుద్ధమే రాజ్యవిషయంబును బరిష్కరింపఁగలదు.

—‡ కోటకేతుఁడు ‡—

(లేచి) సంధి మీ రంగీకరింపకుండుటచే నీ కారంపూడి యుద్ధ మెందఱ వీరోత్తంసుల బలి దీయునో తెలియదు. అన్నిటికిని భగవంతుఁ డున్నాఁడు. పోయి వచ్చెదను. నమస్కారము.

(బ్రహ్మనాయనితోఁ గోటకేతుఁడు నిష్క్రమించును)

తెరపడును.)

## దృశ్యము. 23
### రామశాస్త్రి ప్రవేశము.

—‡ రామశాస్త్రి ‡—

బ్రాహ్మణజన్మ మెత్తి పురోహితకర్మలందుఁ గాలముఁ గడపు నేను బ్రహ్మనాయుఁడు గారి మాట నిరాకరింపలేక పంచాంగముఁ జెప్పుటకు గారంపూడి వచ్చినందులకు మనస్సు సహజబ్రాహ్మణశాంతగుణంబుల నీసడించి యుద్ధభూమిం దుముకు నంత యుద్వేగంబున నవశం బగుచున్నది. ఆహా! ఏమి యుద్ధము! ఈ కారంపూడి యుద్ధము నందుఁ బల్నాటి వీరులు ప్రదర్శించుచున్న యపారపౌరుషప్రతాపప్రదర్శన విజృంభణంబుల వృత్తాంతంబు లాకల్పాంతస్థాయులై కాలాంతరములచే మాసిపోవుచుండఁగల మా తెనుగుబిడ్డల మగతనంబుల నప్పటప్పటికి మఱల మఱలఁ జివురు వెట్టించుచుండును గాక. మతవిషయంబున రెండు పక్షంబుల వారును సడలువిడువకుంటచేఁ గోటకేతుని రాయబారంబు విఫలంబై యుద్ధము రెండు దినంబులు సాగి తృతీయదినంబు గడచుచున్నది. మన పక్షంబు నందలి వీరులలో నొక్కండగు గోవిందుల బాపినీఁడు ధరణికోటాధీశ్వరుండయిన భీమదేవునితోడఁ బోరి యాతని మూర్ఛాక్రాంతుం జేసి యనంతరము కోటకేతువు హస్తలాఘవంబున కాగలేక లోకబాంధవునితోఁ బాటపమించుటయు, నా నైపు మాదిగుల వీరారెడ్డి మన పినమల్లదేవుని నిహతుం జేయుటయుఁ జూడఁ గొంచెము హృదయంబునకుఁ బరితాపంబు గలిగినది కాని బ్రహ్మనాయని యొక్కయు బాలచంద్రుని యొక్కయు నకుటిలవీర్యవిహారంబును నేత్రోత్సవంబుగాఁ బొడఁగనినప్పుడు తన్మయత్వంబున

మానిఁగిపోయితిని. బ్రహ్మనాయఁడు రథస్థుండై కోదండంబు చేత ధరించి సపత్నవాహినీకదంబంబుల దృష్టివిక్షేపమాత్రభయకంపితులం జేయుచుఁ బరిత్యాగలీఢపాదుండై వియోగుల మానసంబులఁ జొచ్చు పంచబాణుని తెఱంగున బాణం బరిపోసి సత్త్వవిభావోపభావంబులు వోలె వెలువడుచుండు భల్లంబులఁ గుప్పవగూరగాఁ బఱపుచు హాహాకారనాదంబులు సలుపు రిపుల మొఱ్ఱల నాలకించుచు హృదయకూలంకషంబైన కరుణారసంపు వెల్లువను దాత్కాలికముగాఁ దెచ్చిపెట్టినట్టి నాతిన్యంబున నణఁగఁజేయుచు శిరంబులఁ ద్రెవ్వవేయుచు శిరోజంబుల నుప్పరంబున కెగయఁ గొట్టుచు జిహ్వాగ్రంబుల నుండి యసృగ్ధారాసంపాతంబులొలికించుచు హస్తపాదంబులలో నొక్కటొక్కటి ఖండించి వికృతాకారంబు సేకూర్చుచుఁ గళేబరంబుల నొక్కమ్మడిఁ గూల్చుచు నానావిధ భీషణసమరక్రీడాలోలుండై పగవారి మూకలఁ గ్రుశీభూతంబులు గావించుచుఁ జెచ్చెరేఁగి యుండుట చూడని వాని జన్మమేల! మఱియుఁ దండ్రికి దీటగుచు విరోధిప్రతిఘటనంబు లనెడి తాళచ్ఛద కుటీరంబులఁ బరశురామప్రీతి సేసిన బాలచంద్రుని శౌర్యాగ్ని వర్ణింప నెవరు సాహసింపఁగలరు? పిన ముద్దెపురి జంపిన సంతసంబున బోవుచున్న నూతుల వీరారెడ్డిని బిలిచి బాలుఁడు తలపడి వానిని వధం బొనరించిన విధంబు జ్ఞప్తికి వచ్చి నా హృదయము భయభ్రాంతం బగుచున్నది. అంతియ కాక మన వైపు వీరులగు కన్నమనాయఁడు, ముత్తసాని పిచ్చిరెడ్డి, నర్మాల కోటిలింగము, పైడి మక్కల ముత్యాలు మున్నగు వారందఱు నాయా ప్రదేశంబులఁ గోలంకి పీరాస్వామి, పాలపర్తి రామానాయఁడు, పొదిలెపాపన్న, కారంపూడి కనకరాజు, కలవగుంట కాశీపతి మొదలగు వీరుల తోఁ బోరిన క్రమంబు గూడ నాశ్చర్యపాదకమై యున్నది. ఆహా! యుద్ధమెంత భీత్యావహము! (కొంచెముండి) సరే, నే నింక నాయఁడుగారి యాజ్ఞ చొప్పున, నలరాజు తండ్రియును బుత్రశోకంబున గృశించి మంచ మెక్కినను యుద్ధవార్తల నెప్పటి కప్పుడు విని నా రాలుగాఁ వచ్చియున్న కొమ్మరాజు గారి కడకుఁ బోయి యీ యుద్ధవిషయంబులు నివేదించి పోయెదను. నేఁటి తోఁ జేనే యుద్ధము ముగియునచ్చు ననీ పెద్ద లనుకొనుచున్నారు. ఇంక కొంచెము సేపటికి గాల చంద్రుండు నాయకురాలి పైకిని బ్రతిజ్ఞానిర్వాహణము కొఱకు నరసింగరాజు పైకిని బోవునని యనుచున్నారు. నా పని నెఱవేర్చుకొని త్వరగా యుద్ధభూమికిం బోయెదఁగాక.

(నిష్క్రాం)

దృశ్యము 24
కారంపూడి యుద్ధభూమి.
బ్రహ్మనాయఁడు ప్రవేశము.

—† బ్రహ్మనాయఁడు †—

గురిజాలగుండి మాచెర్ల రాజ్యము విభజింపఁ జేసికొని వెడలుటకును దెన్నఁడో కాని యీ మధ్యకాలంబున నెన్నఁడును యుద్ధస్పర్శంబంటని కారణంబున బ్రభవించిన యీ రణకండూతి నలగామసైన్యసంఘర్షణంబున నీ నాలుగు దినంబుల నుండియుఁ గొంతవఱకుఁ దీఱినదని చెప్పవచ్చును. ద్వారసముద్రమునుండి వచ్చిన యాశ్వికుల సంఖ్య మితిమీఱియుండుటచే నది

దాదాపు నిన్నటిదినం బంతయు నుచ్ఛ్వాసనిశ్వాసములకును దీటికి లేకుండఁ జేసి తమ యసాధారణంబైన బాకులపోటులచే నా మగంటిమి నెంతయుఁ బరీక్షించిన దని చెప్పవచ్చును. తొలుదొల్త వారి పోరాటపుఁదీవ్రతను మించిన సంఖ్యాబాహుళ్యమును జూచి [illegible]చుక వెఱఁగందితిని గాని మాచెర్ల చెన్నకేశవుని యనుగ్రహంబున ధైర్యం బినుమడింప సాహంకారంబుగా రేఁగి బాణకౌశలంబున వారి నెల్లరఁ గసిమసంగితిని గదా. తక్కుంగలవారి నీ నాఁడు కన్నమదాసునకును బాలచంద్రునికిని నొప్పగించివచ్చితిని గాని బాలుని దృష్టి నాయకురాలి పైకి నరసింగరాజు పైకిం బోవుచున్నది. నరసింగరాజుఁ జూచిన జాలి వొడముచున్నది.

బాలచంద్రుండు ప్రతిన దప్పని మగండు
పసితనంబున బెంచిన వాఁడ నగుట
నకట! నరసింగు కర్మ మెట్లగునో యంచుఁ
బరిపరివితంబుల మనస్సు పరితపించు.

ప్రతిజ్ఞాపరిపాలనాపేక్షతో సమరంబున దుమికిన వీరుని చర్యలఁ గూర్చి నిర్బంధించుట తగదు. యుద్ధంబున నే వీరుం డెట్లు పరాక్రమింపఁ దలఁచునో యట్లు పోనీయవలసినదియే కాని యడ్డు పడుట [illegible]గాదు. కానిమ్ము దైవమే కలఁడు.

(తెరలో)

ఘనబాహోరుబలస్ఫులింగములు జా
గ్రద్బాణవేగంబునన్
దనుకన్ నాయకురాలు గొల్మసఁగి బా
ధల్వెట్టుచున్నన్ భయం
బున బర్వెత్తఁగ వచ్చునే! యబలతోఁ
బోరాడఁగా లేరె? మా
ర్కొని చూపింపుఁడు సేనలార! సమర
ప్రోచ్చండధైర్యంబులన్.

(విని) ఓహో! సేనాని యెవ్వరో దళంబులకు ధైర్యంబు పుఁగొల్పుచున్నాఁడు. నాయకురాలావంక నుండి వచ్చి యీ మును ముం జెండాడఁ బ్రారంభించుచున్నట్లున్నది. ఎదురు వోయెదఁ గాక.

(నిష్క్ర.)

దృశ్యము 5

నాయకురాలు ప్రవేశము.

ఒక వైపు నుండి బ్రహ్మనాయఁడు ప్రవేశించును.

—† బ్రహ్మనాయఁడు †—

విష్ణుభక్తులు తిరుమంత్రవేత్త లీరు
ధైర్యవంతులు గద మాలదాసులార!
ఆఁడుదానికి వెఱవ సిగ్గైనలేదె
రండు చూతము నాయకురాలి బిగువు.

—§ నాయకురాలు §—

(విని) అదుగో! మగవాఁడు బ్రహ్మనాయఁడిటే పంచముల వెనుక వేసికొని వచ్చుచున్నాఁడు. కోడిపందెము నాఁడు దప్ప నీలోపుగ నేనెన్నఁ డీతని మొగంబును దగ్గఱగాఁ జూడలేదు. నేఁడు మంచి యవకాశము దొరకినది. ఈయనను నీయన వీరవైష్ణవమును బరుగులెత్తించెదఁ గాక. (ప్రకా —— నాయునితో) రండు. నాయుఁడు గారిని సమీపించి చాలకాలమైనది.

—♦ బ్రహ్మనాయఁడు ♦—

అవును. చాలకాలమైనది. ఈపరీతపరిస్థితులతో సమీపించుటకు మీచాలవయే కారణము.

—♦ నాయకురాలు ♦—

నా దేమున్నది? అంతయు స్వయంకృతాపరాధమే.

—† బ్రహ్మనాయఁడు †—

నిజమే. ఏడుసంవత్సరంబులు గడువు దాఁటఁగానే రాజ్యమాక్రమించుకొనక పోవుట స్వయంకృతాపరాధ మేమో?

—† నాయకురాలు †—

మీ రంత పోగరుబోతుదనమున రాజ్యంబున ప్రవేశించుట చూచి యూరకొనుటకు మేమేమి గాజుల్దొడిగించుకొని యుండలేదు గదా.

—* బ్రహ్మనాయఁడు *—

నిశ్చయమే. మీకు గాజులు లేవు.

పసితనమునందె తలవ్రాఁతఁ బద్మభవుఁడు
చేతిగాజులఁ దొలగింపఁజేయ మీరు
తొడిగితిరి నలగాము చేతులకు వాని
నాతనికి వచ్చె నెత్తికిఁ జేతు లిపుడు

—§ నాయకురాలు §—

నేనందుండి సర్వాధికారంబను నంకుశంబు వహించి యుండుట చేతనే పల్నాటి రాజ్యంబను మదపుటేనుఁగు వశీకృతమై యింతటి ప్రఖ్యాతికిఁ గారణంబై పరరాజుల కాదర్శపాత్రమై యున్నదని గ్రహింపుఁడు. భగవంతుఁ డానాఁడు నా వంటి దాని నొకతెను గద్దె నెక్కించి మతప్రతిష్ఠఁ గాపాడెఁ గాని లేని యెడల మున్ను మీ పరిపాలనము క్రింద నున్న మాచెర్లరాజ్యము వలె మా గురిజాలరాజ్యము గూడ "సర్వము జగన్నాథ" మై బ్రాహ్మణు లనియు మాల లనియు భేదములు లేకచెడిపోయెడిదే.

—§ బ్రహ్మనాయఁడు §—

నా చేతులలోనే గురిజాలరాజ్య మున్న యెడల నట్టిగొలఁది గొప్పభేదముల నంతరింపఁ జేసెడి వాఁడనే.

మానవు లందఱుఁ సరిస
మానులు పుట్టుకచేతఁ; గొందఱిన్
మానితరీతిఁ గొందఱను
మాలుగఁ జూచుట పాడిగాదు; లో
కానుభవంబు పంచముల
యందున దూష్యము; మాలమాదిగల్
దీనులు, వారి యుద్ధరణ
దీక్షయె కావలె రాచవారికిన్

పతితు లగు వారి నుద్ధరింపంగ వలయుఁ
గొలఁది గొప్పల భేదంబు గూడ దెపుడు
అర్థమునగాని తారతమ్యములు లేవు
వారి సేవించు సేవ యీశ్వరుని సేవ

మాలమాదిగలు గూడ మానవులని యెంచి వారి యార్థికదౌర్బల్యముఁ దొలఁగించి యింత కూడు వచ్చు నుపాయంబులు సేకూర్చి చదువు సంధ్యల కవకాశములు గల్గించిన యెడల వారు బ్రాహ్మణులకుఁ గూడఁ జూడామణులై ప్రకాశింతు రని నమ్ముఁడు.

—† నాయకురాలు †—

ఇట్టి యసత్కార్యములకుఁ బూనియుండుట చేతనే యనావశ్యకంబుగాఁ బాలవంటి మీ రేచర్ల వంశంబునకుఁ గళంకంబు గల్గించుకొనుటయే కాక మీ వైష్ణవమతంబులో నున్న వారికే

బ్రాహ్మణులగు వారికిఁ గొందఱకు మీరు సరిపడ కున్నారు.

—◆ బ్రహ్మనాయఁడు ◆—

అవును. లోకం బంతయు నెవ్వరు మెప్పింపఁ గలరు. సత్త్వగుణసంపన్నులయిన మహాత్ములకే విరోధులుండుట తటస్థించుచున్నది. ఇఁక నా వంటి వారికా? అయినను వైష్ణవులలోనే కొందఱు మమ్ములను మాపరిపాలనమును నిందించు వా రుండి రంటిరి కాని పరమతసహనంబున్న మా చెన్న రాజ్యంబులోని మీ శైవులే కొందఱు మీ గురిజాల పరిపాలనం బీసడించుచుఁ బంచమాస్పృశ్యతా ప్రచారవిషయంబున దప్ప మిగిలిన సర్వనియమము లందును సర్వపరిపాలన పద్ధతులందును బెదమల్లదేవ రాజచంద్రుని వేనోళ్లఁ బొగడి యున్నారు. దాని కేమనెదరు?

-† నాయకురాలు †-

(నవ్వుచు) ఆ నియమములు నా పద్ధతు లేవియో యొక్కింత దెలుపుఁడు. నే గూడ విని యెదను.

—† బ్రహ్మనాయఁడు †—

మీరు నూత్న వివాదములు విని యుండరా?

కూలినాలిజనంబుఁ బోషి యుందుమె కాని
రాజభోగంబు దూరంబు మాకుఁ
బ్రజకు వాక్స్వాతంత్ర్యవర మిచ్చితిమి కాని
బాహ్యాడంబరము మా వైపు లేదు
మమ్ము విమర్శించు మనుజు మన్నింతుము
కారాగృహవాసి కఁడండు
మద్యపానాసక్తి మాపింతుమే కాని
కల్లు ద్రాగించి మంకంబు గొనము
దృఢశరీరుల బిచ్చ మెత్తింప నీము
యాచన యొనర్చువాఁడు శిక్షార్హుఁ డగును
బడుగుప్రవృత్తిని మొదలంటఁ గెడపినాము
నమ్ము మీకు మాకుఁ బొంతనయె లేదు.

-† నాయకురాలు †-

నాయఁడుగారూ! వింటిమి. వింటిమి. మీ ప్రేలితో మీరే కన్ను బొడుచుకొనుచున్నారే! తిండికి లేక తపించు కుటుంబమును రక్షించుకొనుట కాడాడఁ దిరిగి బిచ్చమెత్తికొను బిచ్చగాండ్రను గూడ శిక్షించినామని చెప్పుకొనుచున్నారు. ఆహా! ఏమి మీ పరిపాలనప్రతిభావిశేషము! నాకడ్డు జెప్పితిరి చాలుఁ గాని మఱొక్క యెడ వాకొనకుఁడు. గేలి సేతురు.

—* బ్రహ్మనాయఁడు *—

పడుచుదనమున నుండి దాఢ్యవంతులయ్యును నది యొక వృత్తిగా నెంచుకొని బిచ్చ మెత్తువారు దంభులుగారని కించిద్జ్ఞుఁడైన ననఁగలఁడా? అట్టి వారికి బిచ్చంబు వెట్టుట మహాపాతకం బని యుదారబుద్ధి గల గృహస్థులు గ్రహింపవలయును. బలశరీరులకు ముష్టి వెట్టుట వారికి సోమరితనంబు నేర్పి సంఘముపై ననవసరమైన బరువు వేయుట తప్ప వేఱు గాదు. మిక్కిలిగా బలహీనులయిన కుంటి గ్రుడ్డి మొదలగు వారికిఁ బ్రభుత్వమే యుచితముగా భోజనము వెట్టి భగవద్ధ్యానాది సద్గుణంబు లలవడఁ జేయవలెను

-◆ నాయకురాలు ◆-

మీ పద్ధతు లేవి చూచినను లోకమున కపహాస్యములుగాఁ గన్పట్టుటయే కాక నింద్యంబు లని కూడ పొడచూపించుచున్నవి. ఇట్టి బుద్ధి వికాసము గల దుష్పరిపాలకులు పుట్టి ధర్మదేవతను గుమార్గంబులం ద్రిప్పి వంచించి జీవించుచుండఁగాఁ జూచుట మా వంటి ధర్మోద్ధారకుల కసహ్యకరంబుగా నున్నది. మీ జాతకములు మంచివి కాకపోవుట చేతనే యీ కారంపూడి యుద్ధము గలిగినది.

ఈ మహాసంగ్రామంబున మీ నాశనము మీ లోకోపద్రవకరపరిపాలననాశనము పరిసమాప్తి గావించి జయభేరి ప్రయోగించెదఁ గాక. మన ప్రసంగము లింతటితోఁ జాలును. రమ్ము. యుద్ధంబు సేయుదము.

(తెరలో)

ఒక పూర్ణ్మైనను జేతిలోఁ బడక యెం
దో చేరి మా పంచమా
శ్వికులన్ వైష్ణవవీరులన్ శివమతా
వేశంబుతో నీ యహం
దకటాహం బదరంగ ద్రొత్తు నని మా
టల్ గోట లెక్కించు నా
యకురా లెక్కడనుండెఁ జెప్పఁడు పుటం
బార్తున్ నిమేషంబునన్.

—॥ నాయకురాలు ॥—

పుల్లైవిస్తరాకు వలె నా గుంటఁడు బాలచంద్రుం డెంత మిడిసిపడుచున్నాఁడు. (బాలు నుద్దేశించి) ఓరీ! బాలుఁడా! నీ పిల్లదనపు దుడుకుదనము లింకఁ జాలింపుము. ఇదిగో ముందుగా మీ యయ్యకు బుద్ధిఁ జెప్పి యనంతరము నీ పయికి నురవడించెదను. (నాయునితో) ఏమి యాలోచించుచున్నావు! కొడుకు సాయంబు గూడఁ దీసికొని కాని నాతో యుద్ధ మొనర్పలేవా యేమి?

—॥ బ్రహ్మనాయఁడు ॥—

పరిసంగించుట మాత్రమే కాక స్త్రీలపై గవిసి యుద్ధంబు గూడ సేయు నంతటి దౌర్భాగ్యమునకు నన్ను బాల్పడు మందురా!

శుద్ధపౌరుషఘోరశౌర్యజాలను విడిచి
ఆఁడుదానిని బోరాడు వాఁడు గాఁడు
చండశాసనబిరుదభాస్వంతుఁ డయిన
మగలకు మగండు వెలమ బ్రహ్మనతాస్వి,

(స్వస్తి నభినయించి) ఛీ! నత్యసుతి కొంగ్రతినే (ఆలోచించి) ఆ-వ్ర-గా. అపగిపూర్ణులతో నివ లిట్టివే. (ప్రకా) నాగమ్మగారూ! ఇన్ని దినంబుల నుండియు మా యెడలఁ గాపంపబడిన దౌష్ట్యంబులచే మీతో నొకచేయిఁ జూడ వలె నని వచ్చియున్నను—యెంత మార్చుకొన్నను స్పష్టంబుగ నన్ను యీ యబలారూపము సూచి మజల మనస్సు వెనుకదుగువై చినవి. నే నాఁడువాండ్రతోఁ బోరఁ దలంపను. మిమ్ము యుద్ధంబున మార్కొన నా పుత్రుండు బాలుండు చాలును. అదుగో! అతఁడు గూడ నిటే వచ్చుచున్నాఁడు. మీ రిర్వురుఁ దలపడుఁడు. పోయి వచ్చెదను.

(నిష్క్ర)

—॥ నాయకురాలు ॥—

ఆహా! పైకి 'నబల' యని దూఱాడుచున్నను నా విస్ఫుటపౌరుషవిభవంబు గ్రహించుటచేఁ దూలిపోవుచున్న నాయుఁడు గారి మగఁటిమి ప్రశంసార్హము. హుమ్మ. తండ్రిగౌరవం బింత చక్కఁగా నున్నది. ఇఁకఁ గుమారుని పరితాపముఁ జూడవలెఁ గాఁబోలు.

పల్నాటిపౌరుషము.

— బాలచంద్రుడు —

(పూర్వపద్యము ... "ఒకపూటైన..." మరలఁ జదువుచుఁ బ్రవేశించును) (వినుట నభినయించి) ఏమీ— ఇంకను మందుమనకుఁ బొమ్మనుచున్నారా? మరదిది.

(సమీపించును)

— నాయకురాలు —

బాలుఁడేవో లేఁత సొరకాయలు దెగనఱకుచున్నాఁడే.

— బాలచంద్రుడు —

నాగమ్మా!

లేఁత సొరకాయ కోఁతలో, లేకయున్న
వెలమబిడ్డని బిరుసుమెక్కులపుజగియొ
బాలుఁడనోకో నీ పాలిఁటి కాలుఁడనోకో
పట్టిచూపెద రారమ్మ పుట్టకుంక.

— నాయకురాలు —

ఓసీ! బుడుతా! చిన్నపెద్దలను తారతమ్యంబు లేక యథేచ్ఛగఁ బేలుచుంటివి నీ నోటికిఁ దాళము వేయించెదను జూడుము. ఉచితజ్ఞత యెఱుంగని వాఁడవు నీవు పుట్టి యా బ్రహ్మనాయనికిఁ గూడ నపకీర్తిఁ దెచ్చుచున్నావు.

— బాలచంద్రుడు —

(నవ్వుచు)

మహాకష్టపరంపరామగ్నుఁ జేసి
కలఁచి చీకాకుపెట్టిన నెలఁత కెపుడు
బ్రహ్మనాయనిపైఁ బ్రేమ పట్టెఁ జెపుమ
చెడి బ్రతుకుదాని కుచితానుచితము లేల.

"పుట్టుకుంక" యని నందులకా యింత నీల్గుచున్నావు!

అవిషహ్యంబులు నీవు మాకిడిన క
ష్టానీకముల్ మంత్రిపీ
ఠ వశం బయ్యును వీధిపోకిరుల మా
ర్గంబోవు నీ కేల గా
రవరీతిం బిలుపుల్? నుకీలురకమ
ర్యాదల్; భవద్వ్యాప్తి కా
చివడం బోసితిఁ - బైన - బాలుఁడను - నా
చిత్యంబు నా కేటికిన్.

అయినను నంత మాయారచనాప్రవీణయై సాధువుల నల్లడతల్లడఁ బెట్టు కుతంత్రజ్ఞ నెంత యవమానించినను దోషంబు లేదు. ఒకవేళఁ దాము గూడ మంత్రిపీఠార్హులగుటచేత మా తండ్రిగారు నిన్ను గౌరవింపవచ్చునేమో కాని తెగబడి రణరంగంబున నపారశత్రుంబును బ్రదర్శించు యోధుల కీ యుచితానుచితజ్ఞత లక్కఱలేదు. అయినను — ఆ గౌరవము నీ వంటి చిలిపిగయ్యాళి యెడ్డఁ జూపుట కేవల మవివేకము.

— నాయకురాలు —

అవివేకమో వివేకమో చూపెదను. బీరంబులు పాలించి మగవాఁడ నైతివేని నిలువుము.

— బాలచంద్రుడు —

ఏమీ! మగవాఁడ నైన నిలువవలెనుగా! అవాచ్యంబులను దేహసంశోషణాపాదకంబులును నగు చెనరోగములచేఁ జివికిపోయినను వస్త్రధారణాద్యలంకరణంబులచేఁ బొంగిపడుచున్న వెలయాలు తీరున సైన్యంబెల్లయు మడియుటచే లోన కృశించుచు నీ వీరుని యెదుటఁ బడ నగను చచ్చినను జింబోతుగాంభీర్యంబు నింకను జూపుచున్న నీ బోటి ముదిబోడితోఁ దలపడుట కేమంత మగతనము గావలెను!

—* నాయకురాలు *—

బురదలో తాయి నైచుట వలె యుక్తాయుక్తపరిజ్ఞానము లేని చుల్పవితోడి ప్రసంగము ప్రాజ్ఞులకుఁ గూడనిపని.

—‡ బాలచంద్రుఁడు ‡—

నా మాట యేమి గాని యుక్తాయుక్తపరిజ్ఞానము నీకు మాత్రి మెక్కుడుగా నున్నది.

మా తాత రేచెర్లమాన్య వంతిరీశ్వంబు
  బ్రహ్మన్న కీక కీప్పించు నాఁడు
విషప్రయత్నపై శిశుభోజనము పెట్టి
  మలిదేవులం జంపఁ దలఁచు నాఁడు
శాంబరీకుక్కుటసమరంబు సాగించి
  యావనిఁ గైకొని కానకనుపు నాఁడు
అడవిపాలయిన మా యా మందల నెల్లఁ
  జెంచులఁ బంపి దోఁపించు నాఁడు
అందఱకు బాంధవుండు ప్రాయంపుఁ గుఱ్ఱ
ధీయుఁ డలరాజు మా రాయబారి రాఁగఁ
జట్టి హింసించునాఁడు నే పట్టుఁజేర
నీకుఁ గల్గు యుక్తాయుక్త నిర్ణయంబు

—‡ నాయకురాలు ‡—

ఓరీ! మాటిమాటికి రాయబారిగా వచ్చిన యలరాజు మృత్యువువాతం బడుటకుఁ గారణము నేనే యని మీ రందఱు నొక్కి వక్కాణించుట యెంత సిగ్గుమాలిన పనియో మీ రింకను గ్రహించుట లేదు. ప్రధానమంత్రిపీఠం బలంకరించి యీ విశాలమయిన పల్నాటిరాజ్యంబంతయు నవిచ్ఛిన్నముగాఁ బరిపాలన మొనర్చుచు రాష్ట్రింబులోని మాననీయు లగు వారి కందఱకు స్తుతిపాత్రనై యుత్కృష్టప్రజారంజక జీవితంబు నడపుచున్న నా వంటివారిపై నిట్టి నింద్యాపవాదంబులు మీరువేసినను లోకము మాత్రము మీ మాటలు నమ్మునని విశ్వసింపఁగలదు? ఎవ్వరెట్టి ప్రవర్తనము కలవారో పల్నాడీవలకే యొక్క నిశ్చితాభిప్రాయమునకు వచ్చియున్నది. మూఢా! ఇట్టి దుష్ప్రసంగంబుల కవకాశమిచ్చు నీ యది నాల్కా! తాటిమాలమా!

—† బాలచంద్రుఁడు ‡—

ఆ నాఁ డలరాజు నీ దుండగంబులఁ గూర్చి లిఖితపూర్వక మైన సాక్ష్యములు చూపింపఁ దలఁచినపుడు గాజుగ్లాడిగికొని నీతో సమానంబుగ సింహాసనంబున సుఖోపవిష్టుండై యున్న నలగామరాజు సభ నాపివైచెను గాని లేకున్న యా నాఁడే కొలువు లోని వారి కందఱకు సర్వముఁ దెలిసి యుండెడిది. రాయబారిం జంపించి సాక్ష్యపుఁగాగితములు మీరు కాజేసినను ... ...

—† నాయకురాలు ‡—

అదిగో! మఱల నసత్యము. ఇసుకలో నుండి వచ్చు తేగల వలె నీ నోటి నుండి వచ్చు నసత్యములకు మేర లేకున్నది.

—† బాలచంద్రుఁడు ‡—

కుడిచి కూర్చుండి యూరక యిట్టి దురపవాదంబులు నీపై మోపుటకు మా కేమి పట్టినది?

మతికి లేకుండఁ జెడుకంపు పొలయ దెపుడు
కుట్టు లేకయె రోగంబు కూడఁబడదు
మాటినను వహ్ని లేక ధూమంబు రాదు
నిజముగాఁ దప్పు లేకున్న నింద గలదె.

ఇంతటితో నిన్ను వదలిపెట్టుదు మని యూహింపకుము.

నీ కుటిలప్రవర్తనము
    నీతికి బాహ్యముగాఁ జరించి మ
మ్మే కరణిన్ మసాధువుల
    హింస యొనర్చెనో యుద్ధమైనచో
లోకము మెఱుంగఁ జేయుదుము
    లోపములన్ గురిజాలరాజ్యశో
భాకరకీర్తికాంత గళ
    దశ్రువుగాఁ దలవంచి యేడ్వఁగన్.

నీవు మా యెడఁ గావించిన దుశ్చేష్టితంబులు — సత్యములైనవి — నేను బల్కిన మాత్రంబున "నాల్క — తాటిదూలమా" యని వన్నాక్షేపించుచుంటివి. తొలుత మతభిన్నులయ్యుఁ గలిసియున్న నల్గామమల్లదేవుల సాహచర్యంబున్నదొకటి లేనిదొకటిఁ జెప్పి విధ్వంసంబొనర్చుటయే కాక యనంతర మిన్ని పాతకంబులు గావించియు వట్టి బూకరింపులతో నేమియు నెఱుఁగనని యసత్యము లాడు నిన్ను నే నేమన వలెనో తెలియకున్నది. అయినను నీతో నాకీ సోది యెందులకు?

ఒండే నాల్క యశేషగంధయుత లీ
    లోద్యానసంచారిణిన్
గండామొండిశిఖండిబండలకు నా
    ల్కల్ జేన వేలంద్రుఁ; నీ
గండాగొండితనంబు నా యెదుట సా
    గన్నేర్చునే చండదో
ర్దండోద్దండ బలోగ్రకాండ మిదిగో!
    రండా! ఖండింపుమా.

ఓరీ! నేనును యుద్ధసన్నద్ధనయియే యున్నాను. నీ బాణంబును గ్రుమ్మమన్నాను. చూడుము

(తెరపడును)

దృశ్యము — ౨౦.

కొమ్మరాజు కొలువు గన్పట్టిన కూర్చుండి యుండును. రామశాస్త్రి యుద్ధవిషయంబులు చెప్పుచుండును.

— రామశాస్త్రి —

అయ్యా! మీ బావగారును మాకందఱకు నేలికయునైన పెదమల్లదేవుండు మాత్రమే కాక ప్రతిజ్ఞానిర్వాహకుఁడైన బాలచంద్రుండును యుద్ధంబున మడియుట మా బోంట్లకే సంతాపకరముగా నున్నది. ఇఁక రాజబంధువులగు తమ కెట్లుండవలెను! ఊఱడిల్లుఁడు. చింతించి ప్రయోజనము లేదు.

— కొమ్మరాజు —

రామశాస్త్రిగారూ! దుఃఖ మాపినను నాఁగకున్నది. ఏమి చేయఁగలము (కొంచెముండి) అయ్యా! ఎవ రెవ్వరే యే విధంబుల విక్రమించిరో వినిపింతురా?

— రామశాస్త్రి —

చిత్తము. బాలచంద్రుఁడు నాయకురాలితోఁ గొండాట మాడి కొంతసేపటి కస్తోక క్రోధమూర్ఛితుండై పరిసంగంబులు సాలించి "చూడుము మిదిగో మార్గణంబు కోదండంబున కనుసంధించుచున్నాను. కాచికో" మ్మని పలుకుచు నవంగుండు సాంగుండై వచ్చెనా యని దిదృక్షువుల యుబ్బురంబు నాకర్షించు నట్టి పసుచుందనంపు మిసిమి తోడను గరుసుముక్కలంబు తోడను వెడదయురంబు గ్రమ్మించుచున్న సొగసుందనంబు లోని మేలివెలుంగులతోడను బరిఢవిల్లుచుఁ బుంఖానుపుంఖంబుగాఁ గఱకుటంపములో నామెను నామెతో నున్న కాల్బలమును చీల్చుచుండెను. "అబల"

యని బ్రహ్మనాయఁడునన్ను దూఱాడెనే. నా
చెఱుపఁదలంబును సర్వజనశ్లాఘాపాత్రంబుగాఁ
బరిసేనపయిం బఱచెదఁగాక" యని బాలుండు
గూడ నిరాసంబు సూపింపం జాలక త్రాస బొందు
నంతటి పరుసంబైనరోసంబు — విరాసంబు లేమిచే
గాఁబోలు — నాసాపుటంబునుండి యొసరించుచు
— నీకువచ్చినది మొదలుకొని పురుషవ్యాపారా
వశంబనై యుండుటచే స్త్రీజాతికి సులభసౌభా
గ్యంబు నాసిపోయి బిరుసెక్కిన గడెనాకుల
వంటి బాహుదండంబులు బలంబునఁ జేతినిలువు
కత్తివింటికొనలు రెంటను సమర్పించుచున్న వా
యునుంతదీర్ఘంబుగా నారిని గర్ణపర్యంతము సమా
కర్షించి యొడలెఱిఁగకుండ నెదుట నున్న బాల
చంద్రుని యొడలిం జుఱుకుచుఱక్కున
న్నాటఁ జేయుచుఁ బ్రతిపక్షశిక్షాదక్షంబై
హార్యక్షకాంతాపౌరుషసదృశంబైన ధాటి
నావిష్కరింపఁజేయుచు నాయకురాలు పరా
క్రమించుచుండెను. ఇరుదెగల యోధులగు పురు
షపుంగవు లందఱు నాయకురాలి భీషణహస్తలా
ఘవంబు సూచి మనస్సున మెచ్చుకొనుచుండుటయే
కాక తమ యుగ్గలికకుఁ దాత్కాలికవిరామంబు
గావించి నివ్వెఱపడి నోరు దెఱచుకొని చూచు
చుండిరి. కొంతసేపు నాయకురాలిం జూచి "ఈ
యాఁడుపుట్టువు మగవాఁడ నగు నాతో నేమి తల
పడఁగలదు? మొఱకుకోడలికంబున నుంచు నత్త
మామల దాడికిఁ బడలేక నూతిలో గభాలున
దుముకుటకే యాఁడుదాని సాహసము పనికివచ్చు
నుగాని మధ్యందిన సూర్యునువలె మండిపడు
చుండు యుద్ధవీరుల దోశ్చండిమ ముందఱ నెంత
లె" మ్మని యాలోకగా నుండునట్లు గప్పిన బాల
చంద్రుండు నాయకురాలి బాణపాటవంబునకుఁ
దుత్తునియ లగుచున్న తన శరీరంబునందలి కత్తి
ళంబు పలుమఱు నొత్తిచెప్పుచుండుటచే బిత్తర
వోయి "నే నూహించిన ట్లిది యాఁడుపుట్టువు
గాదు. మగవానిం జంపి పుట్టిన శక్తిస్వరూపిణి
సుమా," యని యాశ్చర్యంబును మించిన దోశ్చా
తుర్యమను మహాగ్నికిఁ గ్రోధచోదనశుష్కేంధ
నంబులఁ దగిలించి భీమంబుగాఁ బ్రజ్వలించుచుం
మగవానితోఁ బోరు విధంబుననే పోరాడుచు
నామెకుఁ గడుంగడు వెట్ట పుట్టించుచుండెను.

ఇట్లు గడియసేపు దోర్బలస్ఫురణంబున నిరం
తరంబుగను నితాంతంబుగను గయ్యంబు సాగిం
చిన వెనుక నెంత యపరిత్యక్తమైనను జాతిసహ
జంబైన దౌర్బల్యంబును బాలుని పోరాటపుఁ
దీవ్రత యేమాత్రము కోల్పోకనే యుండుటవలన
నాయకురాలినుమంత బడలిపోయెను. అంత
బాలచంద్రుఁడును నించుకంతయు సడలువిడువక
కౌమారంబు దాఁటు పగటివెలుఁగు మాదిరి దురం
తతాపావహసమరసంరంభంబునఁ జెలరేఁగుచు మా
ర్తురు గుండె లవిసి ప్రాణంబు లఱచేతం బెట్టు
కొనిపిక్కబల్మిఁజూపింపం జేయుచు నిషుచయంబుల
నొక్కుమ్మడిగాఁ బ్రసరింపఁ జేయుచుండ నాయ
కురాలింక దూర్మసఁగలేక తబ్బిబ్బై చికాకువడి
శరీరంబంతయుఁ బుండువడి శోణితధారలు గాఱు
చుండఁగా శీఘ్రంబున రథచోదకునికిఁ గనుసన్న
సేయ నాతం డరదంబును మొగతిరిగించి శి
బుల కడకుం దోలికొనిపోయెను.

—॥ కొమ్మరాజు ॥—

సెబాస్! బాలచంద్రుని పరాక్రమప్రాగల్భ్యము ముం దెవ రాఁగఁ గలరు.

—॥ రామశాస్త్రి ॥—

తరువాత బాలుం డింకను సైన్యదుర్గమారణ్యంబు ఛేదించుకొని ముందునకుఁ బోవుచుండెను. "ఆహా! దైవికంబున నెంత ఘోరంబుగాఁ బోరు సల్పినను బాలుండు నాయకురాలిని బట్టి పల్లార్చె గదా" యని నిరవధికంబైన చలంబు నూపి కోలంకి వీరాస్వామి బాలుఁడున్న యెడకు వచ్చుచుండ నల్పసైనికసంఖ్యాపరివృతులై యున్న మన పెదమల్లదేవప్రభువులు త్రోవలోఁ గాన్పించుటచే వారిపైఁ దలపడెఁ — బాలుండు సమీపగతుండు కాక మునుపే — బొబ్బవెట్టుచు మనరాజచంద్రుని నోట నెత్తురు గ్రక్కించి నేల కొరగించి ప్రాణంబులం బుచ్చెను.

—॥ కొమ్మరాజు ॥—

(విచారముతో) ఎంత సహింపరాని గతి యీ పక్షంబునకుఁ బ్రాప్తించినది! చెల్లెలి నిచ్చికొన్న వాఁడ నగుటచే నితరులకంటె నా దుఃఖ మీ విషయంబున దుస్సహంబు. అకటా! ఇంక నా సోదరీమణి యెట్లు జీవింపఁగలదో కదా. విధి చెయిదంబులఁ దప్పించుకొనలేము.

—॥ రామశాస్త్రి ॥—

అంత బాలుండు పెదమల్లదేవనృపాలుని పతనంబు విని వర్ణనదుస్సాధ్యంబైన మాత్సర్యంబున మచ్చరికించుచు హుటాహుటిఁ జనుచు కొక మూలఁ జమూసమూహంబుల చేతఁ బరివేష్టితుండై యున్న నరసింగరాజుం జూచి త్రోవలోఁ గోలంకివీరాస్వామి తలపడగాఁ నతనిని క్షణంబులోఁ జిత్రవధం జేసి విడిచెను. బ్రహ్మపుత్రుని రానీక యడ్డగించు రాజయోధులపై జడివాన వడువున దీవ్రసాయకంబులు పరగించి యప్రతిహతావేశంబున నరసింగరాజరథంబుం గదిసి బాలచంద్రుండు "ఓరీ! దురాచరణశీలా! నీవు బాసటగా నుండు నాగమ్మను నొడలు బిద్దలు సేసి విడిచితిని. దాని యనుచరుఁడ వైన నిన్ను నూరక పోనిచ్చుట తగవు గాదు. అందుది గాన దాని ననుక్రోశంబున బోనిచ్చితినిగాని నిన్ను నే నెక్కటి కయ్యంబున బెండిపీచుం జేతుఁ జూడు" మనఁగా క్షత్రియజాతిసముచితంబైన రోసంబున నరసింగు కాఱులు పలుకుచు భల్లంబు లవిరళంబుగాఁ బంపి బాలుని కొక్కింత శ్రమ గలిగించెను. ధర్మయుద్ధసూత్రంబు లడ్డువచ్చుచుండుటచేఁ గారంపూడి కనకరాజు, గామాలపాటి రామానాయుఁడు, నేలేశ్వరపు కాశీపతి మొదలగు యోధులందఱు వీరి ద్వంద్వయుద్ధంబున కాటంకము గలిగింపకుండిరి. కొంతసే పయిన వెనుక నొకరిద్దఱు పోయి నరసింగునకు సాయపడవలెనని గమకించిరి కాని యింతలో నెక్కడనుండియో కన్నమదాసు వచ్చి సేనలను యోధులను గలగుండు వడఁ జేసెను. ఆ సందడిలోఁ గొంతసేవు బాణంబులను మఱికొంతవడి కృపాణంబునను బరిశ్రమించి కడకు దళంబుల హాహాకారంబులు మిన్నుముట్ట బాలచంద్రుఁడు నరసింగు మస్తకంబు దెగనేసి దానిని కృపాణంబు కొనకు గ్రుచ్చి సేనాభయంకరంబుగా గాలిలో నాడించి విసరి పాఱవైచెను.

—* కొమ్మరాజు *—

బలే కుమారా! యుద్ధంబులలోఁ బ్రతిజ్ఞ నిర్వహించువారిలో నర్జునుని తరువాత నీవే యనుటకు సందియము లేదు.

—॥ రామశాస్త్రి ॥—

మల్లదేవుల మరణంబుచే నసలే కలఁగిపోయిన బ్రహ్మనాయఁడు గారు నరసింగరాజు హత్యను గూ

ప్పి విని యంతింత చింత పడికొని వర్ణింపఁజాలను. పరిచ్ఛేదితంబు లయిన నరసింగరాజు శిరంబును జత చేసి చూచి చూచి కన్నీటి కాల్వలుగట్టఁ గొంతసే పేడ్చి కడకు దగ్గఱున్న వారికి వైరాగ్యోపన్యాస మొకటి గావించిరి. అది తాత్కాలిక వైరాగ్యంబు గాఁ దోఁప లేదు.

-♦ కొమ్మరాజు ♦-

తెఱువాఁడు.

—* రామశాస్త్రి *—

అంతట నరసింగరాజు పడినప్పుడు మన పక్షంబున నున్న సంతోషకోలాహలములు వర్ణనాతీతములు. ఉప్పొంగి కేరింతలు గొట్టుచు మన మూకలు పలుదెసలఁ దాండవించుచుండ వారి వైపున గోపంబు హెచ్చుకబంటిగాఁగా బాలచంద్రుని ప్రతిజ్ఞానిర్వహణంబునకుఁ బళ్లు పటపటఁ గొఱుకు వారు కొందఱును మీసంబులనిక్క బొడిపించు వారు కొందఱును నాగ్రహంబుగాఁ దారకావర్తనంబు గావించు వారు కొందఱును నిట్లు పెక్కుదెఱంగులఁ దమ యుద్వేగంబునకుఁ బరిదర్శి వైచిత్ర్యంబొసంగుచుండ — నాపద్ధర్మంబు తెమ్మనుకొని — ధర్మయుద్ధసూత్రంబు లన్నియుఁ దెగద్రెంపి నాగులేటిలోఁ గలిపి సలకామగాజేసినింపి, శ్రమదీర్చికొని మరల వచ్చిన నాయకురాలు, మగటిమిలో రాశి కెక్కిన యుక్కుతునకలు కొందఱుఁ — గలిసి, కౌరవయుద్ధంబునందలి పద్మవ్యూహంబులో ధార్తరాష్ట్రు లభిమన్యుని వలె బాలచంద్రుని జుట్టుముట్టి నానాప్రకారంబులుగా నుల్లసంబులాడుచుఁ గ్రోధంబులు గ్రక్కుచు నీతిబాహ్యదూషణవాగ్బాణంబుల నొప్పించుచు నాతనికి సాయంబుగా నున్న పంచమసైన్యంబును హతాశంబుగఁ జేయుచు విజృంభింప మొదలిడిరి. శిబిరంబునందు విచారంబున మునిఁగియున్న బ్రహ్మనాయనికిఁ గాని, యింకను గొఱుతవడి తప్పించుకొని పోనీక యడ్డుపెట్టుచుండు, పాదిలెపేనపై దుమికి కత్తిగొని కండ చోపున బలిదీయుచుండు కన్నమదాసునకుఁ గాని బాలచంద్రావస్థ గోచరింపకుండెను. శత్రువులు ధర్మసూత్రప్రతికూలమార్గంబునఁ దలపడుట చూచి బాలచంద్రుండు కొంతవడి నివ్వెఱవోయి హా చెల్లె చెన్నకేశవని. తండ్రియగు బ్రహ్మనాయని మనమున ధ్యానించి యుగ్గలిక రెట్టింప ననివార్య శరవర్షపాతంబునఁ బరపంథిప్రతినాథైర్యాగ్ని జ్వాలగ్రసించు నార్పుచుఁ దచ్ఛరీరంబుల రక్తధారలం గార్చుచు యుద్ధదేవతావేశంబున నొకలు పెఱిగి ముందు నిల్వంబడెనా యని ఖ్యాతవీరవజిర బొబ్బపొరలగున ట్లొనర్చెను. బాలుండెప్పుడు బడునా యని సమయము వేచియున్న నాయకురాలు మొదలగు వారు తుదప్పున బ్రహ్మనాయని గారాబుబిడ్డపై నెదతెరపి లేకుండ బాణప్రయోగంబు గావింపఁగా దాదాపుగా బడలిపోయిన యా సింహకిశోరము నైరాశ్యంబున జివరపోటుగా నరదంబు నుండి దుమికి ప్రచండమండలాగ్రంబును బాహుదండంబుచేఁ ద్రిప్పుకొనుచుఁ గాశీపతిరథంబుపైఁ గవిసి యొక్క త్రుటిలో నాతని మృత్యుసాన్నిధ్యంబు సేర్చెను. ఈ సమయంబున బ్రత్యేకంబుగా నొక్క వీరునిపై దలపడఁబోయిన బాలచంద్రుం డన్ని వంకల నుండి విశిఖాగ్నికి గురియై కాశీపతి పడిన మఱుని మునంబుననే దళంబులన్నియు నంచలింప రక్తంబు నోట నురువులు గట్టుచుండ నేలం బడి శంఖచక్రశార్ఙ్గధనురాద్యాయుధంబులచే విరాజిల్లు వైకుంఠేశ్వరుని దలంచుకొని మానసికయజ్ఞంబున బ్రాణహవిస్సుల వేల్చి పరమపదమైన వైకుంఠమందిరంబు సేరెను.

—* కొమ్మరాజు *—

దైవ మండలము దుడిచివెట్టినాడు. మన నైపు మల్లదేవునే కాక బాలచంద్రుని గూడ నెత్తుకొనిపోయి బ్రహ్మనాయుడు గారికి జెన్నకేశవుండు మితిలేని విచారంబు గలిగించినాడు రామశాస్త్రి గారూ! బ్రహ్మనాయుని శిబిరంబునకుఁ బోయి యా మహనీయుని ననుసంయించెదను. పల్లకీ హంద్రను బంపుడు.

—§ రామశాస్త్రి §—

మంచిది. (లేచి) కన్నమదాసు బాలచంద్రుని పాటు విని నేలంబడి యేడ్చి విచారకోపసమ్మిళితమనస్కుండై నాయకురాలిని బంధించి తెచ్చెద నని భీషణంబుగా గర్జించుచు నామెయున్నెడకుం బోయె ననుచున్నారు. ఏ మయినదో తెలియదు. మఱల దర్శన మొనర్తును.

—§ కొమ్మరాజు §—

మంచిది.

(తెరపడును)

## దృశ్యము 27

నాలగామరాజు ప్రవేశము.

—‡ నలగామరాజు ‡—

అవలంబితమైన మతమునే యతిమాత్రముగ నాదరించి దానికై ప్రాణంబులు గూడఁ గోల్పడఁజేయు నట్టి మతోత్సాహము — లేక — మతమౌఢ్యము భరతమాతకుఁ గొంత పుత్రశోక మాపాదించుచున్నది. నేఁటికాలంబున విరివిగా నాంధ్రదేశంబున బ్రబలి యున్న యీ శైవవైష్ణవమతములు పరస్పరసంఘర్షణమునకుఁ గారణములై తండ్రికొడుకులు, నన్నదమ్ములు నను భేదము లేక మౌఢ్యంబున నొకరి కత్తుక లొకరు తెగనఱికికొన జేయుచుండుట వలన నీ మతావేశము ధర్మజ్ఞులచే నీసడింపఁబడుచున్నది. దీనికి దృష్టాంతము మేమే. మా తండ్రియగు నలుగురా జనల్పయశోవిశాలుండై నిర్భేద్యముగా నుంచిన పల్నాటిరాజ్యము నా చేతిలోనికి రాఁగానే మైకమత్యము చెడి రెండు చీలికలై యపకీర్తి పాలగుటచే నానాఁడు నాగమ్మగారి మాటల తీపివలనఁ దెలియక పోయినను గాలిచల్లాఱిన గృహంబువలెఁ గన్పడు నీ యుద్ధభూమిం జూచి గ్రహించుకొనుచున్నాను. రాజ్యైకత్వము నను గూర్చియు మతసహనము గూర్చియుఁ జిన్ననాఁడు బ్రహ్మనాయఁడుగారు నేర్పిన నీతి సూత్రము లన్నియు మంటలోఁ గలిపి యీ రాజ్యము నకే కాకుండ నలుగురాజు కీర్తికిఁ గూడ భంగము గలిగించిన దుర్మార్గుం డగు నీ నలగాముఁడు శిష్టాత్ముండైనను నా తమ్ములు పెదమల్లదేవుఁడు, పిన మల్లదేవుఁడు నరసింగరాజు మొదలగు వారితోఁ గూడ రణభూమి యందుఁ ద్రెళ్లినీక యింకను బ్రతికించి యుంచుట కా సదాశివుని సంకల్ప మేమో తెలియకున్నది. రెండు పక్షంబుల లోను గావలసిన ప్రాణబంధువులలో ననేకులు యుద్ధాగ్నిసాహుతులై బ్రదికియుండునట్టి నాకు మాత్రము తీఱని దుఃఖము గలిగించినారు. కౌరవపాండవభండనమునకు దుష్టచతుష్టయము వలె నీ కారంపూడి యుద్ధమునకు నాగమ్మయే పునాది యనుటకు సంశయింపం బనిలేదని తోఁచుచున్నది. బ్రతికియుండియు నిప్పుడు విషయాలోలత్వంబునం బడిపోయి చనిపోయిన వెనుకఁ బాపకర్మఫలానుభవంబున బరితపించు జీవునివలె — నేనును నాయుఁడుగారు నేర్పిన మతసహనధర్మమును బోఁదోలి యా నాఁడు నాగమ్మ మాటల తియ్యందనంబును వదలిపెట్టలేక లోఁబడి యొడలు తెలియక చెట్టంత తమ్ములను బందుగులను జంపుకొనవలసిన దురవస్థ దెచ్చి

కొని నేఁడు విలపించిన బ్రయోజన మేమున్నది? కోడిపోరు విషయంబున గాని యలరాజు హత్య విషయంబున గాని యామెయు నరసింగరాజుఁ బన్నిన రహస్యాలోచనములు మునుముందు తెలియక పోయినను గొన్నాళ్ల కయినను యథార్థములు నా చెవిం బడుచుండెడివి గాని యామె చూపించు శైవమతప్రచారసామర్థ్యమట్టిది! ఆ మాటల నైకమనుభవైకవేద్యమే కాని వాక్యాఖ్యము గాదు. శైవమతోద్ధరణవిషయమై యామె యెట్టి మాఁటతి చెఱ్యందనము గలిగియుండనిదే నా ప్రేమాస్పదమైన కూఁతు మెడలోని మాంగల్యంబును ద్రెంపుట కామె పాల్పడినను బెల్లము గొట్టిన ఱాయి వలె మిన్నకుందునా! అయ్యయ్యో! మతము పేరు వెట్టి యెన్ని చేయరాని దుష్కార్యములు నా పేరుతోఁ జేయించినది! ఘోరము! ఆమె యెన్ని దుండగంబు లొనరించిన దని వారనుచున్నారో దాదాపుగా నన్నియును యథార్థములై యుండు ననియే కదా — అవి సభాసదులు వినకుండుటకై — అలరాజును సాక్ష్యంపుఁ గాగితములఁ జదువనీక సభ నాపివైచితిని. మఱియుఁ బరమతసహనమే స్వమతంబునకును నభివృద్ధికారణ మని యానాఁడు సభలో నలరాజు ఘోషించిన విధ మనుభవము మీఁద నిశ్చయ మని గ్రహించితిని. బ్రహ్మనాయుఁడు గారి పంచమాస్పృశ్యతాప్రచారము గూడఁ దొల్లదొల్ల నున్నంత యేవగింపుగా నా కిప్పుడు గన్పట్టుట లేదు. ఆ మహాత్ముఁడు పరిచరించు కరపత్రంబులు చదువఁజదువ నూలనూదిగల నొక్కమాఱుగాఁ బూసికొని తిరుగుటకు మనస్సింకను నిష్టపడకున్నది కాని వారి యవస్థ మిక్కిలి శోచనీయ మని మాత్రము గ్రహింపఁ జొచ్చినది. మొన్న సంధిసూత్రములలో మతవిషయికనిబంధనలు పెట్టి వానికి ముక్కవెట్టి నన్నొప్పించి యా సంధిప్రయత్నముఁ బాడుసేసినది కాని వారి పంచమాస్పృశ్యతా నివారణ ప్రచారంబున కడ్డుకోకుండ మా చెన్నరాజ్యం బొసఁగినట్లయిన నాయుఁడుగారు కుట్రలను గూడఁ ద్రోవకుఁ దీసికొని వచ్చెడి వారే. యుద్ధావశ్యకతయు లేకుండెడిది. బంధువర్గం బంతయు బ్రతికియుండెడిది. పూర్వ మపరీక్షకముగా నైనను ధృతరాష్ట్రుని జీవితం బెల్ల నిందాస్పదమో నా జీవితంబు గూడఁ గళంకదాయక మనియే చెప్పఁదగును. గతించిన దాని కిప్పుడు వగచి లాభము లేదు. (కొంచెమాఁగి) ఆహవభూమియందు నాయకురాలు కన్నమదాసుచేతఁ బట్టుకొనంబడి బంధితయై బ్రహ్మనాయుని కడకుం గొనిపోఁబడినది కదా. నాకు మాత్ర మింక నెవ్వరున్నారు! చిన్ననాఁడు నన్నెంతో గారాబముగాఁ జూచిన శాంతకరుణామూర్తి యయిన బ్రహ్మనాయుఁడు గారి కడకుం బోయి పశ్చాత్తప్తహృదయుండ నయ్యెదఁ గాక.

(నిష్క్రమించును)

## దృశ్యము 28

(బ్రహ్మనాయఁడు శిబిరములోఁ గూర్చుండియుండును.)

— బ్రహ్మనాయఁడు —

దైవమా! చెన్నకేశవా! ఎందఱు వీరవతంసులఁ గారంపూడి యుద్ధభూమిలోఁ దెగటార్చితివి!

వృద్ధికాముండు మా పినమల్లదేవుండు
జీవితకావ్యంబు చిగుఱుఁజదివె
మరలిచూడక యిల్లు మా కొఱ కీర్తి
యుగ్రాహవోత్సుక యోధవరులు
మా చెర్ల రాజ్య మా మంత్రించినను బోయె
మల్లభూపతి పెరుమాళ్ళ సేవ

లేక లేక కలుగు నేకపుత్రుఁడు గోర
బాలచంద్రుండు రంభాసుఖంబు
అయినవా రందఱును సమరాగ్ని లోన
మ్రగ్గిపోయిరి నల్గామరాజు సేన
మాడఁగొట్టిన వాగళ్ళ మండినాము
అకట! యుద్ధాభిలాష మహాపకారి

— కన్నమదాసు —

(బంధితయైన నాయకురాలితోఁ బ్రవేశించి తండ్రీ! నమస్కారములు.

— బ్రహ్మనాయుఁడు —

(నాయకురాలిని జూచి) కన్నమా! ఇది యేమి?

— కన్నమదాసు —

తండ్రీ! అఁడుపెత్తన మేడ్చి గురిజాలరాజ్య పరిస్థితిను నాగులేటిలోఁ గలిపిన సంగనాచిని ద్రాటితోఁ గట్టి తెచ్చితిని.

— బ్రహ్మనాయుఁడు —

కుమారా! ధర్మాధర్మపరిచ్ఛిత్తి యను లతికను విషజలంబు వోసి పెంచుచున్నావే. (కోటకేతుఁడు నలగామరాజు నొక నైపు నుండి ప్రవేశించి వినుచుందురు.)

— కన్నమదాసు —

(జంకుతో) అదే మట్లనెదరు?

— బ్రహ్మనాయుఁడు —

చెప్పెదను గాని ముందు బంధంబుల విప్పుము.

— కన్నమదాసు —

చిత్త మట్లే చేయుదును. (నాయకురాలి [illegible] విడిపించును)

— బ్రహ్మనాయుఁడు —

(నాగమ్మ[illegible])

ఆ గురిజాలరాజ్య మహీ
మాంచితమంత్రిపదానుభోగముం
దూఁగిన భాగ్యశాలినికి
నోటము పెట్టుట గాక త్రాళ్ళతో
నీగతిఁగట్టియుంట తగ
దీతఁ డెఱుంగక తప్పఁజేసె నో
నాగమతల్లి! దీనికి మనస్సున
జింతిలకమ్మ! మానినీ!

— నాయకురాలు —

(తలవంచుకొని యుండును)

— కోటకేతుఁడు —

రాజుగారూ! బ్రహ్మనాయఁడుగారు శత్రువుపైఁ జూపు నౌదార్యము ప్రశంసాపాత్రము గదా.

— నలగామరాజు —

అతఁడు సుగుణంబుల నిధి.

— బ్రహ్మనాయుఁడు —

(కన్నమతో) కుమారా!

అవమానంబును గూర్చి యాన్యులకు — నా
రాత్రిన్ దలన్ వాంచి పె
ల్లు విలాపింపఁగఁ — జూచి వేడ్కపడు బు
ల్బున్ మానుమో తండ్రి! యీ
యవమానం బది నీకె యౌ నెడల స
హ్యం బౌనె? లోకంబు నా
త్మవలెం జూచుచు జ్ఞానిశేఖరుల స
న్మానించు ఛేమంబునన్

యుద్ధమున శత్రురాజుల నోర్చి యున్న
వారి ఘనతను గౌరవింపంగ వలయు
మున్న లెగ్జాండ్రు పురుషోత్తముని జయించి
ఎంతగా గౌరవించెనో యెఱుఁగ లేద?

శత్రువ్రం డొనర్చు దుశ్చేష్టితముల ఖండింపవలెఁ గాని వారికి మాత్ర మెట్టి హింసయుఁ గావింపరాదని నా కుద్బోధము గలుగుచున్నది.

సంగ్రామరంగంబున నోడింపఁబడినవా రెంత యవమానకీలలతోఁ దపింతురో విజయధ్వజ మెత్తినవా రంత మహాప్రేమంబును నష్టించి వారి మనస్సునకు శాంతిగల్పింపవలయును (ఆలోచించి) మఱియుఁ బ్రేమాయుధంబున సాధింపఁబడఁజాలని శాత్రవులు దౌర్జన్యాయుధంబునఁ జక్కఁబడరని తోఁచుచున్నది.

ప్రేమము దుష్టమానసపరీతవిరోధములం
 బెకల్చి లోఁ
బ్రేమను స్నేహితంబు నిరు
 పక్షము లందున; గామధేనువై
ప్రేమము లోకసౌఖ్యశుభ
 రీతిపయస్సును జేపుచుండ నో
హో! మద మెక్కి చంపితిమి
 యుగ్రరణంబున జీవకోటులన్

అట్టి లోకక్షేమంకరం బైన ప్రేమసిద్ధాంతంబు గీటునం బుచ్చి యీకలియుగంబుననే కాక పూర్వయుగంబులందును ధర్మజ్ఞులగు వీరులు గూడ శత్రువుల భంజించు పట్ల దౌర్జన్యంబు సూపించి భీమంబుగా రణంబు గావించి పగతుర నోడించి యున్న మాట వాస్తవము. అయినను నంతకంటె నుత్కృష్టతరమై లోకకళ్యాణమునకు దారిఁజూపుచు నెట్టి కఱకుగుండెలను గూడ ద్రవింప జేయఁ గలిగిన దౌర్జన్యరాహిత్యము మన కందఱ కవలంబనీయము.

సామాయంబుగఁ జూచుచున్ బ్రికటదౌ
 ర్జన్యంబు గావించి యెం
తో సాధించెదు జాతిగుండె గలశ
 త్రుండైన మోమోశియ
డ్డే సౌహార్దము సూపి లోఁచుదును గా
 తిన్యంబు పోఁగా — నహిం
సాసిద్ధాంతరహస్య మిద్యాత్ప్రపం
 చక్షేమ మిందే సుమీ.

—‡ కన్నమదాసు ‡—

తండ్రీ! మఱల సెలవిండు.

—‡ బ్రహ్మనాయఁడు ‡—

(మఱలఁ జదివి)

తెలిసి శూరులె దీని సాధింపఁగలరు
ధర నహింసాప్తి పిఱికిపందలకుఁ గాదు
మేటివీరులు దీని నమ్మికను గలిగి
లోకమోక్షంబు గూర్పఁ బోలుదు కుమార!

(కొంచెముండి) నే నింక నస్త్రసన్యాసంబే కాక మానసికసంసారసన్యాసంబు గూడ వైరాగ్య బుద్ధిచేఁ గావించి భవిష్యజ్జీవితంబంతయును బంచ మాస్పృశ్యతానిరోధప్రచారంబుతోఁ బాటుగా నహింసాసిద్ధాంతప్రబోధంబు గూడఁ జేయుచు లోకోపకారమునకుఁ బూనవలెనని యున్నది. ఈ యహింసాసిద్ధాంతమును దేశమున నెట్లు ప్రచారములో నుంచవలెనో శత్రువులజయించుపట్ల మానవకోటికెట్లుపకరించునో యీమొదలగు సర్వవిషయంబులు విపులముగఁ దఱువాతఁ దెలిసికొనవచ్చును. అసలహింసాసిద్ధాంతము — లేక — ప్రేమసిద్ధాంతము కుమారా! నీకెంతవఱకు నచ్చునో తెలియదు. నెలుపలనుండి శిలాశకలంబుల నానావిధకశ్మలంబుఁ విసుచుచున్నను నిరుపమాన సహిష్ణుతతో సర్వతోముఖంబుగఁ జల్లనిచూపులఁ జల్లి దూర్వలం గూడ యొడిలోనికిం జేర్చుకొని పునీతులఁ గా

వించుగంగానదివలెనీ యహింస పగయను నెండమావులం బోవు కుమార్గులకింత శాంత్యమృతం బిచ్చి నేదదేర్చి మఱలించు నని గ్రహింపుము. కాని నేను జెప్పినట్లీ యీ యుద్ధము దుర్బలుర కలవిగానిది.

—§ కన్నమదాసు §—

తండ్రీ! భగవంతుండగు శ్రీకృష్ణుం డర్జునునికి నిష్కామకర్మయోగము పదేశించిన మాదిరి నేండు దమరు నాకు దౌర్జన్యరాహిత్యసూత్రములచే సద్బోధము గావించుట ధన్యుండ నైతిని. ఇంక ముందహింసాసూత్రిలతికల నలుదిక్కులం బ్రచారామృతప్రసారంబున వృద్ధిం బొందించి వ్యాపింపం జేసెదం గాక.

(నాయకురాలిని జూచి) నాగమ్మగారూ! నేను మీ యెడలం గావించిన మహాపరాధమునకు మన్నింపవలెనని ప్రార్థించుచున్నాను.

—† నాయకురాలు †—

(తనలో) అహింసాసిద్ధాంతముల నేను గూడ వినవలెనని యే యింత సేపు కుమారునికి నాయుండు పదేశించినాడు. ఈతని యుద్యమంబులు గొన్ని నాకంగీకారార్హములు గాకున్నను మొత్తము మీంద గొప్ప ధర్మజ్ఞుండని చెప్పక తప్పదు.

—§ కోటకేతుండు §—

ఆహా! మహాత్ముండు గదా బ్రహ్మనాయుండు! నరిసింగరాజు పెదమల్లదేవుండు బాలచంద్రుండు రణంబున నిహతులైరని విని పరితపించి పరితపించి వైరాగ్యముం దెచ్చుకొని నాయుండు గారు లోకోద్ధరణమునకు నూతన సూత్రంబులను బ్రతిపాదించుచున్నారు.

—‡ నలగామరాజు ‡—

కోటకేతుండుగారూ! క్రౌంచమిధునంబును గాంచిన వాల్మీకిమహర్షి రామాయణకథావిస్తృతంబు వర్ణించిన విధమున ని కార్యంపూడి యుద్ధపర్యవసానంబును బొడంగనిన బ్రహ్మనాయుండు గారు దౌర్జన్యరాహిత్యసిద్ధాంతములు సముజ్జీవింపం జేయుచున్నారు. ఇంక మనము బయలువడుదమా?

—* కోటకేతుండు *—

ఊం. (దగ్గఱకు వచ్చి) నాయుండు గారికి నమస్కారములు.

—♦ నలగామరాజు ♦—

(నాయుని జూచి యవమానముతో) నమస్కారములు.

—§ బ్రహ్మనాయుండు §—

(నలగాముని జూచి యాశ్చర్యంబును మించిన సంతోషముతో) ఓహో! నా ప్రేమాస్పదుండు వచ్చినాండే. (పోయి కౌగిలించుకొనును)

—‡ నలగామరాజు ‡—

(కన్నీరు నించుచు) అయ్యా! మీరు చిన్నతనంబున నాకుం దండ్రిలేకుపోతం దండ్రియంతవారయి రాజ్యపరిపాలన వివిధధర్మంబులుపదేశించినను — మిమ్ములను ద్రోసి పుచ్చి — యీ నాగమ్మగారి మతకుతంత్రములలో మునింగి తేలలేక యామెకు లోంబడి సర్వకార్యములందును నామెకుం గనుసన్న మెలంగుచుం దుదకుం గలిగిన బంధువుల నందఱను జంపుకొనిన నిర్భాగ్యుండ నైతిని. పూర్వప్రేమంబును మఱచి పోరని విశ్వసించి శరణార్థినై వచ్చితిని.

—* బ్రహ్మనాయుండు *—

నాయనా!

చిరకాలోపగతాతిమాతృరుచిర
స్నేహంబువుల్ గన్నపుం
బరిపాకంబున గొంతికాలము
పరామర్శించి లోంగొంటి; నం

దరహా సీ ముఖచంద్రబింబమును సం
దర్శించి నా చింత పా
గరముప్పొంగుచు నుంచి వేసెను వ
ల్గామత్కు మావల్లభా!

కలబాంధవ్యము మాసిపోవంగ నియో
గంబుల్ — పునస్సన్నిహముల్
కలయా — నిశ్చయమా — యెఱుంగను; మహా
కష్టంబులున్ సౌఖ్యరీ
తులు రేయుం బవలుల్ వలెన్ దిరుగు సం
తుర్యాప్తి యీ మానవా
వళి కాలాఖ్యుని చేతిబొమ్మలు — గ్రహిం
పం జాల మీ చిత్రముల్.

తండ్రీ! కడచిన దానికిఁ జింతింపకుము. ఇక భయములేదు. రోహిణి కార్తెలో వడదెబ్బ తగిలి శోషిల్లిన లతానుషంగములు మృగశీర్షకరుణామృతవర్షంబున సేదదేఱు నట్లు దౌర్భాగ్యప్రభావమువలన విడిపోయిన మనమిర్వుర మీ కారం పూషికయత్నంబు వలన బునస్సమాగంబు చేసికొనఁగలిగితిమి. పరమసంతోషము.

— కోటకేతుఁడు —

(నాయనితో) అయ్యా! తమరు మహాత్ములు. మహాత్ముల యాజ్ఞ యనుల్లంఘ్యము. పల్నాటి రాజ్యంబింక నే తీఱున సాగింపవలెనో [illegible] నని కూడఁగోరుచున్నాను.

— బ్రహ్మనాయఁడు —

నేను మాత్రమేమి చెప్పఁగలను? పెద్దవాఁడనైతిని. నా యీ మిగిలిన జీవితకాల మంతయు [illegible] కూర్చియు నన్ప్రశ్యతాని [illegible] కూర్చియు దేశంబున ద్రవప్రబోధంబు [illegible] లోకక్షేమమునకై ప్రయత్నింపవలెనని యూహించుచున్నాను.

— కోటకేతుఁడు —

పెద్దలకు నే జెప్పఁగలవాఁడను గాను. అయినను

అంత యశోవిశాలుఁడగు
నల్గొ మహీపతి దాఁటు వెన్క ధీ
మంతులు మీర లుండినను
మచ్చపడెన్ బలనాట వంచు లో
కంతురు లోకు లెల్లరును
పేళవజేయుదు రేలుఁడీ మన
శ్చింత నపుష్టికై పరుల
చేతికిఁ బోవఁగ నీక రాజ్యముల్.

మాచెర్ల — గురిజాల — రెండు రాజ్యముల పరిపాలనంపు నిర్వహణము దమ మంత్రాంగ కౌశలంబున గాని సాగనేరదు. కనుక మీ రభ్యంతరముఁ జెప్ప వలదని మనవి.

— బ్రహ్మనాయఁడు —

ప్రజల నన్ను మంత్రిత్వమునకు రమ్మనుచున్నారే!

— నలగామరాజు —

సర్వజ్ఞులగు తమరు చేయి పెట్టనిది యే పని సాగించుటకును సాధ్యము గాదు.

— బ్రహ్మనాయఁడు —

బాలమల్లదేవుండు పిన్నతనంబున నుండుటచేఁ బరిపాలనము వట్ల నపరిచితుండు. రెండు రాజ్యంబులు ప్రజల నొక్కటిమై దానికి నలగామరాజే యాధిపత్యము వహించుట నా కంగీకారమే.

— కన్నమదాసు —

ఇఁక నాగమ్మగారి విషయము?

—* బ్రహ్మనాయుఁడు *—

నాగమ్మగారి పరిపాలనములోని లోపంబులును, నామె మాయెడఁగావించిన దుష్కృత్యంబులును నానపూర్విగనీ వచ్చిన రాజులందఱ సముఖమునఁ దగినంతగా విశ్వాసార్హముగా నివేదింపఁ దలఁచితిని. విషయంబులన్నియు వెల్లడియైన గాని మంచి చెడ్డలు లోకంబునకుఁ దెలియవుగదా. నాగమ్మగారి యందు నాకెట్టి విరోధిభావమును లేదు. ఆమె గావించిన చేష్టల మాత్రము గర్హించుచున్నాను. పాపమును ద్వేషింపవలెఁ గాని పాపిని ద్వేషింపఁ దగదని మహాత్ముల యభిప్రాయము.

—‡ నలగామరాజు ‡—

నాయుఁడుగారూ! అయిన దేమో యయినది. మీరు చూపింపఁబోవు నేరములన్నియు యథార్థము లని నేను బూర్ణముగ గ్రహించితిని. మఱల మీరావిషయముఁ దఱచ వలదని వేఁడుచున్నాను. మీరు మాత్రము గురిజాలలో మంత్రిత్వము వహింతు రని నా విశ్వాసము.

—* బ్రహ్మనాయుఁడు *—

(ఆలోచించి) కుమారా! నలగామా! ప్రజలలో నహింసాది సద్గుణంబు లలవడఁజేయుటకు నధికారము గూడఁ జేత నుండుట మంచిదియే కావున మంత్రిత్వమును స్వీకరించుటకు సమ్మతించుచున్నాను. ఏవిధముగనైనను దేశసేవ చేయవలయును. ఆ విషయ మట్లుంచుము. కొంతకాలము మహోన్నతపదమునం దుండిన నాగమ్మగారిని రాజ్యంబు నుండి తఱిమివేయుట నా కిష్టము గాదు. ఆమె నింక మంత్రిపీఠంబున నుంచుట కంటె మత ప్రబోధంబునకు నియమించుట మిక్కిలి వాంఛనీయము. శైవమతానుసారిణియై తన మానసావలంబనమునకుఁ దగినట్లు శైవమతమున కామె యొనర్చిన సేవ నిరుపమాన మని చెప్పక తప్పదు. అంతవ తోత్సాహము గల్గిన విద్యావతిని నగౌరవముగాఁ జూచుట పాడిగాదు. మఱియు

శైవము వైష్ణవం బను ప్ర
జామతముల్ సమరీతిఁ బెంచుచుం
బోవలె సాధువర్తనుల
బోధకులన్ నియమించి పోటి యే
త్రోవను లేక — శైవమతో
ద్ధారవ్రతున్ మన నాగమాంబకే
యీవలె వైష్ణవోద్యమము
సీడ్చను గన్నమదాసు పూనికన్

మతసహనం బహింసయును
మాలల యుద్ధరణంబు భోగముల్
మితముగఁ బొందుటల్, కలిమి
లేమి సమాదరణంబు, ధర్మస
మ్మతముగ మద్యపానమును
మాన్పుట, లోకహితానుమోదితో
వితమును నిర్వహించుట, వి
వేకుల -- రాజుల -- ముఖ్యధర్మముల్

—• కోటకేతుఁడు •—

కోవిదులగు మీరుపదేశించు ధర్మములమూల్యములు. మఱొక్క మాఱు సెలవిండు.

—‡ బ్రహ్మనాయుఁడు †—

(మఱలఁ జదువును)

—* నలగామరాజు *—

నిరభ్యంతరంబుగా మీ యిష్టం బనుసరించి పరివర్తింప సంసిద్ధుఁడను.

—† కన్నమదాసు †—

మాతండ్రిగారు మఱల రామరాజ్యమును బ్రతిష్ఠించుచున్నారు.

— బ్రహ్మనాయుఁడు —

నాగమ్మగారూ! మీరవమానమును బొంద నరములేదు. మిమ్ములను బల్నాటిరాజ్యంబుని శైవమతప్రచారమునకు ముఖ్యాధికారిణిగా నియమించుచున్నాము. తమ రీయుద్యోగమును గాకరింప రని నమ్ముచున్నాము.

— నాయకురాలు —

నాయుఁడు గారూ! పశ్చాత్తాపమున బాపపరిహారము గలుగునని తమ బోటి యార్యుల కడ విన్నాను. జరగిన దేమో జరగినది. నా లోపములకుఁ బాపములకుఁ బశ్చాత్తప్త నగుచున్నాను. నన్ను యెవ్వరైనను స్వప్రయోజనార్థము గాదయు నేను నమ్మిన శైవమతము నుద్ధరించుటకే యీ యధికారమునియుఁ దమరు గ్రహింపవలెనని నా ప్రార్థన.

— బ్రహ్మనాయుఁడు —

సత్యముఁ బలికితిరి. మీ యాదర్శము నిష్కళంకమనియే కదా — సూక్తములు మాత్రము నేర్చుకొనవచ్చునని శైవమతాధిపత్యంబును స్వీకరింపుఁడని బ్రతిమాలుచున్నాము! మన మతోద్ధరణదేవికి భూతదయాంగనను బానిసగా నుంచక చెల్మికత్తెగా నుంచుట కంగీకరించిన జాలును.

— నాయకురాలు —

మంచిది. అట్లే కావించెదను.

— బ్రహ్మనాయుఁడు —

(వినయముతో) అనుగృహీతుఁడను.

— కోటకేతుఁడు —

నా ప్రార్థన నంగీకరించినందులకు నాయుఁడు గారి నభినందించుచున్నాను.

— బ్రహ్మనాయుఁడు —

సక్రమాందోళనపరిచారములతో శైవమతనిర్వహణముఁ గావింప నంగీకరించిన నాగమ్మగారికి నా నమస్కారములు.

— నలగామరాజు —

నాయుఁడుగారూ! యుద్ధహతావశిష్టులయిన రాజన్యులను సేనాప్రకరంబులను దగు గౌరవంబులతో వారివారి రాష్ట్రంబుల కనుపవలయును గదా.

— బ్రహ్మనాయుఁడు —

మంచిది. నాగమ్మగారూ! పోవుదమా?

— నాయకురాలు —

చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు)

---

## అంకితము

కైతకన్నియ యొక్కతె కలదు నాకు<br>
నవ్యరుచు లంత యెఱుఁగని నాటు బిడ్డ<br>
మనసు మంచిది; నీకు సమర్పిత యిది<br>
ఏలికొనవయ్య దేవ! లోకైకనాథ.

గ్రంథకర్త.

# భద్రాద్రి రామదాసు.

వెల రు. 0—12—0

ఇది 500 పద్యములు గలిగి భక్తి నుద్బోధించునట్టి సరసమైన తెనుగు కావ్యము. ఇందులో నెక్కడఁ జూచినను బద్యము లోకోత్తరత గల వ్రాఁతను స్ఫురింపఁజేయునుగాని కుంటుదనము మందునకైనను గానిపింపదు. వేయేల? ఆర్థికదౌర్బల్యము నాసించియున్న ఆవిష్కరణప్రచారలోపములచే మూలఁబడియున్నది గాని మఱొకటి గాదని రసజ్ఞులు గ్రహింపఁగలరు. The Author invites criticism.

చిరునామా:— పంగనామముల రామచంద్రరావు,
కవితాకుటీరము, తిలకుపేట, గుంటూరు.

మచ్చు పద్దెములు.

మ॥ కమలామోదమరందబిందువుల నాఘ్రాణించి
త్రావంగ రా । జమితక్రోధమునన్ మధువ్రతము
నొయ్యం దాఁ జెఱంబట్టె గో । కమునం గుందు
చు నుండు దానికిఁక సత్కాలంబు గల్పింపఁగాఁ
గమలాప్తోదయమయ్యెఁ బూర్వగిరిశృంగస్థిత
భాగంబునన్.

శా॥ స్వాతంత్ర్యం బెడఁబాసి రాక్షసవరాజ్ఞాబద్ధయై
భీతయై । సీతాదేవి కృశింప నేపగిది నీ చిత్తంబు
సైరించెనో । యేతాదృగ్గురవస్థ నీకయినవాఁ డే
డ్వంగ నామాదరిం । జేతుం బేల కరంగదో యె
ఱుంగ నిస్సీ! రామచంద్రప్రభూ!

మ॥ "శరణం బెవ్వరు లేరు నాకు శ్రితపక్షా! వచ్చి
పాలింపు" మం । చురుభక్తిన్ భవదీయనాథు
నిటు నా మ్రోడంగఁ బ్రార్థించితిం । గరుణాసాం
ద్రసువృష్టిపూరకణికాఖండంబుఁ జైజిల్కకే ।
కరణిన్ మాఱుమొగంబు నెట్టె నది నా కర్మంబు
సీతాసతీ!

శా॥ ఎందున్నాఁడవు తండ్రి! మార్వలుక వేమి? యిట్టు
లెగ్గెత్తియా । క్రందింపన్ దయపుట్టి పాపమన వౌ
రా! యెంత కార్కశ్యముం । ఇందేన్ నీదు కృపా
ద్రిమా హృదయమో శ్రీభక్తరక్షా! చిదానం
దాభోగ! భరింపు నీదు తనయుండన్ రామచం
ద్రప్రభూ!

గీ॥ అధిపు భక్తసముద్ధరణాభిలాషి
శ్రీమహావిష్ణువును నంపఁజేసికొనుచుఁ
గలశవారాశిచల్లనికాన్పు లక్ష్మి
హైందవార్థికదారిద్ర్య మార్పుఁగాక.

మ॥ కవితాంకూరము మోసులెత్తి యెటో స్వర్గంభీర
నామాంకురీ । భవపీయూషరసాభిషేచనముచే నగ్గిం
ప్లి యీ మాతృపుం । జవియేమందు ఫలంబులిచ్చె
నీకఁ జత్సంవర్ధనాసక్తికుం । బువడేన్ మామక
భావిజీవితకథాంచద్గానుసారంబుగన్.

ఉ॥ కావున సత్కవీశ్వరునిగా గణియింపకు నన్ను
నేదొ త్వ । త్పావననామసంస్మరణభవ్యసుధారస
బిందుపానలీ । లావశమైన నెమ్మది హళాహళి
బడలేక వ్రాసితిన్ । దైవమ! కాక, నా చదువు
తాహతు నీ కెఱుఁగంగరానిదే.

మ॥ లలితంబై తగు సాహితీగరిమ తాలింపనూత
నీరోడ్యాగాఁ । గల సంగీతపుఁ జేవయున్ మెఱుగు
బంగారున్నె రెంటొంబులో । జెలువం బీను వం
బులం దేయు వాస్సీమంతినీరత్నమి ట్టూ
రిమి క్షీరముం గఱపునిండన్ ధాత్రి పొం
చుతన్.